# అష్టలక్ష్మీ ఆరాధన-వైభవం

కుముదం భక్తి ఆధ్యాత్మిక మాసపత్రిక నందు
ధారావాహికముగా ప్రచురించబడినది

వ్యాఖ్యాత :
డా॥ జటావల్లభుల లక్ష్మీజగన్నాథ్
చెన్నై



పబ్లిషర్స్ : ☎ 246 2565
మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి-533 101.
 2006 వెల : 54-00



## అష్టలక్ష్మీ ఆరాధన - వైభవం

వ్యాఖ్యాత :
డా॥ జటావల్లభుల లక్ష్మీజగన్నాథ్
చెన్నై

యంత్రాలు-
శ్రీ వంగిపురపు వీరబ్రహ్మ భారతీస్వామి
జగద్గురు శంకరాచార్య
పుష్పగిరి మహాసంస్థాన సిద్ధాంతి



ముద్రణ :
మహేశ్వర ఆఫ్‌సెట్
బెస్తావీధి,
రాజమండ్రి.

ప్రకాశకులు :
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.



## అంజలి

శ్లో॥ యాదేవీ సర్వభూతేషు శక్తి రూపేణ సంస్థితా ।
నమస్తస్యై న మస్తస్యై న మస్తస్యై నమో నమః॥

మాలోని సమస్త శక్తులకూ మూలకారణమై, తన అపారకృపా కటాక్షాలతో మమ్ములను ధన్యులనుచేసి, ఈ రచన మాచే చేయించిన జగన్మాత శ్రీ సత్యమాంబా దేవికి మా హృదయపూర్వక శతసహస్ర వందనములు.

ప్రేమారాచెంతకు చేర్చుకుని, ఆత్మసాక్షాత్కారాన్ని ప్రసాదించి, చేయిబట్టుకుని వెలుగుదిశగా నడిపిస్తూ ఈ రచనకి మమ్ములను ప్రేరేపించిన శ్రీశ్రీశ్రీ సమర్థ సద్గురు సాయినాథ మహరాజ్ వారి సన్నిధిలో సర్వస్యశరణాగతి పొందటం మా జీవన గమ్యంగా భావిస్తున్నాము.

అదేవిధంగా భగవంతునిపై భక్తి విశ్వాసాలను, ఆస్తికత్వాన్ని, ధార్మిక సంపదనీ తమవారసత్వంగా మాకందించిన మా జననీ జనకులకు యివే మా నమస్సుమాంజలులు.

సత్సాంగత్యాన్ని మాకుప్రసాదించి, మా జీవితాలకు ఒక అర్థాన్ని, పరమార్థాన్ని కలుగచేసి భగవత్సేవలో మా జీవితాలను అంకితం చేసుకునే భాగ్యాన్ని ప్రసాదించిన వారు శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీ కాంచికామకోటి పీఠాధిపతులు శ్రీ శంకరాచార్య స్వామి వారు, ఎంతో దయతో ఈ చిన్న పుస్తకానికి ఆశీర్వాదపూర్వక శ్రీ ముఖాన్ని ప్రసాదించిన శ్రీ స్వామివారికి సభక్తి పురస్సరముగా సాష్టాంగ వందనములు అర్పించుకుంటున్నాము.

ఆంధ్రదేశంలో ఆస్తికత్వప్రచార నిర్వాహణలో లబ్ధప్రతిష్టులు, ఆర్ష విద్యాభూషణులు, ధర్మోపన్యాసకేసరులు కీ.శే. జటావల్లభుల పురుషోత్తం గారి ఆస్తికవారసత్వ పరంపరలో మా దంపతులం (జగన్నాథభీమేశ్వరప్రసాద్, అనంతలక్ష్మీ సత్యవతి) ఒకరం కావటం మా పూర్వజన్మవిశేషంగా భావిస్తున్నాము.



మనిషి తనంతతానుగా ఒక్కగడ్డి పరకనుకూడా సృష్టించలేడు. మరి మన కోసం సమస్తం సృష్టించి ఇచ్చిన ఆ పరమాత్మునకు మనం చేసే నిజమైన నివాళి ఆ భగవత్స ృష్టిలోని ఇతర జీవులకు సాయపడటమే అన్నారు పరమాచార్యులవారు. జీవనయానంలో మనందరం సాధారణంగా ఎదుర్కొనే సమస్యల పరిష్కారానికి ఆ జగన్మాత అంశారూపాలైన అష్టలక్ష్మీ ఆరాధన విధంగా సహాయపడుతుంది అనే విషయాన్ని పెద్దల ద్వారా గ్రంథాల ద్వారా మేము గ్రహించినంతవరకు అందరికీ అర్థమయ్యేరీతిలో అందించాలనేదే మా ప్రయత్నం. సహృదయులు, విజ్ఞులు అయిన భక్తజనులు ఈ పుస్తకాన్ని చదివి అందలి విషయాలనూ 'తమ'వారికి చెప్పి అందరూ ఆ జగన్మాతకృపకు పాత్రులయ్యేలా చేయగలరని ఆశిస్తున్నాము.

ఈ అష్టలక్ష్మీ ఆరాధన, వైభవము పుస్తకరచనకి ప్రోత్సహించినవారు మా మంచి మిత్రులు శ్రీ యి. కోటేశ్వరరావుగారు. వారికి మా కృతజ్ఞతాభివందనములు.

ప్రముఖ కార్టూనిస్టులన డా. జయదేవ్‌బాబుగారు మేము ఈ పుస్తకానికి బొమ్మలు వేయమని అడగగానే ఎంతోప్రేమతో అంగీకరించి మా రచనకి అనుగుణంగా చిత్రాలు గీసి ఇవ్వటం జరిగింది. అందుకు మేము ఎంతో కృతజ్ఞులం.

ఆంధ్రసాహిత్యంలో ముఖ్యంగా అమ్మవారి ఆరాధనలో స్త్రీలపాటలకి ఎంతో ప్రాముఖ్యత వుంది. మా మాతృమూర్తుల ద్వారా సేకరించిన కొన్నిపాటలను సందర్భోచితంగా ఈ పుస్తకంలో చేర్చటం జరిగింది.

ఈ పుస్తకరచనలో సహకరించినవారు, ఆశీర్వదించినవారు ఎందరో మహానుభావులు వున్నారు వారందరికి మా కృతజ్ఞతలు.

మంగళం మహత్.

**జటావల్లభుల లక్ష్మీజగన్నాథ్**

శ్రీ చంద్రమౌళీశ్వరాయ నమః
శ్రీ శంకరభగవత్పాదాచార్య
పరంపరాగతమూలామ్నాయ సర్వజ్ఞపీఠం
**శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠాధిపతి**
**జగద్గురు శ్రీ శంకరాచార్య స్వామివారు**
శ్రీమఠం సంస్థానం
కాంచీపురం - 631502

ఫోన్ : (04112) 222115
(04112) 224305

---

శ్రీ మహా త్రిపురసుందరీ సమేత శ్రీ చంద్రమౌళీశ్వరాయ నమః

శ్రీ మన్మహాలక్ష్మీదేవి ప్రాదుర్భావం, వైభవకటాక్షాలతో మొదలుపెట్టి వరుసగా ఎనిమిది మంది అష్టలక్ష్మీమాతల స్వరూప, వైభవ, అగ్రహాను గ్రహ ప్రభావాలు, ఆరాధన పద్ధతులు వీటివల్ల కలిగే ఫలితాల గురించి వివరించుచు శ్రీ అష్టలక్ష్మీ ఆరాధన వైభవం అను పుస్తకమును శ్రీ జటావల్లభుల ప్రసాదు దంపతులు భక్తులకు అందించుచున్నారని తెలిసి శ్రీ స్వామివారు సంతోషించు చున్నారు. ఆధునిక సమాజంలో అందరికి ఎదురయ్యే సమస్యలకి పరిష్కారం ఏమిటి అన్నది ఈ పుస్తకంలో చెప్పబడినది.

ఇటువంటి భక్తి ప్రచార గ్రంథములను రచించుచూ శ్రీ జటావల్లభుల కుటుంబం కృషిచేయాలని శ్రీ మహాత్రిపురసుందరీ సమేత శ్రీ చంద్రమౌళీశ్వరులను ప్రార్థిస్తూ శ్రీ శంకరాచార్యస్వామి వారు ఆశీర్వదించుచున్నారు.

For SRI KANCHI KAMAKOTI PEETAM
MANAGER



శ్రీ సాయి జయసాయి జయజయ సాయి
శ్రీ సాయి జయ సాయి జయజయ సాయి

# అంకితం



**శ్రీశ్రీశ్రీ సమర్థ సద్గురు**
**సాయినాథ మహరాజ్ వారి పాదపద్మములకు**

సాయినాథం మహదేవం సర్వార్థదాయకం
భక్తార్తి హరణోపాయం వందే షిర్డీ నివాసకం

**-జటావల్లభుల లక్ష్మీజగన్నాథ్**

## విషయ సూచిక

ఓం శ్రీమాత్రే నమః

## 1. శ్రీ అష్టలక్ష్మీ ఆరాధన పరమార్థం ఏమిటి?

### ప్రస్తావన

శ్లో  వందే పద్మకదిరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం
హస్తాభ్యామభయప్రదాం మణిగణైః నానావిధైర్భూషితాం।
భక్తాభీష్టఫలప్రదాం హరిహరబ్రహ్మాదిభిస్సేవితాం
పార్శ్వే పంకజ శంఖ పద్మనిధిభిర్యుక్తాం సదాశక్తిభిః॥

శ్లో॥ ధ్యాయే ల్లక్ష్మీం ప్రహసితముఖీం కోటిబాలార్కభాసాం ।
విద్యుద్వర్ణాంబరవరధరాం భూషణాఢ్యాం సుశోభామ్।
బీజాపూరం సరసిజయుగం బిభ్రతీం స్వర్ణపాత్రం
భర్త్రాయుక్తాం ముహురభయదాం మహ్యమప్యచ్యుతశ్రీః॥

శ్లో॥ సహస్రదళ పద్మస్థాం పద్మనాభ ప్రియాం సతీం ।
పద్మాలయాం పద్మవక్త్రాం పద్మపత్రాభలోచనాం ॥

శ్లో॥ పద్మ పుష్పప్రియాం పద్మపుష్పతల్పాధిశాయినీం ।
పద్మినీం పద్మహస్తాంచ సస్మితాం తాంభజేముదా॥

శ్లో॥ శ్వేతచంపక వర్ణాభాం శతచంద్రసమప్రభాం ।
వహ్నిశుద్ధాం శుకాధానం రత్నభూషణభూషితాం॥

శ్లో॥ అమూల్య రత్నరుచిరకుండలోజ్జ్వల భూషితాం ।
బిభ్రతీం కబరీభార మాలతీమాల్యశోభితాం॥

శ్లో॥ మాతర్నమామి కమలేకమలాయతాక్షి
శ్రీవిష్ణుహృత్కమలవాసిని విశ్వమాతః॥
క్షీరోదజేకమలకోమల గర్భగౌరి
లక్ష్మీప్రసీద సతతం నమతాం శరణ్యే ॥

ఆ జగన్మాత శ్రీ మహాలక్ష్మీదేవిని ఈ విధంగా ఎన్ని రకాలుగా స్తుతించినా మనకు తృప్తి కలుగదు. ఆ తల్లి శ్రీమన్నారాయణమూర్తి హృదయకమలంలో సదా నివసిస్తూ, భక్తులమైన మనలనందరినీ కన్నతల్లిలా కాచి కాపాడుతూ వుంటుంది. ఏ దైవాన్ని ప్రార్థించినా నీకు శాశ్వత ఆనందకారకమైన ముక్తినిస్తాను ఇహ సౌఖ్యాలపై భ్రమ పెంచుకోకు అంటాడు. కాని లక్ష్మీమాత మాత్రం తనను శరణువేడిన భక్తులకు ఇహలోకంలో సమస్త సంపదలూ, అష్టైశ్వర్యాలు ప్రసాదిస్తూనే శాశ్వతము లైన భక్తి జ్ఞాన వైరాగ్య సంపదలను కూడా యిస్తుంది. ఆ తల్లి భక్తులకి ముక్తి



అలవోకగా లభిస్తుంది. తల్లిప్రేమను మించినది లేదు కదా? తన పిల్లలు ఏ విధంగానూ కష్టపడకూడదు అనుకుంటుంది తల్లి. అలాగే త్రిలోక పూజిత అయిన ఆ భువనైక మాత లక్ష్మీదేవి కూడా సకల జీవావళికి అవసరమైన సమస్త శక్తులను ప్రసాదించి, వారు సమస్త సౌఖ్యాలని విజయాలను ఆనందాలను పొందేలా అనుగ్రహిస్తూ వుంటుంది. సకల మానవాళి మాత్రమే గాక సమస్త దేవతాగణం, యక్ష గంధర్వ కిన్నెర కింపురుషాదులు, మహర్షులు, రాజర్షులు, బ్రహ్మర్షులు నారదాది మునిగణం సదా ఆ తల్లిని ఆశ్రయించి, ఆమెనే కీర్తిస్తూ, ధ్యానిస్తూ తరిస్తూ వుంటారు. ఇంద్రాది దేవతలు ఆ తల్లి పాదాల చెంత శిరస్సు వంచి పాదాభివందనం చేస్తూ వుంటే మణిమయోపేతములైన వారి కిరీటాలు ఆ తల్లి పాదాలను తాకుతూ వుంటాయి. ఆ మహిమాన్వితమణుల వెలుగులో ఆ అమ్మవారి పాదాలు కొత్త వెలుగుని సంతరించుకుని ఆశ్రయించిన భక్తులకు మార్గదర్శకం చేస్తూ వుంటాయి. సమస్త లోకములూ కూడా ఆ తల్లి అనుగ్రహం కోసం సదా తహతహ లాడిపోతూ వుంటారు. విశ్వజనని అయిన ఆ తల్లికి ఎందరు పిల్లలున్నా అందరి మీదా ఆ లక్ష్మీమాత సమానమైన ప్రేమనే చూపిస్తూ వుంటుంది. నిజానికి ఎన్నో కోట్ల జీవరాశులకి తల్లి ఆ మాత. అందరికీ ఆ తల్లి అనుగ్రహం కావాలి. ఎవరి అవసరాలు వారివి. తల్లీ ఆరోగ్యం ప్రసాదించు అని కొందరు కోరుకుంటే, ఐశ్వర్యం కావాలనేవారు మరికొంత మంది. భుజబలం, ధైర్యం విజయం కావాలని కొందరనుకుంటే విద్యాబుద్ధులు కావాలనుకునేవారు మరికొంతమంది. యిలా ఎవరి కోరికలు వారివి. అందరూ ఆ తల్లినే శరణు వేడుతూ వుంటారు. ఎవరికి వారు వారి వారి పద్ధతులలో ఆ తల్లిని ఆరాధిస్తూ వుంటారు. ఇలా ఆరాధించేవారిలో సాత్వికులు వుంటారు. రాజసికులు వుంటారు. తామసికులూ వుంటారు. అందరినీ అనుగ్రహిస్తుంది ఆ తల్లి. ఎవరి అర్హతని బట్టి వారిని అనుగ్రహిస్తుంది.

పూర్వకాలంలో దైవానుగ్రహం కావాలనుకునే వారు కష్టసాధ్యమైన తపస్సు, యోగసాధన, ధ్యానం, యజ్ఞ యాగాదులు చేసేవారు. కాని నేటి కాలంలో మనం అంత కష్టపడనవసరం లేకుండా "కలౌ నామసంకీర్తనం", అనగా కలియుగంలో కేవలం నామ సంకీర్తన చేతనే భగవదనుగ్రహం లభిస్తుందని చెప్పడంవల్ల, లక్ష్మీదేవి కృపని నామ సంకీర్తన మాత్రం చేతనే సాధించవచ్చు. ఆ తల్లి అనుగ్రహం కోరేవారు అష్టోత్తర శతనామాలతోగాని, సహస్ర నామావళులతోగాని ఆ తల్లిని అర్చిస్తే ఆ మాత ప్రసన్నురాలవుతుంది. పూజ చేసుకోవటం ప్రతినిత్యం కొందరికి సాధ్యం కాకపోవచ్చు. అటువంటి వారిని మూల మంత్ర జపం, బీజాక్షర మంత్ర జపం చేయటం ద్వారానే ఆ తల్లి అనుగ్రహిస్తుంది.

ఎన్నో కోట్లజీవరాశుల అవసరాలు తీర్చే నిమిత్తం, వారికి వివిధ రకాలయిన శక్తులు ప్రసాదించే నిమిత్తం ఆ తల్లి లక్ష్మీదేవి అష్టవిధ రూపాలను దాల్చి అష్టలక్ష్మీ దేవతామూర్తుల రూపంలో మనలను అనుగ్రహిస్తోంది. అష్ట అంటే ఎనిమిది. ఈ

ప్రపంచ నిర్వాహణ కార్యంలో అష్ట అనే పదం చాలా విశిష్టమైనది. అష్ట దిక్కులు అంటారు. ఎనిమిది దిక్కులకి ఎనిమిది మంది దిక్పాలకులు. వారే అష్ట దిక్పాలకులు. ఎనిమిది దిక్కులలోనూ ఏనుగులు ఈ భూభాగాన్ని మోస్తున్నాయంటారు. అవే అష్ట దిగ్గజాలు. అలాగే అష్ట విధ దరిద్రాలను పోగొట్టి ఆ శ్రీమహాలక్ష్మీదేవి అష్టైశ్వర్యాలను ప్రసాదిస్తుంది. యీ విధంగా ఎనిమిది సంఖ్య ఎంతో విశిష్టమైనది. ఈ అష్టలక్ష్మీ అవతారాలలో ఆ తల్లి మనకి అష్టభుజమూర్తిగా కూడా దర్శనం యిస్తుంది. ఒక్కొక్క రూపంలో ఒక్కొక్క విధమైన శక్తిని ప్రసాదించే ఈ తల్లి సకల ఆయుధధారిణిగా గజరాజులచే సేవించబడుతూ, కేవలం మన బాధ్యత మాత్రమే గాక మన మీద సమస్తమైన అధికారాన్ని కలిగివున్నాను అనే విషయం మనకి తెలియజేస్తూ ఉంటుంది.

మనం తెలియక పొరపాటు చేసి తప్పు మార్గంలో వెడుతూ వుంటే తల్లిగా ఓ లెంపకాయ కొట్టి మరీ మనలను సరైన దారిలోకి తీసుకువస్తుంది. యింకా దారిలో పడని పిల్లలని చేయి పుచ్చుకుని నడిపించి మంచిమార్గంలో పెడుతుంది. లాలించి, బుజ్జగించి, బ్రతిమాలి బామాలి, బెదిరించి దండించి ఎలాగైనాసరే మనం 'బాగు'పడేలా చేస్తుంది. చిన్న పిల్లలకి కళ్ళకి గంతలు కట్టి ఏ విధంగా తల్లులు ఆడిస్తూ వుంటారో అలాగే ఆ తల్లి కూడా ఒక్కొక్కసారి మనల్ని తన మాయలో ముంచి మనం చేసే పనులని చేష్టలని చూసి ఆనందిస్తూ వుంటుంది. మనకి కావాల్సిన శక్తులన్నింటినీ ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, గజలక్ష్మి, సంతానలక్ష్మి, విజయలక్ష్మి, విద్యాలక్ష్మి, ధనలక్ష్మి అనే అష్టలక్ష్మీ రూపాలలో ప్రసాదిస్తూ వుంటుంది. మంచి మనస్సుతో అర్చించే వారినే అనుగ్రహిస్తుంది ఆ తల్లి. అష్టలక్ష్మీ దేవేరుల అనుగ్రహం కోసం చేసే ఆరాధనా పద్ధతులలో కూడా మూడు రకాల విధానాలు అత్యుత్తమమైనవి. ఒకటి షోడశోపచారములతో అష్టోత్తర శతనామాలతో అర్చించటం. రెండవది మూల మంత్రజపం. మూడవది బీజాక్షర జపం, ధ్యానం. రండి! మన బాధ్యతలన్నింటినీ ఆ తల్లిపై వేసి భక్తి శ్రద్ధలతో అష్టలక్ష్మీ మూర్తులను ఆరాధించి ఆ తల్లి కటాక్షంవల్ల క్షేమ, స్థైర్య, వీర్య, విజయ, అభయ, ఆయురారోగ్య ఐశ్వర్యాదులను పొందుదాం! అష్టలక్ష్మీ ఆరాధన గురించి తెలుసుకునే ముందుగా సాధారణంగా ఆ లక్ష్మీదేవి అనుగ్రహం గురించి, మంత్ర జపాలు, పూజాదికాల గురించి కలిగే సందేహాలను అపోహలను గురించి తెలుసుకుందాం సంశయాత్మ వినశ్యతి అన్నారు కదా!

## మన అపోహలు - సందేహాలు

సకల జీవావళికి అవసరమైన శక్తి సామర్థ్యాలను ప్రసాదించే నిమిత్తం శ్రీ మహాలక్ష్మీదేవి అష్టలక్ష్మీ రూపాలను ధరించింది. తన పిల్లలవైన మన అభ్యున్నతికోసం అహరహం ఆరాటపడుతుంది జగన్మాత. అటువంటి లక్ష్మీదేవి అనుగ్రహం గురించి, స్వభావం గురించి మనలో ఎన్నో అపోహలు వున్నాయి. పాశ్చాత్య విజ్ఞాన ప్రభావం బాగా వంటబట్టిన మన నేటితరం వారికి మన సనాతన



సాంప్రదాయం, పూజా పునస్కారాల గురించి ఎన్నో సందేహాలు అవి ఏమిటో చూద్దాం.

1. లక్ష్మీదేవి అనగానే మనకి స్ఫురణకి వచ్చేది. తన చేతుల నుంచి బంగారు కాసులను అనుగ్రహించే శ్రీ ధనలక్ష్మీదేవి రూపమే అందువల్లనే లక్ష్మీపూజ అనగానే ధనాన్ని కోరి చేసే పూజ మాత్రమే అనే అపోహ జనబాహుళ్యంలో వుంది.

2. ఇక లక్ష్మీదేవి అనుగ్రహం చంచలమైనదని, ఆ తల్లి అనుగ్రహం ఎంత కాలం మనవద్ద వుంటుందో తెలియదని, ఎప్పుడు వదలి వెళ్ళిపోతుందో తెలియదనే తప్పు అభిప్రాయం కూడా జనానీకంలో నెలకొని వుంది.

3. అదే విధంగా లక్ష్మీ సరస్వతులు అత్తాకోడళ్ళు అనీ, లక్ష్మి వున్న చోట విద్య వుండదు అనీ, విద్య వున్నచోట లక్ష్మి వుండదు. అని అంటూ వుంటారు. ఇదీ అపోహే.

4. ఇక అష్టలక్ష్మీ ఆరాధన విషయానికి వస్తే, ఇలా ఎనిమిది రకాల లక్ష్మీ రూపాలను ఎందుకు పూజించాలి? ఒక మహాలక్ష్మీ రూపాన్ని పూజిస్తే చాలదా? అనేది కూడా ఒక ప్రశ్న.

5. లోకంలో అందరూ వారి వారి పద్ధతులలో భగవదారాధన చేసుకుంటూ తమ తమ కోరికలను, అవసరాలని నెరవేర్చుకుంటూ వుండగా ప్రత్యేకంగా అష్టలక్ష్మీ ఆరాధన, పూజ, వైభవాల గురించి తెలుసుకోవలసిన అవసరం ఏమిటి?

6. తార్కిక దృష్టితో మాత్రమే ఆలోచించే నేటి ఆధునికులు లోకంలో ఏ పని అయినా సరే మనం కష్టపడి శ్రద్ధగా చేయటం వల్లనే పరిపూర్ణమైన ఫలితాన్ని పొందగలుగుతాం అంటారు. అంతే కాని ఆ పని సఫలం కావటానికి లక్ష్మీదేవో, మరే దేవతో అనుగ్రహం కావాలనటం మూర్ఖత్వం అని కూడా అంటూ వుంటారు.

7. అదే విధంగా చేసే పనిని శ్రద్ధగా చేస్తే చాలు, అదే అసలైన పూజ అనే వారూవున్నారు. యివి ఎంత వరకు నిజం?

8. అయినా ఈ యిరవై ఒకటవ శతాబ్దంలో సైన్సు విపరీతంగా అభివృద్ధి చెంది పోయి సృష్టికి ప్రతిసృష్టి చేయాలని ఉవ్విళ్ళూరుతున్న మానవ సమాజంలో, యీ విధంగా పూజల వల్ల బీజాక్షర జపాల వల్ల ఫలితాలు కలుగుతాయంటే నమ్మేవారు ఎందరు?

9. ఆధునిక యుగంలో ప్రతినిత్యం తమ తమ దైనందిన కార్యక్రమాలలో తలమునకలై ప్రతిక్షణం హడావుడి పడిపోతూ జీవించే నేటి తరం వారికి ఈ విధమైన భగవదారాధనకి సమయం ఎక్కడిది?

10. భక్తిశ్రద్ధలతో కూడిన పూజా పురస్కారాలు వగైరా వయస్సు మళ్ళి, ఓపిక తగ్గిన వృద్ధులకే గాని భుక్తికోసం కోటి విద్యలు నేర్చుకుని అహరహం ధనార్జనలో సతమతమయ్యే యువతకి ఈ ఆరాధనల అవసరం ఏమిటి?

ఇలా అనేక సందేహాలు వస్తూ వుంటాయి. ఇవన్నీ చాలా సహజమైన సందేహాలే. ఏ విషయాన్నైనా సశాస్త్రీయంగా విశ్లేషిస్తే గాని నేటితరం అంగీకరించదు. అలాంటివారి కోసమే ఈ పుస్తకం. ఈ పుస్తకం శ్రద్ధగా చదివితే పైన చెప్పిన అన్ని సందేహాలకి సమాధానాలు దొరికి మనకి ఏం కావాలో కూడా మనకి తెలుస్తుంది.

### మనకి ఏం కావాలి?

అందరూ కోరుకునేది సుఖవంతమైన జీవితం. ఏ విధమైన కష్టాలు గాని, సమస్యలు గాని లేకుండా, ఎవరూ మన ఆనందమయ జీవితానికి అడ్డురాకుండా సాఫీగా, సజావుగా, తృప్తిగా జీవనం గడపటమే మనందరి లక్ష్యం. తాను కష్టపడి చదవనక్కరలేకుండానే మంచి మార్కులు వచ్చేసేయాలని ఒక చిన్న విద్యార్థి ఆశిస్తే, కష్టపడకుండానే ఐశ్వర్యాలన్నీ తనకి లభించి గొప్ప వాడినయిపోవాలని అని అనుకుంటాడు. మధ్యతరగతి సంసారి. ఇక వయోవృద్ధుల విషయానికి వస్తే తాను శ్రద్ధగా నియమనిష్టలతో పూజించకపోయినా సరే, ఆ భగవంతుడు తనని మాత్రం అనుగ్రహిస్తే బాగుండును అని అనుకుంటూ వుంటారు. ఇలా అందరిదీ ఒకటే కోరిక ఆనందమయ జీవనం. దీనికి వయస్సుతో కాని, కులబేధాలతో కానీ నిమిత్తం లేదు.ఆ ఆనందం కూడా ఒక్కొక్కరికి ఒక్కో విధంగా వస్తుంది. కొందరికి డబ్బుమీద మమకారం. ఎంత ఎక్కువ సంపాదిస్తే అంత ఆనందం. మరి కొందరికి బాగా చదువుకుని, మంచి వుద్యోగం సంపాదించుకొని సమాజంలో గౌరవం, హోదా సంపాదించడమే నిజమైన ఆనందం. కొందరు ఏ అనారోగ్యము లేకుండా పరిపూర్ణ

> ఇక నేటి ఆధునిక సమాజంలో అందరికీ సమస్యలే. సమస్యలేని వారు లేనేలేరు. తినటానికి తిండిలేక ఆకలి బాధలతో విసిగి వేసారిపోయే దరిద్ర నారాయణులకి ఒకటే సమస్య ఆహారం. అయితే మిగిలిన వారికి ఎన్నో రకాల సమస్యలు. పుష్కలంగా ఐశ్వర్యం అందుబాటులో వున్నా మనశ్శాంతి కరువై కనీసం నిద్రకి కూడా నోచుకోని వారు ఎందరో వున్నారు. మరికొందరు ఎంత తిన్నా, తిన్నది ఒంటబట్టక సదా అనారోగ్యంతో బాధపడుతూ వుంటారు. తెలివి తేటలు లేక జీవితంలో సరైన ఉద్యోగం దొరకలేదని కొందరు అలమటిస్తూవుంటే, తమ తెలివితేటలు ఎవరూ గుర్తించటం లేదని, తమకి సరైన స్థానం లభించలేదని మరికొందరు బాధపడుతూ వుంటారు. అసలు సంతానమే లేదని కొంతమంది మనోవ్యాధితో బాధపడుతూవుంటే, మరి కొందరు తమకి పుట్టిన సంతానం చేసే నిర్వాకం వల్ల యీ లోకంలోనే నరక బాధలు అనుభవిస్తూ వుంటారు. యిలా ధనం వుంటే మనశ్శాంతి లేక, అన్ని బాగా వుంటే ఆరోగ్యం బాగాలేక డబ్బు, ఆరోగ్యం వుంటే పిల్లలు వృద్ధిలోకి రాక అనేక మంది ఎన్నో విధాల బాధలు పడుతూ వుంటారు. యిలా ఎందుకు జరుగుతుంది? ఈ సమస్యలకి పరిష్కారం ఏమిటి అన్నది ఈ అష్టలక్ష్మీ ఆరాధన - వైభవం అనే ఈ పుస్తకంలో చెప్పబడింది.



ఆరోగ్యం కావాలని అనుకుంటే, ఇంకొందరు జీవితంలో అన్ని విషయాలలోనూ ధైర్యంగా ముందుకు దూసుకుపోతూ అన్నిరంగాలలో సర్వప్రథములు కావాలని కోరుకుంటారు. మరి కొందరికి తమ పిల్లలు కష్టపడి పైకి వచ్చి హాయిగా సంతోషంగా వుంటే అదే ఆనందం. కొందరికి తమకి వున్నది యితరులకి పంచి ఇవ్వడం ఆనందం. యీలా ఎవరి కోరికలు వాళ్ళవి. ఎవరి ఆనందం వారిది. ఇలాంటి అన్ని రకాలయిన ఆనందములను మనకు ప్రసాదించ గలిగినది ఆ మాత లక్ష్మీదేవే. నిజానికి మనంద రికీ కావల్సింది మనశ్శాంతి. ఆత్మసంతృప్తి ఆ రెండూ కూడా భగవంతుని అనుగ్రహం వల్లనే సాధ్యం. ఇవి రెండూ వున్న వాళ్ళకి జీవనం ఎంతో ఆనందమయంగా ఉంటుంది. అహంకారం అనేది ఆనందానికి బద్ధశత్రువు. ఎప్పుడయితే అహంకారం తలకెక్కుతుందో అప్పుడే మన దగ్గర్నుంచి ఆ తల్లి లక్ష్మీదేవి అనుగ్రహం దూరమవుతుంది. అందువల్ల అహంకార రహితమైన జీవనమే మనం కోరుకోవాలి. ఆ తల్లి దయవల్లనే మనకి అన్ని ఆనందాలు సమకూరుతాయి. ఏపనినైనా మనం మన శక్తి సామర్థ్యాలవల్లనే చేయగలుతున్నామా? ఆలోచించండి.

ఏ పని సాధించాలన్నా మూడు రకాలయిన శక్తులు కావాలి. ఒకటి ఫలానా పని సాధించాలి అనే సంకల్పం కావాలి. మన మనస్సులో దృఢ సంకల్పం కలిగినప్పుడే కదా ఆ పని సాధించగలుగుతాం. ఒక రెండవది సాధన చేసే మార్గం తెలియాలి. మూడవది ఆ పని నిర్వహించడానికి అవసరమైన శక్తి సామర్థ్యాలు ఉండాలి. ఈ మూడు శక్తులూ సమకూరిన తరువాత మనం ఎంత శ్రద్ధగా ఆ పని చేస్తున్నామన్న విషయంపై ఫలితం ఆధారపడి ఉంటుంది. కాని పని చేయడానికి అవసరమయ్యే ఈ మూడు ఆ శక్తులు మనకు లభించేది సర్వశక్తి స్వరూపిణి జగన్మాత ఆ లక్ష్మీదేవి కటాక్షం వల్లనే అనిగ్రహించాలి. ఏదైనా పని అనుకున్నట్లుగా అవ్వకపోతే అబ్బే నాకు లక్ (అదృష్టం) లేదు అనటం ఈ కాలంలో సాదారణంగా వింటూ వుంటాం. కాని సమస్తమైన అదృష్టాలూ మనకి ఆ తల్లి లక్ష్మీదేవి కటాక్షం వల్లనే కలుగుతాయి. ఆతల్లి కటాక్షం లేకుండా మనం ఏ పనీ చేయలేము. మనల్ని కన్న తల్లిలా తోడునీడగా వుంటూ కాపాడేది ఆ తల్లి లక్ష్మీదేవే. అవసరంలో వున్నాను ఆదుకో అమ్మా అని ఆర్తిగా పిలిస్తే 'ఓ'యని పలికి మన సమస్యలు తీరటానికి అవసరమైన శక్తి సామర్థ్యాలు యిచ్చి కాపాడేది ఆ తల్లే. మన శరీరానికి కాని, మనస్సుకి కాని దెబ్బతగిలినపుడు అప్రయత్నంగా మన నోటి వెంట వచ్చేది అమ్మా అన్న ఆర్తనాదమే.

### అష్టలక్ష్మీ మూర్తులు అందించే శక్తులు

ఎనిమిది విధాలయిన అవతారాలను దాల్చిన ఆ తల్లి భక్తులందరికీ అవసరమైన సమస్తమైన శక్తులను ఈ ప్రకారంగా ప్రసాదిస్తోంది.

1. శ్రీ ఆదిలక్ష్మీదేవి - ప్రాణశక్తికి, దైహిక మానసిక ఆరోగ్యానికి అధిష్టాన దేవత

2. శ్రీ ధాన్యలక్ష్మీ మాత - సకల సస్యసంపదలకి, పాడి పంటలకి అధిష్టాన దేవత, శారీరక ధారుఢ్యాన్ని ప్రసాదించే తల్లి.

3. శ్రీ ధైర్యలక్ష్మీమాత - ధైర్య సాహసాలు, మనోబలం ప్రసాదించే తల్లి

4. శ్రీ గజలక్ష్మీమాత - సమస్త శుభాలకీ అధిష్టాన దేవత

5. శ్రీ సంతాన లక్ష్మీ మాత - సత్సంతాన ప్రాప్తికి అధిష్టాన దేవత.

6. శ్రీ విజయలక్ష్మీ మాత - సకల కార్యసిద్ధికీ, సర్వత్రా విజయసాధనకి అధిష్టాన దేవత.

7. శ్రీ విద్యాలక్ష్మీ మాత - విద్యావివేకాలకి, మన అర్హతలకి తగిన గుర్తింపు రాణింపు కలిగేలా చేసే చల్లని తల్లి

8. శ్రీ ధనలక్ష్మీ మాత - సకలైశ్వర్య ప్రదాయిని. అన్ని సంపదలకి అధిష్టాన దేవత.

ఈ శ్రీఅష్టలక్ష్మీ ఆరాధన వైభవం పుస్తకం ద్వారా శ్రీమన్మహాలక్ష్మీదేవి ప్రాదుర్భావం, వైభవ కటాక్షాలతో మొదలు పెట్టి వరుసగా ఎనిమిది మంది అష్టలక్ష్మీ మాతల స్వరూప, వైభవ, ఆగ్రహానుగ్రహ ప్రభావాలు, ఆరాధన పద్ధతులు, వీటి వల్ల కలిగే ఫలితాల గురించి వివరించటం జరిగింది. శ్రద్ధా భక్తులతో ఈ పుస్తకాన్ని చదివి ఆ జగన్మాత అనుగ్రహం వల్ల అందరూ సుఖ సంతోషాలతో ఆనందంగా వుండాలని మా ఆకాంక్ష.

సర్వేజనాః సుఖినోభవన్తు

## 2. శ్రీమన్మహాలక్ష్మీ దేవి వైభవము

### శ్రీమహాలక్ష్మీదేవి ప్రశస్తి

శ్లో॥ లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురామ్
శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియాం॥

శ్లో ॥ **జయతు జయతు లక్ష్మీర్దేవ సంఘాభిపూజ్యా**
**జయతు జయతు భద్రా భార్గవీ భాగ్యరూపా**
**జయతు జయతు నిత్యానిర్మల జ్ఞానవేద్యా**
**జయతు జయతు సత్యా సర్వభూతాంతరస్థా ॥**

చరాచర సృష్టిలోని సకల జీవావళికి తల్లి ఆ జగన్మాత లక్ష్మీదేవి. కంటికి రెప్పలా ఆ తల్లి మనలందరినీ రక్షిస్తూ వుండటం వల్లనే మనం సుఖ సంతోషాలతో, ఆయురారోగ్యాలతో ఈ భువిలో జీవించ గలుగుతున్నాము. సకల శుభాలూ,



సంపదలూ, అష్టైశ్వర్యాలూ ప్రసాదిస్తూ అలౌకిక ఆనందదాయిని, పరతత్వ సంధాయిని, మోక్షప్రదాయిని కూడా అయిన ఆ తల్లిని సమస్త దేవతాగణం సదా సేవిస్తూ వుంటారు. ఆ తల్లి నిత్య సత్యస్వరూపిణి. శాశ్వతమైన, నిజమైన ఆనందం ఆ మాతఅనుగ్రహంవల్లనే లభిస్తుంది. నిజానికి మనమందరం ఆ తల్లి ప్రతి రూపాలమే. అందరి హృదయాలలోను ఆమెనివాసమై వుంటుంది. ఆ విషయం తెలుసుకోవడమే నిజమైనజ్ఞానం. ఆజ్ఞానం కూడా ఆతల్లిని సేవించటంవల్లనే లభిస్తుంది.

**యాదేవీసర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః**

జీవులందరిలోనూ చైతన్యశక్తి రూపంగా ఆ విశ్వమాత నెలకొని వుంటుంది. అన్ని రకాల శక్తులూ ఆ తల్లి కరుణ వల్లనే లభిస్తాయి. బ్రహ్మరుద్ర ఇంద్రాదులచే సేవించబడే ఆ మాత స్థితికారకుడైన శ్రీమహావిష్ణువుకు ఇల్లాలు. మహాలక్ష్మైచ విద్మహే విష్ణుపత్నీచ ధీమహి తన్నో లక్ష్మీప్రచోదయాత్" అన్నారు. స్థితికారకుడైన విష్ణుమూర్తి సాత్వికమూర్తి. స్థితి నిర్వాహణ బాధ్యతలో ఆ శ్రీమన్నారాయణమూర్తికి చేదోడు వాదోడుగా తన వంతు పాత్రని ఎంతో సమర్థవంతంగా పోషిస్తుంది విష్ణుపత్ని అయిన శ్రీమహాలక్ష్మీదేవి. దుష్టశిక్షణ చేసి సజ్జనులను రక్షించి ధర్మసంస్థాపన చేయటం కోసం, ఆ జగత్పిత శ్రీమహావిష్ణువు ఏరకంగా వివిధ రూప విశేషాలతో అవతారాలను దాల్చటం జరిగిందో, అదే విధంగా జగన్మాత లక్ష్మీదేవి కూడా లోక కళ్యాణానికై అష్టలక్ష్మీ రూప ధారణ చేసింది. ఆ తల్లి ఆ అవతారాలన్నీ తన పిల్లలమైన మన అభ్యున్నతి కోసమే దాల్చింది.

శ్రీ అనే పదం ద్వారా లక్ష్మీదేవి వేదాలలో సంపద, ఐశ్వర్యము, శక్తి, శుభం అనే అర్థాలలో గుర్తించబడింది. విష్ణుపురాణం ద్వారా లక్ష్మీదేవి పుట్టు పూర్వోత్తరాలు, బ్రహ్మవైవర్త, మార్కండేయ పురాణాల ద్వారా లక్ష్మీదేవి ప్రశస్తి, ఆమె నివాస స్థానాలు గురించి వివరంగా తెలుస్తోంది. వేదాంగాలలో ముఖ్యమైనది అయిన శతపథ బ్రాహ్మణంలో లక్ష్మి అందానికి అధిష్టానదేవతగా చెప్పటం జరిగింది.

శ్లో॥ **యాసా పద్మాసనస్థా విపుల కటితటీ పద్మపత్రాయతాక్షీ**
**గంభీరావర్త నాభిః స్తనభరనమితా శుభ్రవస్త్రోత్తరీయా**
**లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైః మణిగణఖచితై స్నాపితాహేమకుంభైః**
**నిత్యం సాపద్మహస్తామమవసతుగృహేసర్వమాంగళ్యయుక్తా॥**

నిత్యం ఆ లక్ష్మీదేవి ఆరాధన జరిగే వారి గృహంలో సమస్త శుభాలూ నెలకొని వుంటాయి. ఋగ్వేదంలోని శ్రీసూక్తంలో లక్ష్మీదేవి దివ్యమైన గజేంద్రాలు (ఏనుగులు) యిరువైపులా సేవిస్తూ వుండగా మహా పద్మంలో పద్మాసన భంగిమలో కూర్చుని వుంటుంది అని వర్ణించబడింది. ఆ గజేంద్రాలు బంగారు కలశాలతో ఆ తల్లిపై అమృతవర్షం కురిపిస్తూ వుంటాయి.లోక వ్యవహారాలలో "లక్ష్మి" అనే పదం మన

నిత్య జీవితంతో పెనవేసుకు పోయిన ఒక మహత్తరమైన ప్రజ్ఞావిశేషం. గృహానికి శోభనిచ్చే ఇల్లాలుని గృహలక్ష్మిగా సంభావిస్తూ వుంటాం. అదృష్టవంతుడైన ఒక వ్యక్తిని గూర్చి చెప్పాలంటే వాడికేమిరా లక్ష్మీ పుత్రుడు అంటాం. అలాగే ఒక అందమైన ఆడపిల్లని చూసినప్పుడు ఆహా ఈ పిల్ల మొహంలో లక్ష్మీకళ తాండవిస్తోంది అని అనుకుంటాం. విరిసిన ముద్ద మందారం, తామరపూవులను చూసినపుడు మనసు దైవీకమైన భావనతో నిండిపోయి ఆ తల్లి లక్ష్మీదేవే గుర్తుకు వస్తుంది.

## శ్రీ మహాలక్ష్మీదేవి ప్రాదుర్భావం

ఆ జగన్మాత లక్ష్మీదేవిని తలుచుకోగానే మన మనసులో రెండు రకాల దృశ్యాలు ఆవిష్కారం అవుతాయి. ఒకటి 'పాలకడలిలో శేషశయనమున' పవళించే ఆ శ్రీమన్నారాయణమూర్తితో కూడుకుని అఖిలలోక సంరక్షణాభారాన్ని వహించే వైకుంఠలక్ష్మీ రూపం, మరొకటి పద్మాసన స్థితే దేవి అయిన ఆ పరబ్రహ్మ స్వరూపిణి. తన వరద హస్తాలతో బంగారు కాసుల వర్షం కురిపించే ఐశ్వర్యలక్ష్మీ రూపం. 'లక్ష్మీం క్షీర సముద్ర రాజతనయాం' అంటూ క్షీరసాగర మథనం తర్వాత ఆ పాల సముద్రంలోంచి ఉద్భవించిన లక్ష్మీదేవిని అనేక విధాల స్తుతిస్తూ వుంటాం. అయితే పురాణాలలో కొన్ని చోట్ల "భార్గవీ భాగ్యరూపాం" అంటూ లక్ష్మీదేవి భృగుమహర్షి అభిమాన పుత్రికగా కూడా వర్ణించబడింది. ఆ లక్ష్మీదేవి ఆవిర్భావం అసలు ఏ విధంగా జరిగింది. ఆ తల్లి స్వరూప స్వభావాలు ఎటువంటివి అనేది తెలుసుకోవడం ఎంతో అవసరం.

ఏకం సత్‌విప్రాః బహుధావదంతి అన్నారు. అంటే నిత్యసత్య స్వరూపమైన ఆ పరబ్రహ్మతత్త్వం ఒకటే. కాని విద్వాంసులు దీనినే అనేక విధాలుగా వర్ణిస్తూ వుంటారు అని అర్థం. ఎందువల్ల అని ఆలోచిస్తే ఈ సకల చరాచర ప్రపంచం యొక్క సృష్టి, స్థితి, లయ కార్యాలు నిర్వహించటం కోసం పరబ్రహ్మతత్త్వం బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా రూపాలు దాల్చినదని అర్థమవుతుంది. సత్త్వగుణం అంటే తొందరపాటు లేని శాంత స్వభావం, బాధ్యత వహించే గుణాలు కలిగిన శ్రీమహావిష్ణువు స్థితికార్య బాధ్యతని వహించటం జరిగింది. స్థితి కారకుడైన విష్ణుమూర్తి యొక్క భావనాశక్తి శ్రీమహాలక్ష్మీదేవి. శ్రీమన్నారాయణమూర్తి వహించే సృష్టి నిర్వాహణా బాధ్యతకి ప్రేరణాశక్తిగా వుంటూ ఆ బాధ్యతలో తన వంతు పాత్రను పోషిస్తూ వుంటుంది మహాలక్ష్మీదేవి. విష్ణుమూర్తితో పాటే అన్ని అవతారాలలోనూ తాను కూడా ఉద్భవించి లోకోద్ధరణ చేసింది. భార్యాభర్తలు అంటే ఒకే లక్ష్యానికి రెండు పార్శ్వాలన్నమాట. ఏ కార్యాన్నయినా ఇద్దరూ కలిసి మనస్ఫూర్తిగా నిర్వహిస్తేనే అది పరిపూర్ణం అవుతుంది. సనాతన వైదిక ధర్మ ప్రతిపాదిత సిద్ధాంతాలననుసరించి భార్య భావనాశక్తిగాను, ఆ భావనకి క్రియారూపం ఇచ్చే క్రియాశక్తి భర్తగాను వర్ణింపబడ్డారు. భావనాశక్తి, క్రియాశక్తుల సంగమమే దాంపత్యం అంటే. అటువంటి దాంపత్యానికి నిదర్శనం ఆది దంపతులయిన లక్ష్మీనారాయణులు.



సృష్ట్యాదిలో చరాచర జగత్తు యావత్తూ కల్లోల వారాధిలో మునిగిపోయి వున్న సమయం అది శ్రీమహావిష్ణువు లీలావినోదిగా ఒక చిన్నపిల్లవాని రూపం దాల్చి వటపత్రం మీద శయనముద్రలో ధ్యానంలో వున్నాడు. అతనే వటపత్రశాయి. విష్ణుమూర్తి ఆలోచన అంతా జరగబోయే సృష్టిని గురించి, దాని నిర్వహణ గురించే అనేక కోట్ల జీవరాశుల సృష్టి జరిగిన తరువాత వాటి బాగోగులను పరిశీలిస్తూ వాటి అభ్యున్నతికి కృషి చేసే బాధ్యత ఎవరు తీసుకుంటారు? కన్నతల్లిలా ఆ జీవరాశిని పాలించే ఆ శక్తి ఎవరు? అని ఆలోచిస్తూ వుంటాడు విష్ణువు. ఆయన సందేహాన్ని తీర్చగల శక్తి సమర్థత ఎవరికి వుంటుంది? ఆ పనిచేసినది శ్రీ మహామాయ. ఆమె విష్ణుమూర్తి యొక్క భావనాశక్తి. తేజోరూపిణి అయిన మహామాయ మొదటగా శబ్దరూపధారణ చేసి

"సర్వం ఖలిద్వమేవాహం నాన్య దస్తి సనాతనమ్" అని పలికింది.

ఈ సర్వసృష్టి నిర్వాహణకార్యంలో నీతో కలసి పనిచేసే శక్తిని నేనే. నేనే నీవు. నీవే నేను. నేను కాని సనాతన శక్తి వేరే ఏమీ లేదు? అని అంటుంది. అప్పుడు విష్ణుమూర్తి నీవు ఎవరు? నీ స్వరూప స్వభావాలు ఎలా వుంటాయో నేను చూడాలనుకుంటున్నాను అని అడిగే సరికి. ఆ మహామాయ "లోకాలను తల్లిలా కాపాడాలనే" తన లక్ష్యానికి ఒక రూపాన్ని యిచ్చి లక్ష్మిగా విష్ణువుకి దర్శనమిచ్చింది. అలాగే లక్ష్యం రూపధారణ చేస్తే రూపం అయిందన్న మాట. లక్ష్యం మాధవుడికి చేరుకుని లక్ష్మి అయ్యింది. లక్ష్మీదేవి విష్ణువును చేరుకుని అతడిని 'మా'ధవుడిని చేసింది. మహామాయ లక్ష్యంశగా వుద్భవించిన లక్ష్మీదేవిని –

"నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపూజితే
శంఖుచక్ర గదాహస్తే మహాలక్ష్మీ నమోస్తుతే" అని స్తుతిస్తూ వుండం పరిపాటి.

ఆ విధంగా ఆ మహాలక్ష్మి యొక్క మొదటి నామం మహామాయగా మహాలక్ష్మి అష్టకంలో చెప్పబడింది. ఆ తరువాతే మిగిలిన నామాలన్నీ. మహామాయతేజోరూపం. శబ్దంగాను ఆ తరువాత లీలారూపంగా లక్ష్మీదేవి ఆకృతిలోనూ ఆవిర్భవించిం దన్నమాట. అయితే ఆ తల్లి స్వరూపం ఎలా వుంటుంది?

### భగవంతుడు అంటే ఎవరు ?

భగము అంటే ఆరు. ఐశ్వర్యం, ధర్మం, యశస్సు, సిరి, జ్ఞానము, వైరాగ్యము అనే ఆరింటిని షడ్గుణైశ్వర్యాలు అంటారు. ఇంతకు మించి మనం కోరుకోదగిన, మనకి కావలసిన ఐశ్వర్యాల మరేమీ వుండవు. ఈ ఆరు రకాల ఐశ్వర్యాలని మనకి ప్రసాదించేవాడే భగవంతుడు.



శ్రీమహాలక్ష్మీదేవి ప్రాదుర్భావము

## శ్రీ మహాలక్ష్మి దేవి స్వరూప విశేషాలు

శ్లో॥ పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి
విశ్వప్రియే విష్ణు మనోనుకూలే త్వత్పాదపద్మం మయిసన్నిధత్స్వ॥

శ్లో॥ పద్మాసనే పద్మ ఊరూ పద్మాక్షీ పద్మ సంభవే
త్వంమాం భజసి పద్మాక్షి యేన సౌఖ్యం లభామ్యహమ్॥

ఆ శ్రీమహాలక్ష్మిదేవికి పద్మాలంటే ఎంతో యిష్టం. తామరపూవులకి లక్ష్మీదేవికి అవినాభావ సంబంధం వుంది. శ్రీసూక్తంలో వర్ణించబడినట్లుగా పద్మినీ జాతికి చెందిన స్త్రీ మూర్తి అయిన ఆ తల్లి, పద్మనాభుడైన శ్రీమహావిష్ణువుకి ఇల్లాలై మహా పద్మంలో పద్మాసన భంగిమలో కూర్చుని వుంటుంది. పద్మాల వంటి విశాలమైన కన్నులుగల ఆ తల్లి తన రెండు చేతులలో పద్మాలను ధరించి వుంటుంది. ఇంకా అలంకరణార్థం పద్మాలహారం ధరించి వుంటుంది. ఈ రకంగా పద్మాన్ని తన ఆసనంగా అలంకారంగా చేసుకున్న ఆ తల్లి, పద్మాల ద్వారా ఒక వేదాంత రహస్యాన్ని మనకి బోధిస్తోంది. పద్మం నీళ్ళలో పెరుగుతుంది. సదా నీళ్ళలోనే వున్నప్పటికి పద్మానికి నీరు అంటుకోదు. అందుకనే "తామరాకుపై నీటి బొట్టు" అని అంటారు అలాగే మనం కూడా ఈ సంసార చక్రంలో తిరుగుతూ వున్నప్పటికీ ఈ భవబంధాలపై మోజు పెంచుకోకుండా అంటీ ముట్టన్నట్లుగా వ్యవహరించాలి అనే విషయం ఈ పద్మం ద్వారా అమ్మవారు మనకి తెలియజేస్తోంది. ఆ తల్లి కుడి చేతిలో ధరించిన పద్మం చైతన్య శక్తికి సంకేతం. ఎడమచేతిలోని పద్మం ఆ తల్లి కైవల్యప్రదాయిని అని తెలియజేస్తూ వుంటుంది. ఆతల్లి నాలుగు చేతులు నాలుగు దిక్కులను తెలియ జేస్తూ ఆమె సర్వవ్యాపక తత్వాన్ని తెలియజేస్తూ వుంటాయి. భక్తులకు రెండు చేతులతో అభయప్రదానం చేస్తూ వుంటుంది ఆ తల్లి. బంగారం రంగు జరీ అంచు గలిగిన ఎర్రటి రంగు పట్టుచీర ధరించి సర్వాభరణ భూషితగా వుంటుంది లక్ష్మీదేవి. ఎరుపురంగు చైతన్యానికి, చురుకుదనానికి సంకేతం. ఆ పట్టుచీరకి వున్న బంగారపు రంగు అంచు ద్వారా తాను ఎల్లప్పుడూ భక్తులకు ఐశ్వర్యాన్ని ప్రసాదించడానికి తయారుగా వుంటాను అని తెలియజేస్తోంది. శ్రీ భగవతీతత్త్వ సిద్ధాంతాన్ని అనుసరించి లక్ష్మీదేవి వదనంలో ధవళకాంతుల రూపంలో పరమశివుని అంశ వుండగా, ఆమె చేతులలో విష్ణుమూర్తి క్రియాశక్తిగా వుంటాడు. బ్రహ్మపాదాల చెంత సేవిస్తూ వుండగా నడుము వద్ద ఇంద్రుడు, ఊరువులలో వరుణుడు అంశారూపంగా వుంటారు. సూర్యచంద్రులు ఆ తల్లి కనుసన్నలలో మెలగుతూ వుంటారు. ఆమె భక్తుల మీద చంద్రుని వెన్నెల కన్నా చల్లనైన కృపాదృక్కులు ప్రసరింపజేస్తూ వుంటుంది. పవిత్రతనీ,

స్వచ్ఛతనీ తెలిపే పద్మాలను ధరించి వుండి సదాగజరాజులచే సేవింపబడుతూ వుంటుంది లక్ష్మీదేవి. ఏనుగుల చేత సేవించబడటం అధికారానికి, రాజసానికి సంకేతం. పవిత్రత, అధికారం రెండు కూడా ఆ తల్లి రూపంలో కనబడుతూ వుంటాయి. సర్వాభరణ భూషితయై, జగజ్జేగీయమాన మణిమయోపేత కిరీటధారిణి అయిన ఆ తల్లి చిరునవ్వుతో భక్తులను ఆదరిస్తూ వుంటుంది. ఆ తల్లి రూపాన్ని ఎంత వర్ణించినా తనివితీరదు. మణిమయ మంజీర విరాజమానమైన ఆ తల్లి పాదపద్మాలను సదా తమ హృదయాలలో నెలకొల్పుకుని ధ్యానించే వారికి ఏ లోటూ వుండదు. నిజానికి ఆ తల్లి రూపాన్ని వర్ణించడానికి సమస్త వేదవిదులకీ విద్వాంసులకీ కూడా సాధ్యం కాదు.

సాత్వికులైన సాధకులు సాత్వికమూర్తి, స్థితికారకుడైన విష్ణువుతో కూడుకున్న లక్ష్మీదేవిని కొలుస్తారు. ఆమె వైకుంఠ లక్ష్మి ఆమె వాహనం గరుత్మంతుడు. ఆ తల్లి మోక్షాన్ని ప్రసాదిస్తుంది. రాజసిక ప్రవృత్తిగల సాధకులు గజలక్ష్మిని ఆరాధిస్తారు. ఏనుగులచే సేవించబడే ఆ తల్లి అధికారాన్ని ప్రసాదిస్తుంది. ఇక తామసిక ప్రవృత్తి కలిగిన వారు, తంత్రవాదులు గుడ్లగూబ వాహనంగా గల ధనలక్ష్మిని సేవిస్తారు. గుడ్లగూబ గుడ్డి నమ్మకానికి, అలసత్వానికి నిదర్శనం. సకల జీవులు పగలు పనులన్నీ చేసుకుని రాత్రి నిద్రపోతే గుడ్లగూబకి రాత్రిళ్ళు మాత్రమే కళ్ళు కనబడతాయి అందువల్ల అది రాత్రినే కోరుకుంటుంది. ఇటువంటి తామసిక ప్రవృత్తిని అణచటమే ఆ తల్లి ఆదర్శం. అందుకే దానిని వాహనంగా చేసుకుంది ధనలక్ష్మిరూపంలో.

## శ్రీ లక్ష్మిదేవి స్వభావం

లక్ష్మీదేవి భక్తులను కన్నబిడ్డల కంటే ఎక్కువగా చూసుకుంటుంది. ఆ తల్లి భక్తులచేయి బట్టుకుని, అతిజాగ్రత్తగా లక్ష్యం వైపుగా తీసుకువెళ్ళి విజయాన్ని సాధించిపెడుతుంది. నమ్ముకున్న భక్తులకు కైవల్యప్రాప్తిని అనుగ్రహిస్తుంది. కాని ఆ తల్లి తన యెడల నిర్లక్ష్యాన్ని కాని అమర్యాదని కాని ఎంత మాత్రం సహించదు. లక్ష్యమే రూపధారణ చేసుకుని లక్ష్మీదేవి ఆవిర్భవించింది. కాబట్టి అలక్ష్యాన్ని ఏ మాత్రం క్షమించదు. ఎదుటి వ్యక్తి తండ్రి అయినా, భర్త అయినా అలక్ష్యానికి, అమర్యాదకి తగిన మూల్యం చెల్లించవలసిందే. శుచిశుభ్రతలు వున్నచోట, పవిత్ర భావనలు గల చోట, ప్రకాశవంతమైన ప్రదేశాలలో మాత్రమే ఆ తల్లి ఉంటుంది. బాహ్యమైన శుభ్రత వుంటే సరిపోదు. దానితో పాటు అంతరంగంలో కూడా పరిశుద్ధంగా వుంటేనే ఆ తల్లి అనుగ్రహం లభిస్తుంది. ఒక వేళ లక్ష్మి (సంపద) తమ వద్ద వుంది కదా అని నిర్లక్ష్య ధోరణితో ప్రవర్తిస్తే తక్షణం ఆ ప్రదేశాన్ని నిర్దాక్షిణ్యంగా వదిలిపెట్టి వెళ్ళిపోతుంది.



## "శ్రీ" అంటే ఏమిటి?

మనం వాడుకలో ఎవరినేనా గౌరవంగా సంబోధించాలీ అంటే శ్రీ... ఫలానా అని అంటాం. అంటే మనకి శ్రీ అనే పదం గౌరవ వాచకంగానే తెలుసు. అసలు శ్రీ అనేది ఒక అక్షరం కాదు ఒక మాట అది శ్రీ అనే పదం వేదకాలం నుంచి కూడా వాడుకలో వుంది శ్రీ అనే పదంలో శ, ర అనే అక్షరాలు వున్నాయి. శ అనేది శాశ్వత తత్వానికి, పరిపూర్ణత్వానికి, ర అనేది రసానికి అనుభూతికి సంకేతంగా వేదాలలో చెప్పబడ్డాయి. "శ్రీ" ని చేరిస్తేనే కాని వేదకాలంలో ఏమాటకీ పరిపూర్ణత్వం సిద్ధించినట్లుగా భావించేవారు కాదు. ఏ దేవత పేరు ముందైనా శ్రీ చేరిస్తేనే ఆ దేవత అనుగ్రహం కలుగుతుందని భావించేవారు. ఖిలా సూక్తంలోని భాగమైన శ్రీ సూక్తంలో శ్రీ అనే పదం లక్ష్మీదేవి అనే అర్థంలో ఉపయోగించటం జరిగింది. శ్రీ అంటే సంపద అనే అర్థం కూడా వేదాలలో చెప్పబడింది. పదానికి ముందు మాత్రమే గాక పదానికి చివరలో కూడా "శ్రీ"ని ఉపయోగించడం పూర్వకాలంలో వాడుకలో వుండేది. మన పూర్వీకులైన శాతవాహన రాజుల కాలంలో శాంతిశ్రీ, యజ్ఞశ్రీ అనే పేర్లు వాడుకలో వుండేవి. శ్రీ అనే పదం ఎంతో మహత్తరమైనది, శక్తివంతమైనది. ఫలదాయకమైనది.

## శ్రీలక్ష్మిదేవి నివాసం ఉండే స్థానాలు

బ్రహ్మవైవర్త పురాణంలో ఎటువంటి వ్యక్తుల వద్ద, ఎటువంటి వస్తువులలో లక్ష్మి స్థిరంగా వుంటుందో చెప్పబడింది. ఒకసారి లక్ష్మీదేవిని భూదేవి అడుగుతుంది. లోకంలో అందరూ నువ్వు చాలా చంచలమైన దానివని, స్థిరంగా ఒక చోట వుండవని, ఎప్పుడు విడిచి పెట్టి వెళ్ళిపోతావో తెలియదని అనుకుంటూ వుంటారు. అది నిజమేనా? నువ్వు ఏఏ వ్యక్తుల వద్ద ఏఏ వస్తువులలో వుంటావో తెలియజేయ వలసింది? అని అడుగుతుంది. అందుకు సమాధానంగా తాను నివసించే ప్రదేశాలు వ్యక్తులు గురించి లక్ష్మి ఈ విధంగా తెలియజేసింది.

**లక్ష్మి ఉవాచ :**

శ్లో॥ సదాస్థితాహం మధుసూదనస్య దేవస్య పార్శ్వేతపనీయవర్ణే
తస్యాజ్ఞయా యం మనసాస్మరామి శ్రియం యుతం తం ప్రవదంతి సంతః॥

శ్లో ॥ సద్యఃకృతే చాప్యధ గోమయేచ మత్తగజేంద్ర తురగప్రహృష్టే
వృషే తథాదర్ప సమన్వితేచ విప్రే తద్వైవాధ్యయన్ ప్రపన్నే॥

శ్లో॥ క్షీరే తథా సర్పిషి శాద్వలేచ క్షిద్రేతథాదధిన పురంధిగాత్రే
దేహే కుమార్యాశ్చ తథా సురాణాం తపస్వినాం యజ్ఞభూతాంచదేహే॥

శ్లో॥ పుష్పేషు శుక్లేషు చ పర్వతేషు ఫలేషు రమ్యేషు శరిద్వరాసు
సరః సుపూర్ణేషు తథా జలేషు ససాద్వలాయాం భువిపద్మఖండేః॥

శ్లో॥ వనేచ వత్సేచ శిశౌప్రవృష్టే సాధ్యానరే ధర్మ పరాయణేచ
ఆచారసే విన్వధ శాస్త్ర నిత్యే చ తథా సు వేశే ॥

శ్లో॥ సుశుద్వంతే మలవర్జితేచ మిష్టాశనేచ అతిధి పూజకేచ
స్వదార తుష్టే నిరతేచ ధర్మో ధర్మోత్కటే చాత్య శనాద్విరక్తే ॥

శ్లో॥ సత్యేస్థితే భూతహితే నివిష్టే క్షమార్చితే క్రోధ వివర్జితేచ
స్వకారదక్షే పరకార్య దక్షే కళ్యాణ చిత్తేచ సదావినీతే

**శ్రీలక్ష్మీదేవి అనుగ్రహం ఎటువంటి వ్యక్తుల వద్ద స్థిరంగా వుంటుంది.**

1. సమర్థులు 2. ధైర్యశాలులు 3. శాంత స్వభావులు 4. దైవ భక్తిగలవారు 5. ఇంద్రియనిగ్రహం కలవారు 6. సత్వగుణశీలులు 7. ధర్మప్రవర్తకులు 8. సత్యవాదులు 9. నవ్వు ముఖం గలవారు 10. ఓరిమిగలవారు 11. ఎదుటి వారి మనసు తెలిసి మసలే వారు 12. కాలం వృధా చేయని వారు 13. గోమాతని పూజించేవారు 14. బంధుమిత్రులను గౌరవించేవారు 15. శుచిశుభ్రతలు గలవారు 16. పనిని ప్రోత్సహించేవారు 17. ప్రకృతిని రక్షించేవారు 18. న్యాయంగా వ్యాపారం చేసేవారు 19. అన్నదానం చేసేవారు 20. బ్రాహ్మణ ధర్మం పాటించేవారు 21. అతిథి మర్యాదలు పాటించేవారు. 22. మనస్సులో ప్రేమగలవారు. 23. తల్లిదండ్రుల్ని గౌరవించేవారు. 24. గురువుని గౌరవించేవారు 25. గర్వంలేని వారు 26. అసూయలేనివారు 27. దురాశలేని వారు 28. ప్రతిఫలం ఆశించని వారు 29. నీతి,మర్యాదతప్పనివారు30. వీరత్వం గలవారు 31. వివేకం గలవారు 32. అందంగా వుండేవారు 33. కల్మషం లేని వారు 34. ఉదయాన్నే లేచేవారు 35. నిత్యకర్మలు చేసేవారు 36. తెల్లని దుస్తులు ధరించేవారు. 37. మంచి పనుల్లో పాల్గొనేవారు 38.ఇతరుల సమస్యలు తీర్చేవారు 39. చురుకుగా వుండేవారు. 40.శతృత్వం వహించనివారు 41. అవసరమైనపుడు ధైర్యం వహించేవారు 42. ప్రజాసమస్యలని తీర్చువారు 43. పరాయిస్త్రీలను గౌరవంగా సంభావించేవారు 44. మృదువుగా మాట్లాడేవారు 45. వికలాంగులకి సాయం చేసేవారు. ఏఏ వస్తువులలో లక్ష్మీదేవి అంశ వుంటుంది అంటే 46. శంఖంలో 47. మామిడి ఆకులలో 48. ఏనుగులో 49. స్వస్తిక్ చిహ్నంలో 50 అద్దంలో 51. పసుపు కుంకుమలలో 52. చందనంలో 53. పంచగవ్యాలలో 54. తమలపాకులలో 55. అరటి చెట్టులో 56. వెలిగే దీపంలో 57. ముగ్గులలో 58. కర్పూర జ్యోతిలో 59. పూర్ణకుంభంలో 60. తామరపూవులో –

పైన చెప్పినట్లు 1 నుంచి 45 వరకు గల వ్యక్తుల స్వభావాల గురించి ఆలోచిస్తే వారి వద్ద లక్ష్మీదేవి వుండటం నిజం అనీ, ఆ వ్యక్తులు ఆయా లక్షణాలు కోల్పోయిన వెంటనే లక్ష్మీదేవి వారిని విడిచిపెట్టి వెళ్ళిపోతుందనీ మనకి మన జీవితానుభవాలు తెలియజేస్తాయి. యిక 46 నుంచి 60 వరకు గల వస్తువులతో వ్యవహారించేటపుడు వాటిలో లక్ష్మి అంశ వుంది అని గుర్తు పెట్టుకుని వ్యవహరిస్తే చాలా మంచిది.



ఏ యింటి వద్ద ఉదయాన్నే వాకిలి కడిగి ముగ్గులు వేసి వుంచుతారో ఆ యింటికి విచ్చేస్తుంది లక్ష్మీదేవి. అదే విధంగా ఏ యిళ్ళలో సంధ్యాదీపం వెలిగించి యింటిని దీపాలతో జాజ్వల్యమానంగా వుంచుకుంటారో అక్కడ లక్ష్మీదేవి వుంటుంది.

ఏ కుటుంబంలోని కుటుంబ సభ్యులందరూ నవ్వుతూ, ఆప్యాయంగా ఒకరితో ఒకరు సరదాగా మాట్లాడుకుంటూ వుంటారో, ఏ సంసారంలో అయితే భార్యాభర్తలు చీటికి మాటికీ కీచులాడుకోకుండా, అన్యోన్యంగా కలిసిమెలిసి వుంటారో, ఏ యింట్లో తల్లిదండ్రులు పిల్లల్ని దండించి కోపపడకుండా, బుజ్జగించి, లాలించి మంచి మార్గంలో పెడతారో ఆ యింట్లో లక్ష్మినివాసం వుంటుంది.

ఎక్కడ లక్ష్మీదేవి నివాసం వుంటుందో అక్కడ మనశ్శాంతి, ఆత్మసౌఖ్యం, పూర్ణాయువు, మంచి విద్య, పరిపూర్ణ సంపదలు కలుగుతాయని మార్కండేయ పురాణంలో చెప్పబడింది.

ఏ యే రాశులలో పుట్టిన వారు వారి వారి మనోభీష్టాలు తీరటం కోసం ఏ విధమైన మంత్ర జపం చేస్తే ఆ లక్ష్మీదేవి అనుగ్రహం లభిస్తుందనే విషయం లక్ష్మీ ఉపాసన గ్రంథంలో చెప్పబడింది. జన్మరాశి తెలియని వారు వారి పేరులోని మొదటి అక్షరం ఆధారంగా ఆయా మంత్రం జపం చేస్తే తప్పక మంచి ఫలితాలు కలుగుతాయి. రాశి వివరాలు, పేరులోని మొదటి అక్షరాలు, వారు ఆచరించవలసిన మంత్ర జపం ఈ విధంగా తెలియజేయబడ్డాయి.

| రాశి | పేరులో మొదటి అక్షరం | మంత్రం |
|---|---|---|
| మేషం | చూ,చే,చో,లా,లీ,లూ,లె,లో,అ | ఓం ఏం క్లీం సోః |
| వృషభం | ఇ,ఉ,ఎ,ఓ,నా,ని,వూ,వె,వో | ఓం ఏం క్లీం శ్రీః |
| మిథునం | కా,కీ,కూ,ఘ,చ,కె,కో,హా | ఓం క్లీం ఏం సోః |
| కర్కాటకం | హీ,హూహె,హో,డా,డీ,డూ,డె,డో | ఓం ఏం క్లీం శ్రీః |
| సింహం | మా,మీ,మూ,మె,మో,టా,టి,టూ,టె | ఓం హ్రీం ఏం సోః |
| కన్య | టో,పా,పీ,పూ,ప,ణ,ఠ,పె,పో | ఓం శ్రీం ఏం సోః |
| తుల | రా,రీ,రూ,రె,రో,తా,తీ,తూ,తె | ఓం హ్రీం క్లీం శ్రీం |
| వృశ్చికం | తో,నా,నీ,నూ,నె,నో,యా,యీ,యూ | ఓం ఏం క్లీం సోః |
| ధనుస్సు | యె,యో,భా,భీ,భూ,ధా,ఫా,ఢా,భె | ఓం హ్రీం క్లీం సోః |
| మకరం | భో,జా,జీ,ఖీ,ఖూ,ఖె,ఖో,గా,గీ | ఓం ఏం క్లీం హ్రీం శ్రీం సోః |
| కుంభం | గూ,గె,గో,సా,సీ,సూ,సె,సో,దా | ఓం హ్రీం ఏం క్లీం శ్రీం |
| మీనం | దీ,దూ,థ,ఝు,దె,దో,చా,చీ | ఓం హ్రీం క్లీం సోః |

### ఈ మంత్రాలు బీజాక్షర సమన్వితాలు

మానవ సహజమైన క్రోధావేశాల వల్ల, సాంసారిక జీవనంలో అనేక సందర్భాలలో ఒడిదుడుకులు వచ్చినపుడు మనసు గతి తప్పి ప్రవర్తించటం లోక రివాజు. కాని వివేకంతో ఆయా పరిస్థితుల నుండి బయట పడి మనసావాచా కర్మణా ఆ తల్లిని శరణు వేడితే ఆ లక్ష్మీదేవి కరుణించి శాశ్వతంగా మన వద్దే వుండిపోతుంది. శ్రద్ధా భక్తులు ఎంత ముఖ్యమో మన నడవడిక కూడా అంతే ముఖ్యం. ఆ తల్లి దయవుంటే సాధించలేనిది ఏదీ లేదు. ఆ లక్ష్మీదేవి దయ అపారం. ఆ తల్లి కరుణా కటాక్షాలను పొందగలిగిన వాడు నిజంగా 'కలిగినవాడు' ఆ తల్లి అనుగ్రహం లేని వాడు ఏమీ "లేనివాడు".

అందరికీ ఆ తల్లి శ్రీ మహాలక్ష్మీదేవి పరిపూర్ణ ఆశీస్సులు లభించుగాక.

## శ్రీమహాలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం



ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూతహిత ప్రదాం
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికాం॥ 1
వాచాం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధాం
ధన్యాం హిరణ్యయీం లక్ష్మీం నిత్య పుష్టాం విభావరీమ్॥ 2
అదితించ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీం
నమామి కమలా కాంతాం కామాక్షీం క్రోధ సంభవాం॥ 3
అనుగ్రహ ప్రదాం బుద్ధిం అనఘాం హరివల్లభాం
అశోకా మమృతాం దీప్తాం లోకశోక వినాశినీం॥ 4
నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరం
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసుందరీం॥ 5
పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభ ప్రియాం రమాం
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగంధినీం॥ 6
పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభాం
నమామి చంద్రవదనాం చంద్రాం చంద్రసహోదరీం॥ 7
చతుర్భుజాం చంద్రరూపాం ఇందిరాం ఇందుశీతలాం
ఆహ్లాద జననీం పుష్టి శివాం శ్రీకరీం సతీం॥ 8
విమలాం విశ్వజననీం పుష్టిం దారిద్ర్య నాశినీం
ప్రీతి పుష్కరిణీం శాంతాం శుక్లమాల్యాంబరాం శ్రియం॥ 9
భాస్కరీం బిల్వనిలయాం వరారోహం యశస్వినీం
వసుంధరా ముదారాంగాం హరిణీం హేమమాలినీం॥ 10
ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణ సౌమ్యాం శుభప్రదాం



నృపవేశ్మగతానందాం వరలక్ష్మీం వసుప్రదాం॥ 11
శుభాం హిరణ్య ప్రాకారం సముద్ర తనయాం జయాం
నమామి మంగళాం దేవీం విష్ణు వక్షస్థల స్థితాం॥ 12
విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణ సమాశ్రితాం
దారిద్ర్య ధ్వంసినీం దేవీం సర్వోప్రదవ వారిణీం॥ 13
నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణు శివాత్మికాం
త్రికాలజ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీం॥ 14

## శ్రీసూక్త పారాయణమ్

శ్రీ మహాలక్ష్మీదేవి అనుగ్రహం, కరుణా కటాక్షాలు కోరుకునే వారికి శ్రీసూక్త పారాయణం అత్యుత్తమమైన మార్గం. ఋగ్వేదంలోని ఖిలాసూక్తంలోని అంతర్భాగ మయిన ఈ శ్రీసూక్తంలోని ప్రతి అక్షరం మహామహిమోపేతం. ఫలదాయకం.

హరిః ఓం హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్
చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 1
తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనప గామినీమ్.
యస్యాం హిరణ్యం విన్దేయం గామశ్వం పురుషానహమ్॥ 2
అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్।
శ్రియం దేవీ ముపహ్వాయే శ్రీర్మాదేవీ ర్జుషతామ్॥ 3
కాంసోఽస్మితాం హిరణ్యప్రాకాంమార్ద్రాంజ్జ్వలన్తీం తృప్తాం తర్పయన్తీమ్
పద్మేస్థితాం పద్మవర్ణాం తామి హోపహ్వాయే శ్రియమ్॥ 4
చన్ద్రాం ప్రభాసాం యశసా జ్జ్వలన్తీంశ్రియం లోకే దేవజుష్టా ముదారామ్
తాం పద్మినీమీం శరణమహం ప్రపద్యేలక్ష్మీర్మేనశ్యతాం త్వాం వృణే॥ 5
ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతి స్తవ వృక్షోఽథబిల్వః
తస్య ఫలాని తపసానుదన్తు మాయాన్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః॥ 6
ఉపైతు మాం దేవ సఖః కీర్తిశ్చ మణినా సహ
ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తింమృద్ధిం దదాతు మే॥ 7
క్షుత్పిపాసామలాం జేష్ఠామలక్ష్మీ ర్నాశయామ్యహమ్
అభూతిమసమృద్ధిం చ సర్వా న్నిర్ణుదమే గృహాత్॥ 8
గన్ధద్వారాం ధురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్
ఈశ్వరీగ్ంం సర్వభూతానాం తామిహోపహ్వాయే శ్రియమ్॥ 9
మనసః కామమాకూతిం వాచస్సత్యమశీమహి
పశూనాగ్ంం రూపమన్నస్య మయిశ్రీః శ్రయతాం యశః॥ 10

కర్దమేన ప్రజా భూతా మయి సంభవ కర్దమ
శ్రియం వాసయ మేకులే మాతరం పద్మమాలినీమ్॥ 11
ఆపస్సృజన్తు స్నిగ్ధాని చిక్లీత వసమేగృహే,
నిచ దేవీం మాతరం శ్రియం వాసయ మేకులే॥ 12
ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలా పద్మమాలినీమ్
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 13
ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్
సూర్యం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥ 14
తాంమఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్
యస్యాం హిరణ్యం ప్రభూతం గావోదాస్యోఽ శ్వాన్ విన్దేయం పురుషానహమ్॥ 15

## శ్రీసూక్త ఫలశృతిః

యఃశుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్య మన్వహమ్
శ్రియః పఞ్చదశర్చంచ శ్రీ కామస్సతతం జపేత్ 16
ఆనన్దః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః.
ఋషయస్తే త్రయః ప్రోక్తాస్స్వయం శ్రీదేవి దేవతా॥ 17
పద్మాననే! పద్మం ఉరుం పద్మాక్షీ పద్మసంభవే
త్వం మాం భజస్వపద్మాక్షీ! యేన సౌఖ్యం లభామ్యహమ్॥ 18
అశ్వదాయీ చ గోదాయి ధనదాయి మహాధనే,
ధనం మే జుషతాం దేవీ సర్వకామాంశ్చదేహిమే ॥ 19
పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వా దిగవేరథమ్
ప్రజానాం భవసి మాతా ఆయుష్మన్తం కరోతు మామ్॥ 20
చన్ద్రాభాం లక్ష్మీమీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్
చన్ద్రసూర్యాగ్ని వర్ణాభాం శ్రీ మహాలక్ష్మీ ముపాస్మహే॥ 21
ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః
ధనమిన్ద్రో బృహస్పతిర్వరుణం ధనమశ్నుతే॥ 22
వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా
సోమం ధనస్య సోమినో మహ్యం దదాతు సోమినః॥ 23
నక్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం శ్రీ సూక్తం జపేత్సదా॥ 24
వర్షన్తు తే విభావర్యో దివో అభ్రస్య విద్యుతః
రోహన్తు సర్వబీజాన్యవ బ్రహ్మద్విషో జహి॥ 25
పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మ దళాయతాక్షి
విశ్వప్రియే! విష్ణు మనోఽనుకూలే! త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ26

యాసా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ
గంభీరావర్తనాభిః స్తనభర నమితా శుభ్రవస్త్రోత్తరీయా 27
లక్ష్మీర్దివ్యైర్గజేన్ద్రైర్మణిగణఖచితై స్స్నాపితాహేమకుంభైః
నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగళ్య యుక్తా॥ 28
లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరఙ్గధామేశ్వరీం.
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం
శ్రీమన్మన్ద కటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేన్ద్ర గఙ్గాధరాం,
త్వాం త్రైలోక్యకుటుమ్బినీం సరసిజాం వన్దే ముకుందప్రియామ్॥ 29
శుద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ,
శ్రీర్లక్ష్మీర్వర లక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా॥ 30
పరాంకుశౌ పాశమభీతి ముద్రాంకరైర్వహన్తీం కమలాసనస్థాం
బాలార్కకోటి ప్రతిభాం త్రినేత్రాం భజేఽ హమంబాం జగదీశ్వరీంతామ్31
సర్వమఙ్గళమాఙ్గళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోఽస్తుతే॥ 32
సరసిజనిలయే సరోజహస్తే ధవళతరాంశుకగంధమాల్యశోభే
భగవతి హరివల్లభేమనోజ్ఞే త్రిభువన భూతికరి ప్రసీదమహ్యమ్॥ 33
విష్ణుపత్నీం క్షమాం దేవీం మాధవీం మాధవప్రియామ్
విష్ణోః ప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్ । 34
ఓం మహాలక్ష్మీ చ విద్మహే, విష్ణుపత్నీచ ధీమహి,
తన్నో లక్ష్మీః ప్రచోదయాత్॥

## శ్రీమహాలక్ష్మీదేవి పూజ పాట

పూజా చేతామూరారమ్మా! ఈ వేళా మన మహాలక్ష్మికీ
పూజా చేతామూ రారమ్మా! పూజా చేతామూ రారే రాజీవనేత్రులార (2)
జాజీ పువ్వులా పూజా రోజా మన మహాలక్ష్మికీ పూజా చేతామూ
హెచ్చూగా నిత్య మల్లెలు ఎర్రాబొగడా పువ్వులూ (2)
పచ్చావాడంబరాలూ తెచ్చీ మన మహాలక్ష్మికీ । పూజా...
బంతీ చేమంతులూ బంగరు పువ్వులు మంచీ (2)
దొంతీగన్నేరు పూలతోటీ మన మహాలక్ష్మికీ । పూజా...
తిన్నాని మొగలీ పువ్వులు తీరైనా పువ్వులు మంచీ (2)
మందారాకుసుమామూలూ ముందూ మన మహాలక్ష్మికీ।పూజా...
దేవాకాంచనామూలూ తీవ గులాబీపూలూ (2)
స్థావీగన్నేరుపూలా తోటీ మన మహాలక్ష్మికీ । పూజా...
పూజా చేతామూ రారమ్మా!
ఈవేళ మన మహాలక్ష్మికీ పూజాచేతామూ రారమ్మా!

# అష్టలక్ష్మి రూపధారణ ఎందుకు?

శ్లో॥ వందే లక్ష్మీం పరశివమయీం శుద్ధజంబూనదాభాం
తేజోరూపం కనకవసనాం స్వర్ణ భూషోజ్జ్వలాంగీం
బీజాపూరం కనక కలశం హేమపద్మం దధానం
మాన్యాం శక్తిం సకల జననీం విష్ణువామాంక సంస్థాం ॥

శ్లో॥ అష్టలక్ష్మీ సమాహార స్వరూపాం తాం హరిప్రియాం
మోక్షలక్ష్మీం మహాలక్ష్మీం సర్వలక్ష్మీం నమామ్యహమ్ ॥

భక్తాభీష్ట ప్రదాయిని, ధర్మసంవర్ధిని అయిన జగన్మాత శ్రీమహాలక్ష్మిదేవి తన అష్టవిధ అంశలతో అష్టలక్ష్మి రూపాలలో ఈజగత్తుని పరిపాలిస్తోంది. విష్ణుమూర్తి ధరించిన మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్క్యవతారాలు ఏ రకంగా పరిణామక్రమాన్ని సూచిస్తూ జగత్కల్యాణానికి ఉద్దేశింపబడ్డాయో అదే రీతిగా విష్ణుపత్ని లక్ష్మిదేవి దాల్చిన అవతారాలు కూడా జగత్కల్యాణానికి ఉద్దేశించబడినవే. స్థితి కార్య నిర్వహణలో లక్ష్మీనారాయణులు ఇరువురూ సమాన బాధ్యతలని వహిస్తారు. ధర్మ సంరక్షణ,సమాజ సంక్షేమం కోసం దుష్ట శిక్షణ చేసి శిష్ట రక్షణ చేశాడు నారాయణుడు. సమాజం అంటే వ్యక్తుల సమూహం కాబట్టి ఆయా వ్యక్తుల సంరక్షణకోసం, అభివృద్ధి కోసం, ఉన్నతి కోసం లక్ష్మిదేవి అష్టలక్ష్మి రూపధారణ చేసింది. ఒక మాతృమూర్తి తనకన్న బిడ్డలని సరైన మార్గంలో పెంచటం కోసం రోజూ ఎన్నో రకాల అవతారాలను ఎత్తుతుంది. వాత్సల్యపూరితంగా అనునయిస్తూనే తప్పు చేస్తే దండిస్తుంది. మనకి విద్యాబుద్ధులు నేర్పిన ప్రథమ గురువు అయిన ఆ తల్లే అవసరమైనపుడు ధైర్యాన్ని నూరి పోసి వీరత్వాన్ని వృద్ధి చేస్తుంది. ముఖ్యంగా ధర్మచింతన, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం, కరుణ, జాలి, వివేకం ఇవన్నీ ఆ అమ్మ పెట్టిన భిక్షలే. ఒక సాధారణ మాతృమూర్తే తన పిల్లల కోసం యింత కష్టబడుతూ వుంటే ఆ జగన్మాత లక్ష్మిదేవి సంగతి చెప్పాలా అనేక కోట్ల జీవరాశులలో ఎవరికి ఏ కష్టం వచ్చినా అందరూ ఆ తల్లినే తలుచుకుంటారు.

అందరికీ అన్ని రకాల శక్తులను అందించటం కోసం ఈ అష్టలక్ష్మి రూపాలను ఎంచుకుంది ఆ తల్లి. అన్ని శక్తులను ఒకే రూపంలో యివ్వవచ్చుకదా ఎందుకు యిన్ని రకాల రూపాలు అని సందేహం వస్తుంది. దానికి సమాధానం మన సనాతన భారతీయ సంస్కృతి ఆచారాలలో ఎంతో స్పష్టంగా కనిపిస్తుంది. భిన్నత్వంలో ఏకత్వం చూడగలగటమే మన సంస్కృతి ప్రత్యేకత.

నిజానికి పరబ్రహ్మతత్వం నిర్గుణమైనది. నిరాకారమైనది. ఆది మధ్యాంతాలు లేనిది, వాచామగోచరమైనది అని వేదాలు ఘోషిస్తున్నాయి. కాని సాధకుని మనః



స్థితిని దృష్టిలో వుంచుకుని అతని మనస్సంతుష్టి కోసం ఆ పరబ్రహ్మ తత్వానికి రూపాన్ని (లని) ఆపాదించటం జరిగింది. నిరాకార పరబ్రహ్మపైన కన్నా రూపం గలిగిన సాకార దేవతారూపంపై దృష్టి నిలిపి ధ్యానం చేయడం సులువు కాబట్టి, ప్రాథమిక స్థితిలో సాధకుడికి సాకారరూపం అవసరమవుతుంది. ఆ విధంగా వచ్చినవే త్రిమూర్తులు, ముగ్గురమ్మలూ, అష్టదిక్పాలకులు, నవగ్రహాలు మొదలైనవి. ఒక్కొక్క దేవతామూర్తి ఒక్కొక్కరకమైన శక్తికి అధిదేవతగా పురాణాల్లో చెప్పబడింది. ఆ కారణంచేతనే శరన్నవరాత్రులలో అమ్మవారిని కొలిచే మనం శివరాత్రికి పరమేశ్వరుడిని, వైకుంఠ ఏకాదశికి శ్రీమన్నారాయణుని కొలుస్తూ వుంటాం. నాటి గీతాచార్యుని నుంచి నేటి సాయినాథుని వరకు అంతా దేవుడొక్కడే అని ఎన్ని రకాల బోధించినా ఈ రకమైన బహు దేవతారాధన సమాజంలో నెలకొని వుండడానికి కారణం అనాది నుంచీ మనలో నెలకొని వున్న ప్రగాఢ భక్తివిశ్వాసాలే. ఎక్కడ విశ్వాసం వుందో అక్కడే ఫలితం కన్పిస్తుంది. ఆధునిక సమాజంలో కూడా వేరు వేరు పనులకి వేరు వేరు వ్యక్తుల వద్దకి వెళ్ళి సలహా పొందుతూ వుంటాం. వైద్యరంగంలో అయితే ఆయా అనారోగ్యాలకి ఆయా నిపుణులు వున్నారు. విద్యా విషయంలోనైతేనేమి, విజ్ఞానరంగంలోనైతేనేమి ఏ రంగంలోనైనా ఆయా నిపుణులని సంప్రదిస్తాం. స్థూలంగా ఆలోచిస్తే బహు దేవతారాధన కూడా యిలాంటిదే. సరైన చిరునామా రాస్తేనే మన అర్జీ సరైన చోటికి వెళ్ళి సమాధానం వస్తుంది. లేదంటే ఎప్పటికో అప్పటికి సమాధానం రావచ్చు. దేవతల విషయంలో ఈ సామ్యం స్థూలంగా వర్తిస్తుంది. కాని యింతకి మించిన ఎన్నో వేదాంత విజ్ఞాన రహస్యాలు ఈ దేవతారూపాలలో నిబిడీకృతమై వున్నాయి.

శ్రీ మహాలక్ష్మిదేవి తన అష్టవిధ అంశలతో అష్టలక్ష్మి రూపధారణ చేసి మనకి సమస్త రకాలయిన శక్తులు ప్రసాదిస్తోంది. ప్రాణులకు మూలాధారమైన శక్తి ప్రాణశక్తి. ఆ శక్తిని ప్రసాదించే తల్లి ఆదిలక్ష్మిదేవి. దేహ మానసిక ఆరోగ్యాలు పరిపూర్ణంగా వుండాలంటే ఆదిలక్ష్మి దేవి అనుగ్రహం వుండాలి. పుట్టిన బిడ్డకి స్తన్యాన్ని అందించి ఆకలి తీర్చి తనపొత్తిళ్ళలో పొదివి పట్టుకుని కాపాడేది మన మాతృమూర్తి. అలాగే మనకి అవసరమైన బలకరమైన ఆహారాన్ని సమకూర్చేది ధాన్యలక్ష్మిదేవి. సమస్త రకాలైన ధాన్య సంపదని, పాడిపంటలనీ ప్రసాదించే ఈ తల్లి అనుగ్రహం వల్ల శరీరానికి ధారుఢ్యం, బలం చేకూరుతాయి. శరీర వృద్ధికి ఈ తల్లి అనుగ్రహం అవసరం. కార్యం సాధించాలంటే కేవలం శారీరక బలం చాలదు. ధైర్యసాహసాలు మనోబలం కావాలి. వీటిని ప్రసాదించేది ధైర్యలక్ష్మిదేవి. అవసరమైన సమయంలో ధైర్యం ప్రసాదించి మనల్ని కార్యసాధకులని చేస్తుంది ఆ తల్లి. సకల శుభకారిణి గజలక్ష్మిదేవి. మనం సాధించిన విజయం శుభకారిణి అయ్యేలా అనుగ్రహిస్తుంది. శుభం అంటే మనకి మాత్రమే మంచిదని కాదు సమాజహితానికి కారణభూతమయ్యేది. మన విజయం వల్ల అందరూ సుఖపడాలి. అదే నిజమైన

శుభం. ముత్తయిదువలు వైభవలక్ష్మి రూపంలో గజలక్ష్మిని పూజించి అఖండ సౌభాగ్యాన్ని పొందుతారు. జీవితంలో మనం అభివృద్ధి సాధిస్తే సరిపోదు. మన ఆనందంలో పాలు పంచుకోవడానికి పిల్లలు కావాలి. వాళ్ళు మంచి విద్యాబుద్ధులు కలిగి వుండాలి. మన జ్ఞాన విజ్ఞాన ఆచార సంస్కృతీవైభవాలని ముందు తరానికి తీసుకువెళ్ళాలి. అటువంటి సత్సంతానాన్ని ప్రసాదించేది సంతానలక్ష్మి. ఇక సర్వేసర్వత్రా అన్ని చోట్ల మనకి విజయాల్ని ప్రసాదించేది విజయలక్ష్మిమాత. మనం ఏ ఉద్దేశ్యంతో ఒక కార్యాన్ని చేసామో ఆ లక్ష్యం నెరవేరేలా ఈ తల్లి అనుగ్రహిస్తుంది. ఈ రకంగా ఆరువిధాల శక్తులను అనుగ్రహించిన ఆజగన్మాత మనకి సదసద్వివేచన, విద్యావివేకసంస్కారాలను విద్యాలక్ష్మి రూపంలో అనుగ్రహిస్తుంది. విద్యాలక్ష్మి అనుగ్రహం వున్న వారికి వారి విద్యాబుద్ధులకి తగిన గుర్తింపు కలిగి సంఘంలో గౌరవం, భోగభాగ్యాలు కలుగుతాయి. అష్టమ అవతారమైన ధనలక్ష్మి రూపంలో ఆ తల్లికి మనకి సకలైశ్వర్యాలను అనుగ్రహిస్తోంది. అంతే కాక శాశ్వతమైన భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను ముక్తినీ కూడా ప్రసాదిస్తుంది. ఈ విధంగా అష్టవిధ శక్తులను మనకి అనుగ్రహించే ఆ తల్లి ఒక్కొక్క రూపానికి ఒక్కొక్క ప్రత్యేకమైన ఆరాధనా పద్ధతి, బీజాక్షర జపం నిర్దేశింపబడ్డాయి. జీవితంలో అందరికీ ఏదో ఒక దశలో సమస్యలు వస్తాయి. ఆయా సమస్యల పరిష్కారం కోసం అశాశ్వతమైన వ్యక్తులను, వ్యవస్థలను నమ్ముకోవడం కంటే ఆ లక్ష్మీమాతనే నమ్ముకోవడం అత్యంత ఉత్తమం. మన మనస్సు నడవడిక మంచిదయితే ఆ తల్లి తప్పక కరుణిస్తుంది.

శ్లో॥ శుద్ధ లక్ష్మీ ర్మోక్షలక్ష్మీ జయ లక్ష్మీ సరస్వతీ
శ్రీర్లక్ష్మీ ర్వ రలక్ష్మీశ్చ ప్రసన్నా మమసర్వదా ॥

ఈ శ్లోకాన్ని శ్రీలక్ష్మీషట్కం అంటారు. దీనిలో వరలక్ష్మి ఆదిలక్ష్మిని, శుద్ధలక్ష్మి శుభాలనిచ్చే గజలక్ష్మిని, జయలక్ష్మి విజయలక్ష్మిని, సరస్వతి విద్యాలక్ష్మిని, శ్రీలక్ష్మి ధనధాన్య సంతానలక్ష్మి రూపాలను సూచిస్తాయని పండితులు చెప్పటం జరిగింది. ఈ విధంగా ఈ శ్లోకం అష్టలక్ష్మీ రూపాలను తెలియజేస్తుంది. అన్ని పూజలలోను మనం ఈ శ్లోకాన్ని పఠించడం ద్వారా ఆ అష్టలక్ష్మీ మూర్తుల అనుగ్రహాన్ని పొందవచ్చు.

దానధర్మాల చింతన లేకుండా సంపదను కూడ గట్టిన వారి సంపదను వారసులు ఇట్టే హరించి వేస్తారు. దాన ధర్మ గుణం కలవారు మాత్రమే ఆనందకర జీవితం పరంగా పొందుతారు.

-శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు



## ఆనందో బ్రహ్మ

ఆనందో బ్రహ్మ అని వేదవాక్యం. ఎక్కడయితే ఆనందం వుంటుందో అక్కడ భగవంతుడు వుంటాడు. జగన్మాత శ్రీ మన్మహాలక్ష్మీదేవి కటాక్షం వల్లనే మనం ఈ ఆనందాలని పొందగలుగుతున్నాము. సకల సౌభాగ్యాలు, ఐశ్వర్యాలు ప్రసాదిస్తూనే వాటితో పాటే అలౌకిక ఆనందాన్ని, ముక్తిని ప్రసాదిస్తోంది ఆ తల్లి. ఆనందానికి అధిష్టాన దేవత లక్ష్మీదేవి. ఆనందం అనేది ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా లభిస్తుంది. ఒకరికి కడుపునిండా ఇష్టమైన ఆహార పదార్థాలు తింటే ఆనందం. మరికొందరికి ధనమే సర్వస్వం. వారికి ఎంత సంపాదిస్తే అంత ఆనందం. ఇంకొందరికి ఇతరులపై అధికారం చెలాయించటం ఎంతో ఆనందం. కొందరికి అన్నీ నేర్చేసుకుని తమకు మించిన పండితుడు లేడు అనిపించుకుంటే చాలా ఆనందం. మరి కొందరికి ప్రయోజకులైన తమ పిల్లలని చూసుకుని ఆనందం. ఒకరికి తమకి వున్నది ఇతరులకి ఇవ్వటంలోనే ఆనందం. ఇలా ఇలలో ఎన్ని రకాల ఆనందాలు వున్నయో అవన్నీ ఇచ్చేది ఆ తల్లి లక్ష్మీదేవే. కోపం లేకుండా యెప్పుడూ నవ్వుతూ వుండే వాళ్ళ వద్ద ఆ తల్లి శాశ్వతంగా కొలువుంటుంది. ఆ తల్లి కోరుకునేది మన అంతరంగిక సౌందర్యం. అదే ఆత్మశుద్ధి, ఆత్మసౌందర్యం.

## అష్టలక్ష్మీ స్తుతి

| | |
|---|---|
| నిత్యసౌభాగ్య సౌశీల్యం వరలక్ష్మీం దదాతి యా। | |
| ప్రసన్నాం స్త్రైణ సులభాం ఆదిలక్ష్మీ నమామ్యహమ్॥ | 1 |
| పృథ్వీగర్భ సముద్భిన్న నానాప్రీహి స్వరూపిణీం । | |
| పశుసంవత్స్య రూపాంచ ధాన్యలక్ష్మీం నమామ్యహమ్॥ | 2 |
| న మాత్సర్యం నచ క్రోధోన భీతిర్నచ బేదధీః। | |
| యద్భక్తానాం వినీతానాం ధైర్యలక్ష్మీం నమామ్యహమ్॥ | 3 |
| రథమధ్యా మశ్వపూర్వాం గజనాద ప్రబోధినీం । | |
| సామ్రాజ్య దాయినీ దేవీం గజలక్ష్మీం నమామ్యహమ్॥ | 4 |
| పుత్రపౌత్ర స్వరూపేణ పశుభృత్యాత్మనా స్వయం। | |
| సంభవన్తీం చ సంతాన లక్ష్మీం దేవీం నమామ్యహమ్॥ | 5 |
| సర్వశక్తి స్వరూపాంచ సర్వసిద్ధి ప్రదాయినీం। | |
| సర్వేశ్వరీం శ్రీ విజయలక్ష్మీం దేవీం నమామ్యహమ్॥ | 6 |
| నానావిజ్ఞాన సంధాత్రీం బుద్ధి శుద్ధి ప్రదాయినీం। | |
| అమృతత్వ ప్రదాత్రీంచ విద్యాలక్ష్మీం నమామ్యహమ్॥ | 7 |
| ధనమగ్ని ర్ధనం వాయుః ధనం భూతాని పంచ చ। | |
| ప్రభూతైశ్వర్య సంధాత్రీం ధనలక్ష్మీం నమామ్యహమ్॥ | 8 |

## మంత్రాలు, బీజాక్షరాలుజపిస్తే పనులవుతాయా?

ఒక స్తోత్రమైనా, మంత్రమైనా, బీజాక్షరమూలలయినా చూడగానే మనకి స్థూలంగా యివన్నీ కేవలం కొన్ని అక్షరాల, మాటల సమూహాలు తప్ప మరేమీ కాదుకదా అనిపిస్తుంది. ఒక్కొక్కసారి ఆ అక్షరాలు, మాటలు కూడా మనం సర్వసాధారణంగావాడేవే కావటం జరుగుతూ వుంటుంది. ముఖ్యంగా అష్టోత్తర శతనామాలు, సహస్ర నామాలు తీసుకుంటే అవి కేవలం ఆయా దేవతలని పొగుడుతూ చెప్పే పేరులే (నామములే) కదా అని అన్పిస్తూ వుంటుంది. మరి యిటువంటి మాటలని అక్షరాలని పారాయణచేస్తే ఫలితం ఏ విధంగా కలుగు తుంది? అనే సందేహం రాకమానదు.

ఒకమాటయొక్క ప్రభావం గురించి అతి సులువుగా అర్థం కావాలంటే అందరికీ తెలిసిన ఒక చిన్న ఉదాహరణ తీసుకుందాం. మనం ఒక పనిచేసాం. మనపై అధికారి వద్దకి తీసుకువెళ్ళి చూపించాం. వెరీగుడ్ చాలా బావుంది. యిందులో యింకా ఈ విషయాలు చేరిస్తే యింకా బావుంటుంది. అనిపై అధికారి అన్నాడని అనుకోండి. మనకి ఎంతో తృప్తి కలుగుతుంది. ఆనందం కలుగుతుంది. యింకా సమర్థవంతంగా చేయటానికి కృషిచేస్తాం. యిక్కడ మనకి కలిగే ఆనం దానికి తృప్తికి కారణం ఎవరో ఏదో మనకి యివ్వడం కాదు. కేవలం వెరీగుడ్ అనే ఒక మంచి మాట మన చెవిని పడటమే. ఆ మాట వినబడటంతోనే మన ఆలోచనా సరళిలో మార్పువస్తుంది. పైనచెప్పినట్లుగా కాకుండా యిదేమిటి యిలాచేశావు యింత కాలం నుండి పనిచేస్తున్నా నీకు అసలు విషయమే అర్థం కాలేదు. ఈ విషయాలు రాయకుండా యిది సమాధానం ఎలా అవుతుంది? ఆ మాత్రం తెలియదా నీకు అని ఆ అధికారి అన్నాడనుకోండి వెంటనే మనకి నిరాశకలిగి ఛ! ఎంత చేసినా ఏమీ ప్రయోజనం లేదు. ఆ అధికారికి మనం ఏంచేసినా నచ్చదు అనే నెగిటివ్ ఆలోచన వస్తుంది. పైన ఉదహరించిన రెండు సందర్భాలలోనూ తేడా ఏమిటి అంటే ఒకచోట ఒక మంచి శబ్దం వాడబడితే మరోచోట అనవసరమైన దూషణ చేయబడింది అంతే. ఈ చిన్న ఉదాహరణ వల్ల మనకి మంచి మాటలప్రభావం ఎలాంటిదో అర్థమవుతుంది. యీ ఉదాహ రణలో వాడిన మంచి మాటగుడ్. యిది ఆంగ్లభాషలోని సాధారణ మైన మాట. దీనికి రెండు అర్థాలు లేవు ఒకటే అర్థం మంచిది అని. స్పెల్లింగ్ మాత్రం గాడ్ అంటే భగవంతుడికి దగ్గరలో వుంది. ఇలా ఏ ప్రత్యేకతలేని ఒక సాధారణ ఆంగ్లేయపదమే యింతటి మనోపరివర్తన తీసుకురాగలిగిన సామర్థ్యాన్ని కలిగిన దయితే మన పూర్వీకులు నిర్దేశించిన మంత్రాలు, బీజాక్షరాలు, నామాలు ఎంత శక్తిని కలిగివుంటాయో ఆలోచించండి. ఒక్కొక్క బీజాక్షరం, మంత్రంలోని పదాలు, నామాలలోని పదాలు కూడా మన పూర్వీకులు ఎన్నోవేల సంవత్సరాలపాటు



తపస్సుచేసి, సాధనచేసి కనుగొన్నవి. చాలాకాలం అవిరామకృషి చేసిన తర్వాత భగవత్తత్వం వారికి ఆ విధమైన శబ్దరూపంలో స్ఫురించిన దన్నమాట. ఆ అక్షరాలు ఆ పదాలు ఎంతో మహిమాన్వితమైనవి. వాటికి ఎన్ని విశేష అర్థాలు వున్నాయో కనుగొన్న మహానుభావులకే తెలియాలి. అంతట శక్తిగల అక్షరాలను, మంత్రాలను భక్తిశ్రద్ధల పారాయణచేస్తే ఆయా అక్షరాలకి అధిష్ఠాన దేవతలయిన దేవీ దేవతా మూర్తులు మనలని తప్పకుండా పరిపూర్ణంగా అనుగ్రహిస్తారు. ఉదాహరణకి అకార, ఉకార, మకార సంయుతమైన ఓంకార నాదాన్ని మించిన మంత్రం ప్రపంచంలోనే లేదని పాశ్చాత్యులు కూడా అంగీకరించిన విషయం కదా! మహాత్ము లచే కనుగొనబడిన మంత్రాక్షరాలను చదివినప్పుడు ఒకసారి, ఆ అక్షర ధ్వని మన చెవులకి తాకినపుడు మరొకసారి ఆ అక్షర ప్రభావంవల్ల మన ఆలోచనా సరళిలో మార్పురావటం అన్నది తప్పక జరుగుతుంది తద్వారా మనం అనుకున్న కార్యాలు నెరవేరటం జరుగుతుంది. శబ్దం అనేది విద్యుదయస్కాంతశక్తి తరంగం. స్పీచ్ థెరపీ అనీ, మ్యూజిక్ థెరపీ అని వివిధ రకాల నామాలతో ఈనాటి శాస్త్ర వేత్తలూ వైద్య నిపుణులు కూడా శబ్ద తరంగాల ప్రభావంతో శరీరంలో మార్పులు తీసుకురావాలని ప్రయత్నించటం చూస్తూనే వున్నాం. మంద్రమైన, మనోజ్ఞమైన సంగీతం సాత్విక స్వభావం వృద్ధి చెందటానికి ఉపయోగపడితే రణగొణ ధ్వనులు, విపరీతమైన శబ్దం చేసేపరికరాలు, ఆధునిక సంగీతాలు మనిషిలో క్రోధావేశాలని పెంచుతాయని నేటి శాస్త్రవేత్తలు కనుగొన్నారు.

భక్తిశ్రద్ధలతో మనం అతిశక్తివంతమైన బీజాక్షరాలని మంత్రాలని చదివినపుడు మనకి తెలియకుండానే ఆ అక్షరాలు, పదాలు పనిచేయటం మొదలు పెట్టి కోరిన పనులు నెరవేరేటట్లుగా మనలని అనుగ్రహిస్తాయి. శబ్దానికి స్వరానికి చాలా దగ్గర సంబంధం వుంది. కాబట్టి ఈ బీజాక్షరాలని, మంత్రాలని ఒక గురువు దగ్గర నేర్చుకుని, సుస్వరంతో పలకటం చేస్తే సత్ఫలితాలు తక్షణమే కలుగుతాయి అని పెద్దలు అంటారు. అందువల్లనే సద్గురువు చాలా ముఖ్యం అంటారు. కాని గురూపదేశం పొందటానికి అవకాశం లేనపుడు భక్తి విశ్వాసాలతో ఈ మంత్రబీజాక్షర జపాలు చేసుకున్న వారికి మంచి ఫలితాలు తప్పకుండా వస్తాయి. అందువల్లనే మన పూర్వీకులు మనం చేసుకునే నిత్యపూజలలో ఈ విధంగా నామావళులు, మంత్రాలు, బీజాక్షరాలు చేర్చి తద్వారా మనం కోరిన కోరికలు సాధించే అవకాశాన్ని కల్పించారు. విశ్వాసమున్న వారికి లేనివారికీ కూడా ఈ శబ్దాల వల్ల, అక్షరాలవల్ల తప్పకుండా సత్ఫలితాలు కలుగుతాయి.

అత్యున్నత స్థాయికి చెందిన సనాతన భారతీయ సంస్కృతికి వారసులమైన మనం అందరం భక్తి విశ్వాసాలతో ఆయా మంత్ర,బీజాక్షరాల జపం ధ్యానం చేసుకుని అభివృద్ధినీ, అభ్యున్నతినీ సాధిద్దాం.

**సర్వేజనాః సుఖినో భవంతు.**

## 4. శ్రీ ఆదిలక్ష్మిదేవి వైభవము

### ప్రాణశక్తి ప్రదాయిని శ్రీ ఆదిలక్ష్మిదేవి

**శ్లో॥ సుమనస వందిత సుందరి మాధవి చంద్ర సహోదరి హేమమయే**
**మునిగణ వందిత మోక్షప్రదాయిని మంజుల భాషిణి వేదనుతే**
**పంకజ వాసిని దేవ సుపూజిత సద్గుణ వర్షిణి శాంతియుతే**
**జయజయహే మధుసూదన కామిని ఆదిలక్ష్మీ పరిపాలయమాం.**

శ్రీమన్మహాలక్ష్మీదేవి తన అష్ట విధ అంశలతో లీలా రూపంగా ధరించిన అష్టలక్ష్మీ అవతారాలలో ప్రథమమైనది శ్రీ ఆదిలక్ష్మీదేవి. ఈ తల్లి ప్రాణశక్తికి అధిష్ఠాన దేవత. ఆది అనే పదంలోనే సనాతనమైనది, మూలాధారమైనటువంటిది అనే అర్థాలు స్ఫురిస్తాయి. జీవించడానికి అత్యవసరమైనది ప్రాణశక్తి. అదికంటికి కనబడని శక్తి. సమస్త జీవరాశులలోనూ ప్రాణశక్తి పరిపుష్టంగా వున్నప్పుడే మిగిలిన శక్తులు రాణిస్తాయి. ఆ రకంగా ప్రాణశక్తి మీద వ్యక్తి వికాసం, తద్వారా సమాజ వికాసం కూడా ఆధారపడి వుంటాయి అంటే అతిశయోక్తి కాదు. జీవి తల్లి గర్భంలో పాంచ భౌతిక శరీరాన్ని దాల్చటానికి అవసరమైన మొదటి శక్తి ప్రాణశక్తే. "ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే ప్రాణేన జాతాని జీవంతి ప్రాణం ప్రయన్త్యభిసం విశంతీతి" అని తైత్తిరియోపనిషత్‌లోని భృగువల్లిలో ప్రాణశక్తి ప్రభావం గురించి చెప్పబడింది.

ఆదిలక్ష్మీదేవి అనుగ్రహం వుంటే మనలో ప్రాణశక్తి పరిపూర్ణంగా వుండి మనం ప్రశాంతమైన, ఆరోగ్యవంతమైన, ఆనందకరమైన జీవితాలను గడపగలుగుతాము. ప్రాణశక్తికి ఆరోగ్యానికి గల సంబంధం గురించి నేటి శాస్త్రజ్ఞులు కూడా ఎన్నో రకాల పరిశోధనలు చేసి, ధ్యానం ద్వారా ప్రాణశక్తి వృద్ధి చేసుకోవడానికి వీలవుతుంది అని కనుక్కున్నారు. మన శరీరంలోని అనేక మానసిక రుగ్మతలకి, శారీరకవ్యాధులకు మనలోని ప్రాణశక్తి తగ్గటమే కారణం అని నిర్ధారించారు. 'ప్రాణిక్ హీలింగ్' అనే ప్రక్రియ ద్వారా ప్రాణశక్తి లోపాలని సరిచేయవచ్చని నిరూపించడం జరిగింది. మన సనాతన భారతీయ విజ్ఞానంలోని భాగమయిన ఈ విద్యని నేడు మనం ఎంతో భక్తి ప్రపత్తులతో విదేశీయుల వద్దనుంచి నేర్చుకుంటున్నాము. అంతకు మించిన ఫలప్రదమైన మార్గం శ్రీ ఆదిలక్ష్మీ ఆరాధనం.

శ్రీ ఆదిలక్ష్మీదేవి అమ్మవారిని ధ్యానించటం ద్వారా, పూజించటం ద్వారా ప్రాణశక్తిని పెంపొందింపజేసుకుని అత్యద్భుతమైన ఫలితాలను పొందవచ్చు. అయితే ఆ తల్లి స్వరూప స్వభావాలు ఎటువంటివి?

(ప్రాణిక్ హీలింగ్ ప్రక్రియకు సంబంధించి ప్రపంచ గురువు అయిన "చోవాకోక్ సుయ్" గారితో రచయిత సంభాషించి దాని వివరాలను సేకరించడం జరిగింది. ప్రాచీన భారతీయ విజ్ఞానంలోని ఈ ప్రక్రియ టిబెట్, జపాన్ దేశాల ద్వారా నేడు పాశ్చాత్య దేశాలలో విస్తృతంగా వ్యాప్తి చెందింది.)



## శ్రీఆదిలక్ష్మీదేవి స్వరూప స్వభావాలు

ఆదిలక్ష్మీదేవి శుద్ధ జ్ఞానానికి ప్రతిరూపమైన పద్మంలో చతుర్భుజమూర్తిగా మనకి దర్శనం యిస్తుంది. అరుణకాంతులు వెదజల్లే ఎర్రని పట్టుచీరధరించి, రెండు చేతులలో పద్మాలను పట్టుకుని, రెండు చేతులతో భక్తులకు అభయ ప్రదానం చేస్తూ వుంటుంది. 'సుమనస వందిత' మంచి మనస్సుతో ఆరాధించే వారికి సత్వరం మంచి ఫలితాలను యిస్తుంది.ఆదిలక్ష్మీ మాత. భక్తుల ఎడల ఎంతో కరుణని చూపించే ఆ తల్లి స్వభావరీత్యా అలక్ష్యాన్నీ, నిరాదరణనీ, మర్యాదా ఉల్లంఘనాన్ని ఎంతమాత్రమూ సహించదు. తనకి చేసే ఉపచారాల విషయంలో ఏ మాత్రం తేడా వచ్చినా సహించదు. వెంటనే తన ప్రభావాన్ని చూపిస్తూ ఆ ప్రదేశాన్ని వీడిపోతుంది. భక్తులు తప్పు తెలుసుకుని ప్రార్థిస్తే తప్పకుండా మళ్ళీ కరుణిస్తుంది. ఆమె ఆగ్రహం కూడా చివరికి అనుగ్రహంగా పరిణమిస్తుంది. ప్రణవ స్వరూపిణిగా, గాయత్రి రూపిణిగా, సర్వదేవ నమస్కృతగా వినుతికెక్కిన ఈ తల్లిని దేవతలు కూడా సదా ఆరాధిస్తూ వుంటారు. సర్వమంత్ర ఫలప్రద, సర్వతీర్థ స్థిత, అపరాజిత అయిన ఈ తల్లి భవబంధవినాశిని.

**శ్లో॥ అనాదిమూర్తిరంభోజా మంభోజగర్భ వాసినీం**
**అంభోజ నాభజననీ, మంభోరుహ గర్భమాతృకా**
**కరుణాంభోనిధిః భక్త సర్వకామప్రదాయినీ**
**సదాస్మరామి దేవేశీ ఆదిలక్ష్మీ నమోస్తుతే॥**

విష్ణు పురాణగాథల ననుసరించి ఆదిలక్ష్మి భృగుమహర్షి పుత్రికగా తెలియవస్తోంది. ఆ తల్లికి "భార్గవి" అనే పేరు అందువల్లనే వచ్చింది. భృగువు బ్రహ్మమానస పుత్రుడని ప్రతీతి. భృగుమహర్షి జ్ఞానానికి ప్రతీక. అపార తపశ్శక్తి సంపన్నుడు, జ్ఞాన వృద్ధుడు అయిన ఈ మహర్షికి బ్రహ్మ అనుగ్రహం వల్ల అరికాలిలో జ్ఞాననేత్రం వుండేది. అలాంటి జ్ఞాన సంపన్నుడైన భృగువు ఎంతో కాలం ఘోర తపస్సు చేసి లక్ష్మీదేవి తన ఔరస పుత్రిక అయ్యేటట్లు వరం పొందాడు. తద్వారా వైకుంఠ వాసుడైన శ్రీమన్నారాయణుడు భృగువుకి అల్లుడయ్యాడు. విష్ణుమూర్తి సంకల్పశక్తి అయిన ఆదిలక్ష్మీదేవి నారాయణిగా, వైకుంఠ లక్ష్మిగా భక్తులను అనుగ్రహిస్తూ వుంటుంది.

## శ్రీ ఆదిలక్ష్మీదేవి ప్రభావము

శ్రీ ఆదిలక్ష్మీదేవి స్వభావాన్ని, ఆ తల్లి ఆగ్రహ అనుగ్రహ ప్రభావాలను తెలిపే రెండు కథలు పురాణాలలో విస్తృత ప్రాచుర్యంలో వున్నాయి.

## దేవతల గర్వభంగం

సదా విష్ణుమూర్తిని ఆశ్రయించి వుండే దేవతలకి ఆదిలక్ష్మీదేవి సమస్త సంపదలను అనుగ్రహించి వారి వారి విధులను నిర్వహించే సామర్థ్యాన్ని వారికి ప్రసాదిస్తూ వుంటుంది. ఈ విధంగా లక్ష్మీనారాయణుల అనుగ్రహం వల్ల స్వర్గంలో సమస్త సుఖాలను అనుభవిస్తూ, ఆనందాలలో మునిగిపోయి వున్న దేవతలు, క్రమంగా ఈ సంపదలన్నీ తమ శక్తిసామర్థ్యాల వల్లనే వచ్చాయనే స్థితికి చేరుకుని, శ్రీ ఆదిలక్ష్మీ దేవి కృపనే మరవటం జరిగింది. ఎప్పుడయితే అహంకారం తలకెక్కుతుందో అప్పుడే దైవానుగ్రహం కొరవడుతుంది. దేవతల ప్రవర్తనకి ఆదిలక్ష్మీదేవి ఆగ్రహించింది. ఎలాగైనా వీరికి బుద్ధి చెప్పాలని అనుకుంది. దారితప్పిన పిల్లలని ఏ తల్లీ చూస్తూ వూరుకోదుకదా! ఆతల్లి దేవలోకంలో తేజోరూపిణీ అయిన యక్షిణిగా సాక్షాత్కరించింది. కనులు మిరుమిట్లు గొలిపే ఆ తేజానికి దేవతలంతా భయపడ్డారు. దేవేంద్రుడు సయితం ధైర్యం కోల్పోయి అష్టదిక్పాలకులలో ముఖ్యుడయిన అగ్ని దేవుని పిలిచి ఈ శక్తి ఎవరో తెలుసుకునిరమ్మని పంపిస్తాడు. అగ్ని భట్టారకుడు హెచ్చిన దర్పంతో ఆ తేజోరూపిణిదరిజేరి "నేను ఈ చరాచర జగత్తులోని ఏ వస్తువు నైనా దహించి వేయగల అగ్నిదేవుడను. నీవు ఎవరో తెలియజేయవలసింది? అని అడిగాడు. అతనికి గర్వాన్ని గుర్తించింది ఆతల్లి. అతని గర్వభంగం చేయాలని తలచింది. ఒకదర్భని (గడ్డిపరకను) సృష్టించింది. అగ్నిని ఆ దర్భని కాల్చమని ఆదేశించింది. అగ్నిదేవుడు ఎంత ప్రయత్నించినా ఆ గడ్డిపరకని మాత్రం తాకలేక పోయాడు. అవమానభారంతో తలవంచుకుని వెనుదిరిగి వెళ్ళిపోయి దేవేంద్రునితో విషయం విన్నవించుకున్నాడు అగ్ని. దేవేంద్రుడు ఈసారి వాయుదేవుని చేరబిలిచి ఆ శక్తి యొక్క వివరాలు తెలుసుకుని రమ్మని పంపాడు. వాయుదేవుడు ఆ తేజో రూపిణిని సమీపించి నేను లోకాలన్నింటిలో యధేచ్ఛగా సంచరిస్తూ ఏ వస్తువునైనా క్షణకాలంలో కదల్చగల సామర్థ్యమున్న వాయువుని. నీవెవరవో తెలుపవలసింది? అని అడిగాడు. ఆదిలక్ష్మీదేవి తానుసృష్టించినదర్భని వాయుదేవుని ఎదురుగా పెట్టి దీనిని కదల్చగలవా? అనిఅడిగింది. బలగర్వంతో వాయువు విశ్వప్రయత్నం చేశాడు. కాని ఆ గడ్డి పరక మాత్రం కదలలేదు. మొహం చెల్లక వాయుదేవుడు దేవేంద్రుని వద్దకు వెళ్ళి ఆ శక్తి ఎవరో నీవే తెలుసుకోవలసింది అని చెప్పాడు. భయంభయంగా ఇంద్రుడు ఆ తేజోరూపిణి వద్దకు బయలుదేరాడు. కాని ఆ తల్లి అంతలోనే అంతర్థానం అయింది. భయభీతుడైన దేవేంద్రునితో ఆ తల్లి అశరీరవాణిగా యిలా పలికింది. "దేవేంద్రా మీ శక్తి సామర్థ్యాలు ఏపాటివో తెలిసిందా?" నా అనుగ్రహం లేకపోతే మీ దేవతల శక్తులన్నీవృధా అని గుర్తించావా అని గద్దించి అడిగింది. అప్పటికి యింద్రుడికి ఇదంతా వైకుంఠవాసిని ఆదిలక్ష్మీదేవి ఆగ్రహ ప్రభావం అని అర్థం అయింది. తప్పు తెలుసుకున్న యింద్రుడు ఎన్నోవిధాల ఆ తల్లిని స్తుతించి, శరణు శరణు అంటూ ప్రార్థించాడు. దేవేంద్రుని చేత ఆ సమయంలో అమ్మవారిని ప్రార్థిస్తూ చెప్పబడిన ఈ "మహాలక్ష్మీ అష్టకం".



శ్రీ ఆదిలక్ష్మీదేవి మహాత్మ్యము దేవతల గర్వభంగం

నమస్తేస్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే
శంఖ చక్ర గదాహస్తే మహాలక్ష్మీ నమోస్తుతే॥ 1
నమస్తే గరుడారూఢే డోలాసుర భయంకరీ
సర్వపాపహరే దేవీ మహాలక్ష్మీ నమోస్తుతే॥ 2
సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్ట భయంకరీ
సర్వదుఃఖ హరే దేవీ మహాలక్ష్మీ నమోస్తుతే॥ 3
సిద్ధిబుద్ధి ప్రదే దేవీ భుక్తిముక్తి ప్రదాయినీ
మంత్రమూర్తే సదా దేవీ మహాలక్ష్మీ నమోస్తుతే॥ 4
ఆద్యంత రహితే దేవీ ఆదిశక్తి మహేశ్వరీ
యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మీ నమోస్తుతే॥ 5
స్థూలసూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోదరే
మహాపాపహరే దేవీ మహాలక్ష్మీ నమోస్తుతే॥ 6
పద్మాసన స్థితే దేవీ పరబ్రహ్మ స్వరూపిణీ
పరమేశీ జగన్మాతః మహాలక్ష్మీ నమోస్తుతే॥ 7
శ్వేతాంబర ధరే దేవీ నానాలంకార భూషితే
జగత్థితే జగన్మాతః మహాలక్ష్మీ నమోస్తుతే॥ 8

ఫలశృతి :

మహాలక్ష్మష్టకం స్తోత్రం యః పఠేద్భక్తిమార్నవః
సర్వసిద్ధి మవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా॥ 9
ఏకకాలే పఠేన్నిత్యం మహాపాప వినాశనమ్
ద్వికాలం యః పఠేన్నిత్యం ధనధాన్య సమన్వితః॥ 10
త్రికాలం యః పఠేన్నిత్యం మహాశత్రువినాశనం
మహాలక్ష్మీర్భవేన్నిత్యం ప్రసన్నా వరదా శుభా॥ 11

యీ రకంగా అనేక విధాల స్తుతించి బీజాక్షర జపం చేసినటువంటి దేవేంద్రుని క్షమించి ఆ తల్లి కరుణించి సాక్షాత్కరిస్తుంది. తమ తప్పు తెలుసుకున్న దేవతలందరూ ఆ తల్లిని శరణు వేడి తమ తమ శక్తుల్ని తిరిగి పొందగలుగుతారు. ఈ కథ ద్వారా మనకి ఆ మాత అనుగ్రహాన్ని ఎవరూ ఎన్నటికీ మరువకూడదని, మనకి వున్న శక్తి సామర్థ్యాలన్నీ ఆ తల్లి అనుగ్రహం వల్లనే లభిస్తాయి అనే విషయం అర్థమవుతుంది. ఈ కథని ప్రశ్నోపనిషత్‌లో పరతత్వ నిదర్శన సందర్భంలో కూడా చెప్పటం జరిగింది.

యిలాంటిదే సాధకునికి అహంకారం మితిమీరి శ్రీలక్ష్మీ దేవి విషయంలో అపచారం చేయటం జరిగితే ఏం జరుగుతుంది అనే విషయం తెలిపే కథ మరొకటి వుంది.



## భృగుమహర్షి భంగపాటు

భృగుమహర్షి జ్ఞానానికి ప్రతీక అని చెప్పుకున్నాం కదా! అతని ఔరస పుత్రిక లక్ష్మీదేవి. ఎంతటి జ్ఞానాన్ని సంపాదించుకున్నా అహంకారాన్ని మాత్రం జయించలేకపోయాడు భృగువు. బ్రహ్మవర ప్రసాదితమైన "కాలిలోని జ్ఞాన నేత్రం" అతని అహంకారాన్ని మరింత పెంచింది. అతని గర్వాన్ని పోగొట్టి, తద్వారా లోక కల్యాణం జరిగేలా చేసినది ఆ లక్ష్మీనారాయణులు. ఆదిలక్ష్మీ మాత ఆగ్రహానుగ్రహ సమర్థురాలు. ఆమెకి ఆగ్రహం వస్తే ఎదుటివారు ఎవరైనా శిక్ష తప్పదు. ఒకసారి ఆ తల్లి తనకి అపచారం జరగటంతో వైకుంఠనాథుణ్ణి, వైకుంఠాన్ని కూడా విడిచిపెట్టి భూలోకానికి వెళ్ళిన గాథని ఆదిలక్ష్మీదేవి స్వభావానికి నిదర్శనంగా చెప్తారు. యజ్ఞ యాగాదులలో అగ్రసనాధిపత్యం తీసుకోగల సమర్థుడైన సాత్వికమూర్తి త్రిమూర్తులలో ఎవరు? అనే విషయం పరీక్ష చేయవలసినదిగా జ్ఞాన వృద్ధుడైన భృగువుని కోరారు మునిగణం. తన విచక్షణా జ్ఞానంమీద అపారమైన నమ్మకం గల భృగువు, ఆనందంతో త్రిమూర్తులని పరీక్షించటానికి బయలుదేరాడు. కైలాసంలో పరమశివుడి నుంచి, సత్యలోకంలో బ్రహ్మదేవుని నుంచి నిరాదరణని ఎదుర్కొన్న భృగువు కోపంతో వారిద్దరిని శపించి విష్ణువుని పరీక్షించే నిమిత్తం వైకుంఠం చేరుకున్నాడు. అక్కడ వున్నది తనకి పుత్రికా సమానురాలైన ఆదిలక్ష్మి, అల్లుడు నారాయణమూర్తి అనే ధైర్యంతో, తిన్నగా వైకుంఠ అంతఃపురంలో ప్రవేశించి నారాయణుని ఎలుగెత్తి పిలుస్తాడు. కాని అహంకార పూరిత భృగుమహర్షి పిలుపుని లక్ష్మీనారాయణులిరువురూ కూడా లెక్కచేయరు. లోక సంరక్షణ బాధ్యతలో మునిగిపోయివున్న వారు ఆ మహర్షి రాకని పట్టించుకోనేలేదు. ఒకనాడు భూలోకంలో ఒక ఏనుగు విష్ణుమూర్తిని ఉద్దేశించి ఆర్తితో "కావవేవరద సంరక్షింపు భద్రాత్మకా" అని పిలిచినంతనే "అల వైకుంఠ పురంబులో నగరిలో ఆమూల సౌధంబు దాపల" లక్ష్మీదేవితో క్రీడా వినోదంలో వున్న శ్రీ మహావిష్ణువు తటాలునలేచి శంఖ, చక్రాదులనైనా ధరించకుండా, లక్ష్మీదేవికైనా చెప్పకుండా పరుగు పరుగున భక్త రక్షణకి సిద్ధమై భూలోకానికి దయచేసాడు. కాని ఈనాడు జ్ఞానవృద్ధుడైన భృగుమహర్షి వైకుంఠానికి ఏతెంచి తనని ఎలుగెత్తి పిలుస్తున్నా సమాధానం యివ్వలేదు ఆ లక్ష్మీనారాయణులిరువురూ దీనికి కారణం ఆ మహర్షి అహంకారధోరణే. అహంకారం కళ్ళు కప్పిన భృగువు సాక్షాత్తూ విష్ణు వక్షస్థలాన్నే తన్ని మహాపచారం చేస్తాడు. సాత్వికమూర్తి విష్ణువు కోపగించక పోయినా ఆదిలక్ష్మీదేవి మాత్రం తక్షణం వైకుంఠాన్ని వీడిపోతుంది. విష్ణువు భృగువు పాదంలోని కన్నుని చిదిమి అతనికి గర్వభంగం కావిస్తాడు విష్ణువు. తప్పు చేసినది తన తండ్రి సమానుడైన భృగుమహర్షి కదా అని క్షమించలేదు ఆ తల్లి. తను వైకుంఠాన్ని వీడి వెళ్ళిపోతే విష్ణుమూర్తి ఎన్ని రకాల బాధలు పడతాడో కూడా ఆలోచించలేదు. లక్ష్మిలేని వైకుంఠంలో వుండలేక శ్రీమన్నారాయణుడు తాను కూడా లక్ష్మిని వెతుక్కుంటూ భూలోకానికి వచ్చి ఒక పుట్టలో తలదాచుకొన్నాడు. ఆదిలక్ష్మి ఆగ్రహిస్తే ఆదిదేవునికైనా

కష్టాలు తప్పవు అదీ ఆ తల్లి ప్రభావం. సరే ఆ తరువాత జరిగిన కథాక్రమంలో పద్మావతీ శ్రీనివాసులకల్యాణం, కలియుగవరదుడు శ్రీ వేంకటేశ్వరస్వామి ఆవిర్భావం మనకు తెలిసినవే. ఒకవిధంగా ఆ తల్లి ఆగ్రహం కూడా లోకకల్యాణానికే దారితీసింది. ఈ కథ ద్వారా మనకి ఎంతటి జ్ఞానికి అయినా అహంకారం కూడదు అనీ, ఆదిలక్ష్మీదేవి అపచారాన్ని ఏమాత్రం సహించదు అనీ తెలుస్తోంది.

శ్రీ ఆదిలక్ష్మీదేవిని ఇష్టకామేశ్వరీదేవి రూపంగాను వరలక్ష్మీరూపంలోను పూజించటం అనాదిగా వస్తున్నటువంటి ఆచారం. లక్ష్మీ షట్కంలో ఆదిలక్ష్మీ దేవిని వరలక్ష్మీ దేవిగా పేర్కొనటం జరిగింది.

## శ్రీ వరలక్ష్మీ పూజ

శ్రావణమాసంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారంనాడు వరలక్ష్మీ వ్రతం చేసుకోవడం ఆనవాయితీ. కొత్తగా పెళ్ళి అయిన ఆడపిల్లల చేత పెద్ద ముత్తయిదువులు ఈ వరలక్ష్మీ వ్రతాన్ని దగ్గరవుండి శ్రద్ధగా చేయిస్తూ వుంటారు. అన్ని శుక్రవారాలు అమ్మవారి పూజకి అనువైనవే అయినా, ఈ వరలక్ష్మీ వ్రతం నాడు చేసే పూజ వల్ల విశేషమైన ఫలితాలను పొందటం జరుగుతుంది అని మన పెద్దలు చెప్పడం జరిగింది. ఆ రోజు ఉదయాన్నే స్నానాదికాలు ముగించుకుని, స్త్రీలు నూతన వస్త్రాలు ధరించి ఈ పూజలు చేసుకొంటారు. ఇంటికి తూర్పుదిశలో పూజా మంటపాన్ని ఏర్పాటు చేసుకుని, ఆ మంటపాన్ని రంగవల్లులతో అలంకరించి, ఒకకొత్త తువ్వాలుపై బియ్యం పరచి దాని మధ్యలో కలశం ఏర్పాటు చేసుకోవాలి. లేత మర్రిచిగుళ్ళు, లేత మామిడి ఆకులు వంటి పంచ పల్లవాలతో అలంకరించిన కలశంపై కొబ్బరికాయ, దానిపై రవికల గుడ్డ కాని కొత్త చీరకాని పెట్టి అమ్మవారి రూపాన్ని మనోహరంగా తయారు చేసుకోవాలి. బంగారు నగలతోటి ఆ రూపాన్ని అలంకరించడం యిల్లాళ్ళ సరదా. ఈ విధంగా తయారు చేసుకున్న వరలక్ష్మీదేవిని శ్రీసూక్త విధానంగా ధ్యానం, ఆవాహనం, అర్ఘ్య పాద్యాదులు, స్నానం, ధూపదీపాదుల వంటి షోడశోపచారములతో అర్చించాలి. సద్బ్రాహ్మణులైన ఋత్విక్కుల ఆధ్వర్యంలో గృహములోని ఆడవారంతా సమూహంగా నిర్వహించుకునే ప్రత్యేక పూజ ఇది. అష్టోత్తర శతనామాలతో పువ్వులతో, కుంకుమతో అమ్మవారిని అర్చించాలి. తొమ్మిది సూత్రములతో (పోచలతో) మధ్యలో పువ్వులు చేర్చి కట్టుకునే తోరాన్ని వామహస్తానికి ధరించాలి. 12 రకాల పిండివంటలు ఒక్కొక్కటి 12 చొప్పున పూజ చేసిన బ్రాహ్మణునకు వాయినం ఇవ్వాలి. దక్షిణ తాంబూలాది సత్కారములతో ఋత్వికులని తృప్తిపరచడం ఒక ముఖ్యమైన కార్యక్రమం. ఈ వరలక్ష్మీ పూజలో మరొక ప్రత్యేకత వ్రతకథ. పూజ ఎంత ముఖ్యమో, వ్రతకథని చదువుకోవటం అంతే ముఖ్యం. ఆ తల్లి కరుణాకటాక్ష ప్రభావాన్ని తెలియజేసే ఈ కథని పాటరూపంగా పాడుకోవడం కూడా కొన్ని ప్రాంతాలలో ఆనవాయితీ అలా ఆడవారంతా కలిసి భక్తి శ్రద్ధలతో పాట పాడుతూ వుంటే చాలా వినసొంపుగా వుంటుంది. బ్రాహ్మణాశీర్వాదం తరువాత బంధుమిత్రాదులతో అందరూ ప్రసాదం తీసుకోవటం జరుగుతుంది. ఆ రోజు సాయంత్రం సువాసినులను పేరంటానికి పిలిచి, ఎంతో సంతోషంగా వారిని సత్కరించి పంపడం కూడా పూజా సాంప్రదాయంలోని భాగమే. చాతుర్వర్ణాల వారు ఎంతో భక్తి శ్రద్ధలతో ఈ వరలక్ష్మీ దేవిని పూజించి అఖండ సౌభాగ్యాన్ని, కుటుంబ సుఖసౌఖ్యాలను వరంగా పొందటం ఈ పూజలోని ముఖ్యఉద్దేశం. శ్రీ ఆదిలక్ష్మీదేవిని కామేశ్వరీ దేవి రూపంలో కూడా కొలవటం ఆనవాయితీ. కొన్ని కుటుంబాలలో కామేశ్వరీ దేవి కులదేవత. ఆ కుటుంబంలోని ఆడవారు అంతా కలిసి సమిష్టిగా ఇష్ట కామేశ్వరీ వ్రతం చేసుకుంటారు. ఆతల్లి అనుగ్రహంవల్ల కుటుంబంలోని వారందరూ ఆరోగ్యంగావుండేలా, అందరూ సుఖసంతోషాలతో ఆనందంగా వుండేలా అనుగ్రహించమని ఆ తల్లిని ప్రార్థిస్తారు.



ప్రాణశక్తిని వృద్ధి చేసుకుని తద్వారా శారీరక మానసిక అనారోగ్యాలను తగ్గించుకోవటం చాలా ఉత్తమమైన మార్గం. ఔషధ సేవ నాన్ని ఈ రకంగా బాగా తగ్గించుకోవచ్చు. ప్రాణశక్తిని పెంచమని ఆదిలక్ష్మి అమ్మ వారిని ప్రార్థించి శ్రద్ధా భక్తులతో పూజ చేసుకుంటే తప్పక ఆరోగ్యం చక్కబడుతుంది దేనికైనా నమ్మకం ముఖ్యం. సాధారణంగా అనారోగ్యం రాగానే విరివిగా మందులు వాడేయటం మనకి అలవాటయిపోయింది. ఆ మందుల దుష్ప్రభావ ఫలితంగా భవిష్యత్తులో మరిన్ని ఆరోగ్య సమస్యలు ఎదుర్కొవటం జరుగుతోంది. ఏ మందులు వాడనక్కరలేకుండా ఆ ఆదిలక్ష్మీ దేవి కృపవల్ల ప్రాణశక్తిని పెంపొందింప జేసుకుని పరిపూర్ణ ఆరోగ్యం పొందవచ్చని మన శాస్త్రాలు చెబుతున్నాయి. అందుకు ఒక మార్గం. పూజా విధానంలో భాగంగా ఆ ఆదిలక్ష్మీ మాత అష్టోత్తర శతనామావళిని భక్తి శ్రద్ధలతో పఠించటం ఇందువల్ల ఫలితం ఖచ్చితంగా లభిస్తుంది. ఆ నామావళిలోని నామాలన్నీ మనపూర్వీకులు ఎంతో సాధనచేసి కనుగొన్నవి. ప్రతినామమూ ఎంతో ప్రభావపూరితమైనది. ఆదిలక్ష్మీదేవి అష్టోత్తర శతనామావళిని భక్తుల సౌకర్యార్థం ఈ పుస్తకంలో చేర్చటం జరిగింది. నిత్యపూజలు చేసుకునే సౌకర్యం, అవకాశంలేని వారు కోసం బీజాక్షర జపం చేసుకుంటే తక్షణఫలితాలు కలుగుతాయి.

"ఓం క ఏ ఈ ల హ్రీం హ స క హల హ్రీం స క ల హ్రీం" ఈ 16 అక్షరాలు ఆదిలక్ష్మి మాత బీజాక్షరాలు. ఈ అక్షరాలని రోజుకి 108 సార్లు జపిస్తే ఆ మాత అనుగ్రహం తప్పకుండా లభిస్తుంది. మాహాత్మ్యం ఈ అక్షరాలలోనే వుంది. ఎందువల్లనంటే అవన్నీ శబ్ద రూపకంగా ఆ తల్లి రూపాలే. ఆ ధ్వని శరీరం నుండి వెలువడి మళ్ళీ శరీరంలోకి చేరే సరికి వాటి ప్రభావం వల్ల మనకి కావలసిన ఫలితాలు లభిస్తాయి. రేకీ, ప్రాణిక్ హీలింగ్ వంటి ఆధునిక పద్ధతులని నమ్మగలిగిన ఆధునికులు ఈ బీజాక్షర జపాన్ని ఆచరించి తద్వారా మాత్రమే ఆ బీజక్షారాల శక్తిని జపంవల్ల కలిగే సత్ఫలితాలను తెలుసుకొనగలరు. అందరూ కూడా ఆ తల్లి ఆదిలక్ష్మీ దేవిని అష్టోత్తర శతనామాలతో, బీజాక్షర జపాలతో సేవించి ఆ తల్లి అనుగ్రహాన్ని పరిపూర్ణంగా పొందెదరు గాక!

## శ్రీ ఆదిలక్ష్మి అష్టోత్తర శతనామ స్తోత్రం

శ్రీకాంతా శివసంధాత్రీ శ్రీంకార పంజర శుకీ
శ్రీ పదాశ్రిత మందారా శ్రీకరీ భృగునందినీ॥ 1

జితకోటి రతి సౌందర్యా జీవనరాగహేతవే
జీవనా జీవికా జీవా జీవగా జిజీవిషా॥ 2

సుఖమూలా సుప్రియాచ సురాసుర సుసేవితా
అష్టలక్ష్మీ స్వరూపా చ ఆదిమూర్తి అనాహతా॥ 3

అజితా విజితా సర్వజిద్దాసీభూత సురాంగనా
విష్ణుపత్ని ర్విశ్వరాజ్ఞీ ర్వేద వేదాంత చారిణీ॥ 4

వేదమాతా విశ్వమాతా అనంతానంద ప్రదాయినీ
నిత్య ప్రకాశి నీదేవి స్వప్రకాశ స్వరూపిణీ॥ 5

హృల్లేఖా పరమాశక్తిః మాతృకా బీజరూపిణీ
యజ్ఞ విద్యా మహావిద్యా గుహ్య విద్యా విభావరీః॥ 6

జ్యోతిష్మతీ మహామాతా సర్వమంత్ర ఫలప్రదా
గాయత్రీ సోమ సంభూతా సావిత్రీ ప్రణవాత్మికా॥ 7

శాంకరీ వైష్ణవీ బ్రాహ్మీ సర్వదేవ నమస్కృతా
జయా జయకరీ విజయా జయంతీ చాపరాజితా॥ 8

అష్టాంగ యోగినీదేవీ నిర్బీజా ధ్యానగోచరీ
సర్వతీర్థ స్థితా శుద్ధా సర్వ పర్వత వాసినీ॥ 9

శివాధాత్రీ శుభానందా యజ్ఞ కర్మ స్వరూపిణీ
వ్రతినీ మేనకా దేవీ బ్రాహ్మిణీ బ్రహ్మచారిణీ॥ 10

ఏకాక్షర పరా తారా భవబంధ వినాశిని
విశ్వంభరధరాధారా నిరాధారాధిక స్వరా॥ 11

రాకాకూహు రమా వాస్య పూర్ణిమానుమతీద్యుతిః
సినీ వాలీ శివానీ చ వశ్యా వైశ్వదేవీ పిశంగిలా॥ 12

పిప్పలాచ విశాలక్షీ రక్షోఘ్ని సృష్టికారిణీ
దుష్టవిద్రావిణీ దేవీ సర్వోపద్రవనాశినీ॥ 13

శారదా శర సంధానా సర్వశస్త్ర స్వరూపిణీ
పంచవక్త్రాః దశభుజా శుద్ధ స్ఫటిక సన్నిభా॥ 14

రక్తా కృష్ణా సితాసీతా సర్వవర్ణా నిరీశ్వరీ
పాతుమాం సర్వదాదేవీ ఆదిలక్ష్మీ నమో నమః॥ 15



### భగవంతుని పైభక్తి విశ్వాసాలు వృద్ధులకేనా?
### యువకులకీ, పిల్లలకీ అవసరంలేదా?

సాధారణంగా చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు చదువులతోనూ, పరీక్షలతోనూ, ఆటపాటలతోనూ కాలక్షేపం అయిపోతుంది. కొంచెం పెద్దయి యుక్తవయస్సు వచ్చేక పెద్ద చదువులలోపడి ఉద్యోగాలవేటలోనూ, రకరకాల విద్యార్హతలు సంపాదించు కోవడంలోనూ కాలం గడిచిపోతూవుంటుంది. ఆ తర్వాత ధనార్జన, సొంత కుటుంబం ఏర్పడడం, వారి అభివృద్ధి, వారి మంచి చెడ్డలు చూడడంతో ఏదో విధంగా కాలక్షేపం అయిపోయి చివరికి వయసయి పోయిన తరువాత, శరీరంలో ఓపికతగ్గాక, చేయాలనుకున్న పనులు చేయలేని తనవచ్చిన తర్వాత, అప్పుడు భగవంతుని గురించిన ఆలోచనలు, గ్రంథపఠనం, నియమనిష్ఠలు, పూజాదికాలు మొదలు పెట్టడం జరుగుతూ ఉంటుంది. కొన్ని తరాలపాటు యిలా జరుగుతూ వుండడంతో నేటి తరం ఇంచుమించు ఈ రకమైన భక్తి విశ్వాసాలు పూజాదికాలు వృద్ధులకి మాత్రమే పరిమితమయినవి అని అనుకునే దశకు చేరుకున్నారు.

కాని నిజానికి భగవదనుగ్రహం యొక్క అవసరం ఎవరికి ఎక్కువగా ఉంటుంది? జీవితంలో పైకి రావాల్సివున్న పిల్లలకి, యువకు(తు)లకి ఎక్కువగా ఉంటుంది. జీవిత చరమాంకంలో వున్న వృద్ధులకు మరి ఏమి సాధించాలి కనుక భగవదనుగ్రహం కావాలి?

పైగా యవ్వనంలో వున్నప్పుడే బుద్ధి రకరకాలుగా మారుతూ ఒక్కోసారి పెడదారులు పడుతూ వుంటుంది. ఆ సమయంలో యిది తప్పు సరైనదారిలోకి మళ్ళాలి అనే జ్ఞానం కేవలం భక్తివిశ్వాసాల ద్వారానే కలుగుతుంది. మానవ ప్రయత్నం ఎంతగా చేసినా దానికి భగవత్కటాక్షం తోడయితేకాని విజయాన్ని సాధించలేము. అందువల్ల ముందుగా జీవితంలో ఎంతో సాధించవలసిన పిల్లలకి,యువతకీ భగవంతుని దయ ఎక్కువ అవసరం.

### ఆదిలక్ష్మీ మంగళ హారతి

రమణీ నీకిదిగోనే రతనాలా హారతీ (2)
హారతీగైకొనీ అష్టైశ్వర్యము లియ్యవే ॥రమణీ నీకిదీ.....
అయిదవ తనమునకూనేనూ అతివానే కోరితీ చాలా (2)
ఆలస్యమికనేలా ఆనాతీయవే తల్లీ ॥ రమణీ నీకిదీ...
నిదురాకంటికీ రాకా నిన్నూనే పూజిస్తీ (2)
మిమ్మూ ప్రస్తుతి చేసినా నళినాక్షీవరాలియ్యవే ॥ రమణీ నీకిదీ...
మహాలక్ష్మీ పూజలూ మరువాకా నేజేతు (2)
మహాలక్ష్మీ మా మీదా మరువాకా కృపాజూడూ॥ రమణీ నీకిదీ...

రమణీ నీకిదే గోనే రతనాల హారతీ
హారతీ గైకొనీ అష్టైశ్వర్యములీయవే ॥ రమణీ నీకిదీ...

## శ్రీసూక్త జప ఫలం

నక్రోధో నచ మాత్సర్యం నలోభో నాశుభామతిః
భవంతి కృత పుణ్యానాం శ్రీసూక్తం జపేత్సదా

శ్రీమాత అనుగ్రహం కలగాలంటే క్రోధం, లోభం, మాత్సర్యం,అశుభచింతన అనే దుర్గాణాలని దూరంగా వుంచాలి. క్రోధం అంటే కోపం. కోపం వల్ల బుద్ధి నశిస్తుంది. మాత్సర్యం అంటే అసూయ. వారి వద్ద వుంది మన దగ్గరలేదు అనే అసంతుష్టి. లోభం వుంటే మనకి వున్నది నలుగురితో పంచుకోవటం ఇష్టంలేని పిసినారితనం. అశుభమతి అంటే అన్ని విషయాలనీ శంకిస్తూ నిత్య సంశయుడుగా వుండటం. ఈ నాలుగు రకాల గుణాలు వున్నవారి వద్ద లక్ష్మీదేవి స్థిరంగా వుండదు. మరి ఈ లక్షణాలు లేకుండా ఎవరైనా వున్నారా? ఈ కలియుగంలో అది సాధ్యం అయ్యే పనికాదు. అయితే దీనికి పరిష్కారం ఏమిటి?

దీనికి తరుణోపాయం శ్రీ సూక్త పారాయణమే. శ్రీ సూక్తాన్ని పారాయణ చేయటం వల్ల ఆ తల్లి అనుగ్రహించి మనలోని ఈ దుర్గుణాల ప్రభావాన్ని తగ్గిస్తుంది. తద్వారా కలిగిన పుణ్యం వల్ల మనము ఆ లక్ష్మీదేవి కృపకి పాత్రులం కావటం జరుగుతుంది.

### "లక్ష్మీనారాయణాభ్యాం నమః"

వివాహాలలో కొత్త దంపతుల చేత లక్ష్మీ నారాయణాభ్యాం నమః ఉమా మహేశ్వరాభ్యాం నమః శచీపురందరాభ్యాం నమః అని చెప్పించటం ఆనవాయితీ. పార్వతీ పరమేశ్వరుల, శచీ ఇంద్రుల విషయంలో ఏమో గాని లక్ష్మీ నారాయణులు మాత్రం వారు అనేకసార్లు వియోగాన్ని అనుభవించారు. భృగు గర్వభంగం తర్వాత లక్ష్మీదేవి కోపంతో వైకుంఠం వీడి వెళ్ళిపోతే విష్ణువు నానా ఇబ్బందులు పడి చివరికి శేషశైలం చేరాడు. రామావతారంలో సీతాదేవి భర్తతో వనవాసం చేసినా రాక్షస చెర తప్పలేదు. మరి కృష్ణావతారంలో రుక్మిణి ఎంతో ప్రేమించి శ్రీకృష్ణుడిని రాక్షస వివాహం చేసుకున్నా సవతి పోరు తప్పలేదు. మరి ఇలా వియోగాలు అనుభవించిన వారిని ఎందుకు ఆదర్శంగా పెళ్ళిళ్ళలో చెప్తారు?అసలు లక్ష్మీనారాయణులకి వియోగమేలేదు. వారు ఒకరు భావనాశక్తి అయితే మరొకరు క్రియాశక్తి. ఎల్లప్పుడూ విష్ణుమూర్తి లక్ష్మీదేవిని గుండెల్లో పెట్టుకుని చూసుకుంటూ వుంటాడు. అదేవిధంగా కొత్తపెళ్ళికూతుర్ని గుండెల్లో పెట్టుకుని చూసుకోవా లని పెద్దలు ఆశీర్వాదం. భార్యా భర్తా ఇరువురూ కలసి వున్నప్పుడే పరిపూర్ణత్వం భర్త అధికుడు భార్య అతనిని అనుసరించాలి అనే భావన లేకుండా ఇద్దరు కలసి మనస్ఫూర్తిగా కలసి ప్రవర్తిస్తేనే దాని వల్ల వారికీ, వారి కుటుంబానికీ లోకానికీ ఉపయోగం. జై లక్ష్మీనారాయణాభ్యాం నమః.





## ఆది లక్ష్మీ మహాయంత్రము

### మూల మంత్ర ధ్యానశ్లోకము

ఓం నమో భగవతీ ఆదిలక్ష్మీ శ్రీం హ్రీం ఐం క్లీం సౌః
మమ సర్వకార్యాణి సాధయ సాధయ
మమ గృహే లక్ష్మీం ప్రాపయ ప్రాపయ స్వాహా
108 సార్లు కుంకుమార్చన -
జపము - హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైనను కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ ఆదిలక్ష్మి అష్టోత్తర శతనామావళి

ఓం శ్రీకాంతాయై నమః
ఓం శివసంధా త్ర్యై నమః
ఓం శ్రీంకారపంజర శుకీయై నమః
ఓం శ్రీ పదాయై నమః
ఓం శ్రితమందారాయై నమః
ఓం శ్రీకర్యై నమః
ఓం భృగునందిన్యై నమః
ఓం జితకోటిరతి సౌందర్యాయై నమః
ఓం జీవనరాగహేతవే నమః
ఓం జీవనాయై నమః 10
ఓం జీవికాయై నమః
ఓం జీవాయై నమః
ఓం జీవగాయై నమః
ఓం జిజీవిషాయై నమః
ఓం సుఖమూలాయై నమః
ఓం సుప్రియాయై నమః
ఓం సురాసురసుసేవితాయై నమః
ఓం అష్టలక్ష్మీ స్వరూపాయై నమః
ఓం అదిమూర్త్యై నమః
ఓం అనాహతాయై నమః 20
ఓం అజితాయై నమః
ఓం విజితాయై నమః
ఓం సర్వజిత్యై నమః
ఓం దాసీభూతసురాంగనాయై నమః
ఓం విష్ణుపత్న్యై నమః
ఓం విశ్వరాజ్ఞ్యయై నమః
ఓం వేదవేదాంతసంచారిణ్యై నమః
ఓం వేదమాతయై నమః
ఓం విశ్వమాతాయై నమః
ఓం అనంతానందప్రదాయిన్యై నమః30
ఓం నిత్యప్రకాశిన్యై నమః
ఓం స్వప్రకాశస్వరూపిణ్యై నమః
ఓం హృల్లేఖాయై నమః
ఓం పరమాయై నమః
ఓం శక్త్యై నమః
ఓం మాతృకాబీజ రూపిణ్యై నమః
ఓం యజ్ఞవిద్యాయై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం గుహ్యవిద్యాయై నమః
ఓం విభావర్యై నమః 40
ఓం జ్యోతిష్మత్యై నమః
ఓం మహామాతాయై నమః
ఓం సర్వమంత్రఫలప్రదాయై నమః
ఓం గాయత్ర్యై నమః
ఓం సోమసంభూత్యై నమః
ఓం సావిత్ర్యై నమః
ఓం ప్రణవాత్మికాయై నమః
ఓం శాంకర్యై నమః
ఓం వైష్ణవ్యై నమః
ఓం బ్రాహ్మీయై నమః 50
ఓం సర్వదేవనమస్కృతాయై నమః
ఓం జయాయై నమః
ఓం జయకర్యై నమః
ఓం విజయాయై నమః
ఓం జయంతీయై నమః
ఓం పరాజితాయై నమః
ఓం అష్టాంగయోగిన్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం నిర్బీజాయై నమః
ఓం ధ్యానగోచర్యై నమః
ఓం సర్వతీర్థస్థితాయై నమః 60
ఓం శుద్ధాయై నమః
ఓం సర్వపర్వత వాసిన్యై నమః
ఓం శివాయై నమః
ఓం ధాత్ర్యై నమః
ఓం శుభానందాయై నమః
ఓం యజ్ఞకర్మ స్వరూపిణ్యై నమః
ఓం ప్రతినీయై నమః
ఓం మేనకాయై నమః 70
ఓం బ్రాహ్మిణ్యై నమః
ఓం బ్రహ్మచారిణ్యై నమః
ఓం ఏకాక్షరపరాయై నమః
ఓం తారాయై నమః
ఓం భవబంధవినాశిన్యై నమః
ఓం విశ్వంభరధరాయై నమః
ఓం ధారాయై నమః
ఓం నిరాధారాయై నమః
ఓం అధికస్వరాయై నమః
ఓం రాకాయై నమః
ఓం కూహూయై నమః 80
ఓం అమావాస్యాయై నమః
ఓం పూర్ణిమాయై నమః
ఓం అనుమత్యై నమః
ఓం ద్యుత్యై నమః
ఓం సినీవాల్యై నమః
ఓం శివాన్యై నమః
ఓం వశ్యాయై నమః
ఓం వైశ్వదేవ్యై నమః
ఓం పిశంగిలాయై నమః
ఓం పిప్పలాయై నమః 90
ఓం విశాలాక్ష్యై నమః
ఓం రక్షోఘ్న్యై నమః
ఓం సృష్టికారిణ్యై నమః
ఓం దుష్టవిద్రావిణ్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం సర్వోపద్రవనాశిన్యై నమః
ఓం శారదాయై నమః
ఓం శరసంధానాయై నమః
ఓం సర్వశస్త్ర స్వరూపిణ్యై నమః
ఓం పంచవక్త్రాయై నమః 100
ఓం దశభుజాయై నమః
ఓం శుద్ధస్ఫటిక సన్నిభాయై నమః
ఓం రక్తాయై నమః
ఓం కృష్ణాయై నమః
ఓం సితాయై నమః
ఓం సీతాయై నమః
ఓం సర్వవర్ణాయై నమః
ఓం నిరీశ్వర్యై నమః 108

## 5. శ్రీ ధాన్యలక్ష్మీ దేవి వైభవము

### శ్రీ ధాన్యలక్ష్మీదేవి ప్రశస్తి

శ్లో ॥ అయిభోకల్మష నాశిని కామిని వైదికరూపిణి వేదమయే
క్షీర సముద్భవ మంగళరూపిణి మంత్రనివాసిని మంత్రనుతే
మంగళదాయిని అంబుజవాసిని దేవగణాశ్రిత పాదయుతే
జయజయహే మధుసూదన కామిని ధాన్యలక్ష్మీ పరిపాలయమాం॥

జీవి మనుగడకి అత్యవసరమైనది ఆహారం. ఆ ఆహారాన్ని ప్రాణికోటికి అందించేది శ్రీమన్మహాలక్ష్మీదేవి రెండవ అవతారమైన ధాన్యలక్ష్మీ మాత. స్థూలంగా ఆలోచిస్తే మన పంటలు మనం వేసుకుని పెంచుకుంటున్నాం ఆహారం లభిస్తోంది, పశుపోషణ చేసుకుంటున్నాం పాలు, పెరుగు వగైరా వస్తున్నాయి, మరి ఆహారానికి ధాన్యలక్ష్మీ దేవికి ఏమిటి సంబంధం అని అనిపిస్తుంది.

యికపోతే బ్రతకటం కోసమే గదా తిండి తినటం. మరి ఏమిటింటే ఏమిటి? యిలా ఇన్ని రకాల మధుర పదార్థాలను, బలవర్ధకమైన ఆహారం తీసుకోకపోతే ఏమిటి నష్టం? యిలా కొన్ని సందేహాలు మనకి వస్తూ వుంటాయి.



### ఆహారం తీసుకోవడం ఎందుకు?

“శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం” అన్నారుమన పూర్వీకులు. దీని అర్థం ఏమిటంటే “ఏ విధమైన ధర్మ సాధన చేయాలన్నా శరీరం ఎంతో ముఖ్యం” అని. ఆ పరమాత్మ మనకి శరీరధారణకి అనుమతి ఇచ్చినదే ధర్మసాధన చేయటం కోసం. ఆయా ధర్మాలని నిర్వర్తించాలంటే మనం శారీరకంగాను, మానసికంగానూ దృఢంగా వుండాలి. దానికి అత్యవసరమైనది మంచి బలవర్ధకమైన ఆహారం. అన్నేన జాతాని జీవన్తి అని తైత్తిరియోపనిషత్‌లో చెప్పబడింది. ఎంతటి ఐహిక, ఆముష్మిక ధర్మసాధనలకయినా శరీరమే ఆధారభూతం అని వేదాలలో చెప్పబడింది.

ఆదిలక్ష్మీమాత అనుగ్రహించిన ప్రాణశక్తి ఆధారంగా ఉద్భవించిన జీవి యొక్క శరీరాభివృద్ధికి అవసరమైన ఆహారాన్ని అందించే భారాన్ని వహించింది శ్రీ ధాన్యలక్ష్మీమాత. సమస్త జీవకోటి జీవన యానం సక్రమంగా సాగే విధంగా అవసరమైన ఆహారాన్ని అందించే తల్లి ధాన్యలక్ష్మీదేవి. “ధాన్యం” అనగానే మనకి వరి, గోధుమ, జొన్న వగైరాలు ధాన్యాలు గుర్తుకు వస్తాయి. కాని ధాన్యలక్ష్మీదేవి “నిఖిల సస్యరూపిణి” అంటే అన్ని రకాలయిన సస్యాలకు కూడా అధిష్టానదేవతే. కేవలం పంటలకి మాత్రమే గాక పశుసంపదకి, తద్వారా లభించే పాలు, పెరుగు, వెన్న, మొదలయిన పోషక పదార్థాలన్నింటికీ కూడా ఈ తల్లే అధిష్టాన దేవత. నీవార గడ్డి (దర్భగడ్డి) పోచ మొదలు సమస్త రకాలయిన పంటలకీ అధిష్టాన దేవత అయిన ఈ తల్లిని “నీవార శూకవత్తన్వీ” అని కీర్తిస్తారు. ఏఏకాలాలలో ఏ విధమైన



ఆహారం తీసుకుంటే మనశరీరం ఆరోగ్యంగా వుంటుందో, ఆయా ఆహార పదార్థాలను కూరగాయలను, పళ్ళను వగైరా ఆయా కాలాల్లో ఆ తల్లి మనకి అనుగ్రహిస్తుంది.

పంటలకి సంబంధించినంతవరకు సాధారణంగా రైతులు మంచి జాతి విత్తనాలను నాటి, అవసరమైన నీరు, ఎరువులూ అన్నీ వేసి ఈ సంవత్సరం తప్పకుండా మంచి దిగుబడి వస్తుందని అనుకుంటారు. కాని ఎన్నో అనుకోని అవాంతర పరిస్థితులు ఎదురై అంచనాలు తారుమారవుతాయి. చేసిన ప్రయత్నం, శ్రమ నిష్ఫలమవుతాయి. మానవ ప్రయత్నానికి దైవానుగ్రహం తోడయినప్పుడే అనుకున్న ఫలితం లభిస్తుంది. సస్యలక్ష్మిగా పిలువబడే ధాన్యలక్ష్మీదేవిని రైతులు అనేక విధాల ఆరాధిస్తూ వుంటారు. ఆ తల్లి అనుగ్రహం వున్నపుడే మంచి ఫలితాలు, మంచి దిగుబడి వస్తాయి. అదే విధంగా కొంత మంది చిన్నప్పటి నుండీ కూడా ఎంత తిన్నా సరైన ఎదుగుదల లేక బుద్ధిమాంద్యంతో శారీరక అస్వస్థతతో బాధపడుతూ వుంటారు. వారి సమస్యలు ధాన్యలక్ష్మీదేవి అనుగ్రహం కనక వుంటే సులువుగా పరిష్కారమవుతాయి. ఈ తల్లి చేత నిర్దేశించబడిన ప్రకృతి సిద్ధమయిన సమతౌల్య ఆహారాన్ని తీసుకున్నవాళ్ళు సదా ఆరోగ్యంగా జీవించగలుగుతారు. వాత, పిత్త, కఫాలనబడే మూడు రకాలయిన దేహ ప్రవృత్తులను అదుపులో వుంచేది ఈ సమతౌల్య ఆహారమే. అమ్మవారి కృపవుంటే మనకి పరిపూర్ణ దేహారోగ్యంతో పాటు సత్త్వరజస్తమో గుణాలను అదుపులో వుంచుకోగల సామర్థ్యం కలుగుతుంది. అందువల్లనే ఈ తల్లి “గుణత్రయ వివర్జిత” గా కీర్తించబడింది. మంచి ఆహారాన్ని పరిమితంగా తీసుకుంటూ, సదాధార్మిక భావనలతో నిష్కల్మషమయిన సంకల్పంతో ఆ తల్లిని ఆరాధించే వారికి, తమకి తెలియకుండానే వారి శరీరానికి ఒక విధమైన తేజస్సు సంప్రాప్తం అవుతుంది. దీనినే దేహ ఉద్దీపనం అంటారు. ఇంగ్లీషులో ‘ఆరా’ అంటే యిదే. ధాన్యలక్ష్మీ మాతని “దేహ ఉద్దీపనకారిణి” గా ఆరాధించటం జరుగుతోంది.

### శ్రీధాన్యలక్ష్మీదేవి స్వరూప స్వభావాలు

ఈ తల్లి హరితాంబరధారిణి అంటే ఆకుపచ్చరంగు వస్త్రాలను ధరిస్తుంది. ఆకుపచ్చరంగు సస్యశ్యామల తత్వానికి, ఎదుగుదలకి సంకేతం. ధాన్యలక్ష్మీ దేవి అష్టభుజమూర్తి. ఒక చేతిలో అరటి పళ్ళగెలను, మరో చేతితో చెఱుకు గడను, ఇంకొక చేతిలో వరికంకెలను ధరించి వుంటుంది. మిగిలిన చేతులలో ఒక దానితో పద్మాన్ని పట్టుకుని వుంటుంది. రెండు చేతులలో గదాశంఖాదులు వుంటాయి. రెండు వరద హస్తాలతో భక్తులకు అభయ ప్రదానం చేస్తూ వుంటుంది. అమ్మ వారి రూపం ఎంతో అర్థవంతమైన మనోహరమూర్తి. తామరపువ్వు (పద్మం)లో పద్మాసన ముద్రలో కూర్చుని వుంటుంది ఈ ధాన్యలక్ష్మీమాత. వరికంకె ధాన్యాన్ని సూచిస్తూ వుంటే, అరటిపళ్ళగెల శక్తివంతమైన ఫలాలని, చెఱుకుగడ మధురాతి మధురమైన

పానీయాన్ని సూచిస్తూ వుంటుంది. ఈ మూడింటి కలయిక వల్ల శరీరానికి అవసరమైన అన్ని రకాల పోషక పదార్థాలు, ఖనిజాలు వగైరా లభిస్తాయి. పద్మం చైతన్యాన్ని, ఎదుగుదలని సూచిస్తూ వుంటుంది. రెండు చేతులలోని ఆయుధాలు ఆ తల్లి అధికారానికి, ప్రభుతకి సంకేతాలు. ధాన్యలక్ష్మీదేవి కూడా అలక్ష్యాన్ని, అహం కారాన్ని, అనాచారాన్ని ఏమాత్రం సహించలేదు. భక్తానుగ్రహకారిణి అయిన ఆ తల్లికి కోపం వస్తే ఎంతటివారైనా అష్టకష్టాలు పడవలసిందే. భక్తులు తప్పు తెలుసుకుని శరణువేడితే ఆ తల్లి క్షమించి కాపాడుతుంది.

ఆ ధాన్యలక్ష్మీ దేవిని ప్రసన్నురాలిని చేసుకోవాలంటే, కష్టపడి పంటలను పండించే రైతన్నలనీ, పశుగణాన్ని తగిన రీతిలో గౌరవించాలి. ఈ రకమైన సాంప్రదాయం అనాది నుంచీ మనదేశంలో ప్రాచుర్యంలో వుంది. ఈ ఆచారంలో భాగంగానే నేటికీ పల్లెలలో సంక్రాంతి సందర్భంగా సంబరాలు చేయటం మనం చూస్తూ వుంటాం. పుష్యమాసంలో వచ్చే సంక్రాంతినాడు, సమృద్ధిగా పండిన ధాన్యపురాశులని ఎడ్లబళ్లలో యిళ్ళకు చేర్చుకుని, కష్టించి పనిచేసిన రైతు కూలీలకు ధాన్యాన్ని పంచి యిచ్చి, పశువులకు పూజచేసి ఆ ధాన్యలక్ష్మీదేవిని అర్చిస్తూ వుంటారు. ఈ విధంగా ఆ తల్లిని అర్చిస్తే దుర్భిక్షం క్షామం అనేవి దగ్గరకు రావని, దేశం సుభిక్షంగా వుంటుందని ప్రజల విశ్వాసం. ఆ ధాన్యలక్ష్మీ మాత ఆగ్రహానుగ్రహ ప్రభావాలని తెలియజేసే ఒక ప్రముఖమైన కథ మనకి పురాణాలలో లభ్యమవుతుంది.

## శ్రీధాన్యలక్ష్మీదేవి మాహాత్మ్యం

పూర్వం త్రేతాయుగంలో కోసల రాజ్యాన్ని అయోధ్య రాజధానిగా దశరథ మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆకాలంలో ధర్మం నాలుగు పాదాలతో నడుస్తూ వుండేది. రాజు ప్రజలకు ఏ లోటూ రాకుండా కన్న బిడ్డల్లా చూసుకునేవాడు. పాడి పంటలు పుష్కలంగా వుండటంతో పాటు దేశ ప్రజలందరూ సాంప్రదాయ పద్ధతులలో భగవదారాధనలు చేస్తూ వుండేవారు. అపార బలపరాక్రమ వంతుడైన రాజు రక్షణలో ప్రజలు సుఖశాంతులతో హాయిగా కాలక్షేపం చేసేవారు. గ్రహగతుల ప్రభావము మానవ జీవితం మీద, సామాజిక పరిస్థితులమీద ఎంతగానో వుంటుందని అంతా నమ్మేవారు.

ఇలా వుండగా ఒకసారి దశరథుని ఆస్థాన జోస్యులు త్వరలో శనిగ్రహం రోహిణీ నక్షత్రంతో కూడి సంచరించే సమయం రాబోతోందనీ, దాని కారణంగా దేశంలో క్షామం ప్రబలి ప్రజలు ఆకలి బాధలు పడే అవకాశం వుందని తెలియజేస్తారు. 'ప్రమాదో ధీమతామపి' సంకట వచ్చినపుడే ధైర్యంగా వుండాలి. ప్రజలకు రాబోయే విపత్తుని ఎలాగైనా నిరోధించాలి అనుకున్నాడు రాజు. ఎలాగైనా సరే శనిగ్రహం గమనాన్ని మార్చాలనే ఉద్దేశంతో ఆ శనేశ్వరుణ్ణి కలవాలనే ఉద్దేశంతో రథారూఢుడై ఆకాశమార్గంలో ప్రయాణం సంకల్పిస్తాడు. అవసరమయితే యుద్ధం చేసైనా



అనుకున్నది సాధించాలి అని సమస్త ఆయుధాలను తీసుకుని ప్రయాణం అయ్యాడు. ఆ సమయంలో రాజ్యంలోని ప్రజలు ధాన్యలక్ష్మీదేవి ఆలయం ఎదురుగా సంక్రాంతి సంబరాలు చేసుకుంటున్నారు. ఆతల్లిని పూజించి ఆమె ప్రసాదాన్ని రాజుకి యివ్వాలని వస్తారు. ఎలాగైనా శనిగ్రహం వల్ల కలిగే అవాంతరాలని నివారించగలననే నమ్మకం గల రాజు ప్రసాదాన్ని ఆదరించి స్వీకరించలేదు. రెట్టించిన ఉత్సాహంతో శనీశ్వరుని వద్దకి బయలుదేరిన రాజుకి తనరథం ధాన్యలక్ష్మీదేవి ఆలయంపై నుంచి ఆకాశమార్గంలో వెడుతున్నట్లుగా తెలియనే తెలియదు. కాని ధాన్యలక్ష్మీదేవి మాత్రం రాజు చేసిన అపచారం గ్రహించి ఆగ్రహించింది. ఆ తల్లి ఆగ్రహం కూడా రాజుకి తెలియదు. నేరుగా శనీశ్వరుని వద్దకు వెళ్ళి ఏ తప్పుచేయని తన ప్రజలు కష్టపడటం తనకి యిష్టంలేదనీ, దయచేసి నీగమనాన్ని మార్చుకోవలసింది అనీ ఆ శనీశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు రాజు. దశరథుని భక్తి ప్రపత్తులు, మంచి నడవడిక తెలిసిన శనీశ్వరుడు ఆ రాజు కోరినట్లుగానే తన గమనాన్ని మార్చుకుంటానని అభయం ఇస్తాడు. ఆనందంతో రాజు తన రాజ్యానికి తిరిగివస్తాడు. రాజు తిరిగివచ్చేసరికి ధాన్యలక్ష్మీ మాత రాజ్యంలోని ధాన్యపురాశులన్నీ మాయం చేసి రాజ్యం అంతటా దుర్భిక్ష పరిస్థితులు సృష్టిస్తుంది. అయోధ్యకు ఆనందంగా తిరిగి వచ్చిన రాజు ప్రజల దుస్థితి చూసి కలత చెందుతాడు. గురువు వశిష్టుల వారిని రావించి విషయం వివరించి శనిగ్రహం అనుగ్రహం వున్నప్పటికీ ఎందుకిలా జరిగింది? అని అడుగుతాడు. త్రికాలజ్ఞాని అయిన వశిష్ట మహర్షి దివ్యదృష్టితో రాజు ధాన్యలక్ష్మీదేవి పట్ల చేసిన అపచారాన్ని గ్రహించి ఓ రాజా నీ బలపరాక్రమాల మీద నమ్మకంతో శనీశ్వరుని వద్దకు వెళ్ళే సమయంలో ధాన్యలక్ష్మీదేవి ఆలయం మీదుగా ప్రయాణించి అపచారం చేసావు. దాని ప్రభావం యిది. వెంటనే ఆ తల్లిని క్షమించమని శరణు వేడుకో అని సూచిస్తాడు. ప్రజాక్షేమమే పరమకర్తవ్యం అనుకున్న రాజు దశరథుడు ఆ ధాన్యలక్ష్మీమాతని 'అపరాధం క్షమస్వ' అంటూ ఎన్నో విధాల ప్రార్థిస్తాడు.

శ్లో ॥ నీవారశూక వత్తన్వీ నిఖిల సస్యరూపిణీ।
అన్నరూపేశీ పరమేశీ పరబ్రహ్మ స్వరూపిణీ
పద్మే పద్మాసనస్థాచ - అష్టబాహూసుశోభితా
హరితాంబరధారిణీ వదనస్మిత చంద్రికా
శాలిశూకగదా పద్మ వరదాభయపరాంబికా
హాలకుంభీక్షుధారీచ - వరహస్తా నమోనమః

కరుణామయి అయిన ఆ మాత రాజు అంతరంగాన్ని, ధార్మికతను గుర్తించి అతనిని క్షమిస్తుంది. తాను కల్పించిన దుర్భిక్ష పరిస్థితులను మాయం చేస్తుంది. ప్రజలందరూ తిరిగి సుఖ సంతోషాలతో తుల తులతూగుతూ వుంటారు. ఈ విధంగా ఆ ధాన్యలక్ష్మీమాత ఆగ్రహానుగ్రహ సమర్థురాలని, అపచారాన్ని ఎంత మాత్రమూ సహించదనీ తెలుస్తోంది.

సస్య సంపద అభివృద్ధిని కోరుకునే వ్యవసాయ దారులు, పశుగణాభివృద్ధి, తద్వారా పాడిసంపద పెరగాలని కోరుకునే వారు. ధాన్యలక్ష్మీదేవిని పూజించి సేవించడం వల్ల తప్పక సత్ఫలితాలను పొందగలుగుతారు. అంతే గాక ఎంతటి బలకరమైన ఆహారాన్ని తీసుకుంటున్నా పదే పదే అనారోగ్యం పాలయ్యేవారు కూడా ధాన్యలక్ష్మీమాత అనుగ్రహం వల్ల పరిపూర్ణ ఆరోగ్యాన్ని పొందగలుగుతారు. ఆ మాత అనుగ్రహాన్ని కోరుకునేవారు ధాన్యలక్ష్మీదేవిని షోడశోపచారాలతో అష్టోత్తర శతనామావళితో పూజించాలి. ప్రతినిత్యం పూజ చేసుకునే అవకాశం లేని వాళ్ళు "ఓం శ్రీం క్లీం" అనే బీజాక్షరాలను రోజుకి 108 పర్యాయాలు జపిస్తే అనుకున్న కార్యం తప్పక సిద్ధిస్తుంది. భక్తులందరూ భక్తి శ్రద్ధలతో శ్రీ ధాన్యలక్ష్మీ మాతని సేవించి ఆ తల్లి కరుణాకటాక్షాల వల్ల సుఖసంతోషాలతో జీవనం కొనసాగించెదరు గాక!

## దేహ ఉద్దీపనం అంటే ఏమిటి? (AURA)

దేవతల బొమ్మలు, దైవాంశసంభూతుల బొమ్మలు వేసినపుడు వారి 'తల'చుట్టు కాంతిపుంజం కనిపించేలా వేస్తూ వుంటారు. అది వారు మహానుభావులని, కారణ జన్ములనిసూచిస్తుంది. కాని మన భారతీయసంస్కృతీ విజ్ఞాన విషయాలపై మంచి అవగాహన వున్నవారు తెలియజేసే విషయం ఏమిటంటే మనందరి చుట్టూ కూడా ఈ భౌతిక శరీరాన్ని ఆవరించుకుని ఒక కాంతి శరీరం వుంటుందని (ఇంగ్లీషులో దీనిని "ఆరా" అని అంటారు.(Aura) ఈ కాంతి శరీరంయొక్క లక్షణాలని బట్టి ఆ వ్యక్తిని అంచనావేస్తారని. దలైలామా మనకంచికామకోటి పీఠాధిపతులైన శ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతి స్వాములవారిని చూసి వారి "ఆరా" యొక్క ప్రభావానికి ఆశ్చర్యపడి వీరు భగవంతుని అవతారమే అని చెప్పటం జరిగింది. కొద్దో గొప్పో ఈ కాంతి శరీరం మనందరిచుట్టూ కూడా వుంటుంది. మనలోని మంచి ఆలోచనలు, కార్యనిర్వాహణ దీక్ష, సామర్థ్యం అధికమయినపుడు ఆ కాంతి పెరుగుతుంది. ఉజ్జ్వలమైన కాంతి పరిపూర్ణ మానసిక ప్రశాంతతని తెలియజేస్తుంది. అనారోగ్యంతో బాధపడేవారికి, సమస్యలతో మానసికంగా బాధపడుతున్నవారికి స్పష్టంగా వుండదు. కాంతి శరీరం. ఆరా గురించి ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి. ఏవిధంగా ఈ 'ఆరా'ని పెంచుకోవాలి అనే విషయంపై ఆసక్తి దాయకమైన విషయాలు నిరూపించబడ్డాయి. అష్టలక్ష్మీ మూర్తులలో ధాన్యలక్ష్మీదేవి దేహ ఉద్దీపనకారిణి గా వర్ణించబడింది. ఆ ధాన్యలక్ష్మీదేవి పరిపుష్టమైన ఆహారాన్ని మనకి అందివ్వటమేగాక ఆయా ఆహారపదార్థలను మనం తీసుకున్న తర్వాత వాటిలోని శక్తి మన శరీరానికి వంటబట్టి "దేహ ఉద్దీపనం" జరిగేలా అనుగ్రహిస్తుంది. కాబట్టి పరిపూర్ణ ఆరోగ్యవంతులు కావాలనుకునేవారు "ఓం శ్రీం క్లీం" అనే శ్రీధాన్య లక్ష్మీదేవి బీజాక్షరాలని రోజు 108 సార్లు పారాయణం చేయాలి. ఆ తల్లి అనుగ్రహం వల్ల తప్పక ఫలితం కన్పిస్తుంది.



## ధాన్యలక్ష్మీ హారతి

జయమంగళం నిత్య శుభమంగళం శ్రీ ధాన్యలక్ష్మీదేవికిదే మంగళం
శుక్రవారము నాడూ మగువలంతా కూడి శ్రీలక్ష్మీసేవ చేయగా
శుభప్రదమైన వరములిచ్చే కల్పవల్లికిదే మంగళం జయమంగళం నిత్య......
కుంకుమ మంచి కస్తూరి కోర్కెతో యివ్వగా మేమూ
సాంబ్రాణి ధూపమూ మాతా నీకు అర్పించెదమూ జయమంగళం నిత్య.....
అందమైన నారింజలూ, మిగులముగ్గిన జామపండ్లూ
సతతము కర్పూర ఫలములతో నిను అర్చించెదమూ జయ మంగళం నిత్య...
పానకం వడపప్పు పచ్చి ద్రాక్ష పళ్ళూ గంగరేగిపండ్లు
గైకొని వస్తి మీ విందారగించవమ్మా చల్లగ మము బ్రోవుమమ్మా జయమంగళం

## శ్రీ ధాన్యలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం

శ్రీదేవి శ్రితమందారా భూరూపా భుక్తిదాయినీ,
నీవారశూక వత్తన్వీ నిఖిల సస్యరూపిణీ ॥ 1
అన్నరూపా పరమేశీచ పరబ్రహ్మ స్వరూపిణీ
పద్మే పద్మానస్థా చ అష్టబాహూ సుశోభితా ॥ 2
హరితాంబర ధారిణీ వదనస్మిత చంద్రికా
దిగ్వస్త్రా సువస్త్రాచ కన్యకాకాశ్యపోద్భవా ॥ 3
శ్రీసౌమ్యా లక్షణాతీతా దుర్గాసూత్ర ప్రభోధికా
ప్రాణసూత్రా శ్రద్ధామేధా కృతిః ప్రజ్ఞాధారణాయచ ॥ 4
కాంతి శృతి స్మృతిః ధృతిః ధన్యాభూతేష్టి మనిషిణీ
అవస్థాత్రయ నిర్ముక్తా గుణత్రయ నిరుక్తయా ॥ 5
ఈషణ త్రయ నిర్ముక్తా సర్వరోగ వివర్జితా ।
శ్రీ కాయా శ్రీకళా శుభ్రా కర్మనిర్మూలన కారిణీ ॥ 6
ధాన్యలక్ష్మీ గుణాధారా పంచబ్రహ్మాత్మికా పరా
అష్ట ప్రకృతి రష్టాష్ట విభ్రాజద్వికృతాకృతే ః॥ 7
దుర్భిక్ష ధ్వంసినీ సీతా సత్యారుక్మిణీ చత్వం
జాలంధరీ మృడానీచ - భవానీ భవభంజనీ॥ 8
త్రైకాలిక జ్ఞాన తంతూ త్రికాల జ్ఞానదాయినీ
మధుజిహ్వా మధుమతి మధుమాసోదయా మధూ॥ 9
మాధవీ మహాభాగా మేఘగంభీర నిస్వనా
సామగాన సమారాధ్యా, శ్రోతకర్ణ రసాయనా॥ 10
జీవలోకైక జీవాత్మా భద్రోదార విలోకనా
తటి త్కోటి లసత్కాంతీ తరుణీహరి సుందరీ॥ 11

మీననేత్రేఇందిరాక్షీ విశాలాక్షి స్సుమంగళా
సర్వమంగళ సంపన్నా సాక్షాన్మంగళదేవతా ॥ 12

దేహ హృద్దీపికా దీప్తీ జిహ్వాపాప ప్రణాశినీ
నిత్యా తఖ్యా రమారామా రమణీ మృత్యు భంజనీ ॥ 13

జ్యేష్ఠా కాష్ఠ ధనిష్ఠాంతా శరాంగీ నిర్గుణ ప్రియా
మైత్రేయా మిత్రవిందాయ త్వమేవ సర్వ రూపిణీ ॥ 14

జగదుత్పత్తి సంస్థాన సంహార త్రయ కారణీ
త్వమంబా విష్ణు సర్వస్వామహేశ్వరి నమోనమః ॥ 15

సర్వలోకానాం జననీ పూర్వాముక్త్యైర్నమోస్తుతే
సిద్ధ లక్ష్మీ మహంకాళి మహాలక్ష్మీ ప్రకీర్తితే ॥ 16

పశు, ప్రాణా పరన్నా ధాన్యలక్ష్మీ నమోస్తుతే
ఏవం శ్రీధాన్యలక్ష్మస్య అష్టోత్తరం విదుః ॥ 17

### అభ్యాగతో స్వయం విష్ణుః

అతిథి అభ్యాగతులను ఆదరించటం మన సాంప్రదాయం. పూర్వం అందరూ కూడా ఈ ఆచారాన్ని తప్పక పాటించేవారు. భోజన సమయానికి యింట్లో ఎంత మంది వుంటే అందరికీ భోజనం పెట్టేవారు. మారుతున్న కాలంతోపాటు విలువలూ మారుతూ వస్తున్నాయి. ఆ కాలంలో అయితే వారికి పుష్కలంగా పాడి పంటలు వుండేవి కాబట్టి వారికి అలా వీలయింది కాని మాకు ఎలా కుదురుతుంది. యిలా దాన ధర్మాలు చేస్తే మనకి ఏమిటి లాభం? అని అడుగుతారు నేటి ఆధునికులు. ఎవరేనా మన సాయం కోరివస్తే మనకి సాధ్యమైనది యిచ్చి పంపటం మన కనీస ధర్మం. ఏమో రేపు మనకి ఏమి అవసరం వస్తుందో ఎవరేమి చెప్పగలరు? లక్ష్మీదేవి అతిధులను ఆదరించే వారింట్లో స్థిరనివాసం వుంటానని శెలవిచ్చింది. ఆ విధంగా అతిధులని ఆదరిస్తే కలిగే ఫలితాన్ని గురించి ఎంతో చక్కగా తెలియజేస్తుంది 'కనకధారాస్తవం'కథ. ఆ కథలోని బ్రాహ్మణ దంపతులు గత జన్మలో పుణ్యం చేసుకోని కారణంగా గర్భదారిద్ర్యంలో మ్రగ్గుతూ వుంటారు. కాని సదాచారాలని మాత్రం విడవక పాటిస్తూ వుండేవారు. తమకి లేకపోయినా అతిథులకి సేవచేయాలనుకునే వారు. ఆదిశంకరాచార్య దంతటివాడు వారింటికి భిక్షకి వెడితే యివ్వటానికి ఏమీ లేక ఒక ఉసిరికాయ భిక్షవేస్తారు. శంకరుడు కనకధారాస్తవంతో లక్ష్మీదేవిని ప్రసన్ను రాలిని చేసుకుని వీరు చేసే అతిధి పూజ ఒక్కటేచాలు వీరికి సమస్త భోగభాగ్యాలు నీవు యివ్వటానికి అని యుక్తియుక్తంగా వాదించి వారింట కనక వర్షం కురిసేలా చేస్తాడు. అంతటి శక్తివంతమయినది అతిధిపూజ.



శ్రీ ధాన్యలక్ష్మీదేవి మహాత్మ్యం

## శ్రీ మహాలక్ష్మీ కవచము

బ్రహ్మదేవుని చేత చెప్పబడినది శ్రీమహాలక్ష్మీ కవచం. ఎంతో శక్తి వంతమైన ఈ కవచాన్ని ప్రతినిత్యం భక్తి శ్రద్ధలతో పఠించే వారు అన్ని అనారోగ్యాలూ పోగొట్టుకుని పరిపూర్ణ ఆరోగ్యం పొందగలుగుతారు.

**ఇంద్ర ఉవాచ :**

సమస్త కవచానాం తు తేజస్వీ కవచోత్తమమ్
ఆత్మ రక్షణానురోగ్యం సత్యం త్వం బ్రూహిగీష్పతే

**శ్రీగురురువాచ :**

మహాలక్ష్మీస్తు కవచం ప్రవక్ష్యామి సమాసతః
చతుర్దశాసు లోకేషు రహస్యం బ్రహ్మణోదితం॥

**బ్రహ్మోవాచ :**



శిరో మే విష్ణు పత్నీచ లలాట మమృతోద్భవా
చక్షుషీ పాతు విశాలాక్షీ శ్రవణే సాగరాంబుజా॥ 1

ఘ్రాణం పాతువరారోహ మామ్నాయ జిహ్వా రూపిణీ
ముఖం పాతు మహాలక్ష్మీః కంఠం వైకుంఠ వాసినీ॥ 2

స్కంధౌ మే జానకీ పాతు భుజౌ భార్గవ నందినీ
బాహు ద్వే ద్రవిణీ పాతు కరౌ హరివరాంగనా॥ 3

వక్షః పాతు చ శ్రీదేవీ హృదయం మే హరిసుందరీ
కుక్షించ వైష్ణవీ పాతు నాభిం భువన మాతృకా॥ 4

కటించ పాతు వారాహీ సక్థినీ దేవిదేవతా
ఊరూనారాయణీ పాతు జానునీ చంద్రసహోదరీ॥ 5

ఇందిరాపాతు జంఘేమే పాదౌ భక్త నమస్కృతా
నఖాన్ తేజస్వినీ పాతు సర్వాంగం కరుణామయీ॥ 6

బ్రహ్మణీ లోకరక్షార్థం నిర్మితం కవచం శ్రియః
యే పఠంతి మహాత్మానస్తే చ ధన్యాజగతయే॥ 7

కవచేనామమ్ము తాంగనాం జనానాం జాయదాసదా
మాతేవ సర్వసుఖదా భవత్వమమరేశ్వరీ॥ 8

భూయః సిద్ధి మవాప్నోతి పూర్వోక్తం బ్రహ్మణా స్వయం
లక్ష్మీర్హరిప్రియా పద్మా ఏతన్నామత్రయం స్మరన్ ॥ 9

నామత్రయమిదం జప్త్వా సయాతి పరమాం శ్రియమ్
యః పఠేత్స చ ధర్మాత్మా సర్వాన్కామాన వాప్నుయాత్ ॥ 10



## ధాన్య లక్ష్మీ యంత్రము

### మూల మంత్రధ్యాన శ్లోకము

ఓం నమో భగవతీ ధాన్యలక్ష్మీ శ్రీం హ్రీం క్లీం సౌః ఐం
మమ గృహే ధాన్య స్వరూప ధనం దేహి దేహి,
మమ ముఖే లక్ష్మీం ఆనయ ఆనయ స్వాహా -
108 సార్లు కుంకుమార్చన - జపము - హోమము చేసేది.



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ ధాన్యలక్ష్మి అష్టోత్తర శతనామావళి

ఓం శ్రీదేవ్యై నమః
ఓం శ్రితమందారాయై నమః
ఓం భూరూపాయై నమః
ఓం భుక్తిదాయిన్యై నమః
ఓం నీవారశూకవత్త న్వ్యై నమః
ఓం నిఖిల సస్య స్వరూపిణ్యై నమః
ఓం అన్నరూపాయై నమః
ఓం పరమేశ్యై నమః
ఓం పరబ్రహ్మ స్వరూపిణ్యై నమః
ఓం పద్మే పద్మాసనస్థాయై నమః 10
ఓం అష్టబాహు సుశోభితాయై నమః
ఓం హరితాంబరధారిణ్యై నమః
ఓం వదనస్మిత చంద్రికాయై నమః
ఓం దిగ్వస్త్రాయై నమః
ఓం సువస్త్రాయై నమః
ఓం కన్యకాయై నమః
ఓం కాశ్యపోద్భవాయై నమః
ఓం శ్రియై నమః
ఓం సౌమ్యాయై నమః
ఓం లక్షణాతీతాయై నమః 20
ఓం దుర్గాసూత్రప్రభోధికాయై
ఓం ప్రాణసూత్రాయై నమః
ఓం శ్రద్ధాయై నమః
ఓం మేధాయై నమః
ఓం కృత్యై నమః
ఓం ప్రజ్ఞాయై నమః
ఓం ధారణాయై నమః
ఓం కాంత్యై నమః
ఓం శ్రుత్యై నమః
ఓం స్మృత్యై నమః 30
ఓం ధృత్యై నమః
ఓం ధన్యాయై నమః
ఓం భూతేష్ట్యై నమః
ఓం మనీషిణ్యై నమః
ఓం అవస్థాత్రయనిర్ముక్తాయై నమః
ఓం గుణత్రయనిరుక్తాయ నమః
ఓం ఈషణత్రయనిర్ముక్తాయ నమః
ఓం సర్వరోగవివర్జితాయై నమః
ఓం శ్రీకాయాయై నమః
ఓం శ్రీకళాయై నమః 40
ఓం శుభ్రాయై నమః
ఓం కర్మనిర్మూలకారిణ్యై నమః

ఓం ధాన్యలక్ష్మీ నమః
ఓం గుణాధారాయై నమః
ఓం పంచబ్రహ్మాత్మికాయై నమః
ఓం పరాయై నమః
ఓం అష్టప్రకృత్యై నమః
ఓం అష్టావిభ్రాజద్వికృతాకృత్యై నమః
ఓం దుర్భిక్షధ్వంసిన్యై నమః
ఓం సీతాయై నమః 50
ఓం సత్యాయై నమః
ఓం రుక్మిణ్యై నమః
ఓం జాలంధర్యై నమః
ఓం మృడాన్యై నమః
ఓం భవాన్యై నమః
ఓం భవభంజన్యై నమః
ఓం త్రైకాలికాయై నమః
ఓం జ్ఞానతంతవ్యై నమః
ఓం త్రికాలజ్ఞానదాయిన్యై నమః
ఓం మధుజిహ్వాయై నమః 60
ఓం మధుమత్యై నమః
ఓం మధుమాసోదయాయై నమః
ఓం మధ్వ్యై నమః
ఓం మాధవీయై నమః
ఓం మహాభాగాయై నమః
ఓం మేఘగంభీరనిస్వనాయై నమః
ఓం సామగాన సమారాధాయై నమః
ఓం శ్రోతృకర్ణరసాయనాయైనమః
ఓం జీవలోకైక జీవాత్మనే నమః
ఓం భద్ర్యై నమః 70
ఓం ఉదారవిలోకనాయై నమః
ఓం తటిత్కోటిలసత్కాంత్యై నమః
ఓం తరుణ్యై నమః
ఓం హరిసుందర్యై నమః
ఓం మీననేత్రాయై నమః
ఓం ఇందిరాక్ష్యై నమః
ఓం విశాలాక్ష్యై నమః
ఓం సుమంగళాయై నమః
ఓం సర్వమంగళ సంపన్నాయై నమః
ఓం సాక్షాన్మంగళ దేవతాయైనమః80
ఓం దేహహృద్దీపికాయై నమః
ఓం దీప్త్యై నమః
ఓం జిహ్వాపాపప్రణాశిన్యై నమః
ఓం నిత్యాయై నమః
ఓం తఖ్యాయై నమః
ఓం రమాయై నమః
ఓం రామాయై నమః
ఓం రమణ్యై నమః
ఓం మృత్యుభంజన్యై నమః
ఓం జ్యేష్ఠాయై నమః 90
ఓం కాష్ఠాయై నమః
ఓం ధనిష్ఠాంతయై నమః
ఓం శరాంగ్యై నమః
ఓం నిర్గుణప్రియాయై నమః
ఓం మైత్రేయాయై నమః
ఓం మిత్రవిందాయై నమః
ఓం సర్వరూపిణ్యై నమః
ఓం జగదుత్పత్తి సంస్థాన సంహారాయై నమః
ఓం త్రయకారణ్యై నమః
ఓం అంబాయై నమః 100
ఓం విష్ణుసర్వస్వాయై నమః
ఓం మహేశ్వర్యై నమః
ఓం సర్వలోకానాంజనన్యై నమః
ఓం పుర్వాముక్త్యై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం మహాలక్ష్మ్యై నమః
ఓం పశుప్రాణాయై నమః
ఓం పరమాన్నాయై నమః 108

## 6. శ్రీ ధైర్యలక్ష్మీ దేవి వైభవము

### శ్రీధైర్యలక్ష్మీదేవి ప్రశస్తి

**జయజయవర్షిణి వైష్టవి భార్గవి మంత్ర స్వరూపిణి మంత్రమయే**
**సురగణపూజిత శీఘ్ర ఫలప్రద జ్ఞాన వికాసిని శాస్త్రనుతే**
**భవభయహారిణి పాపవిమోచని సాధుజనాశ్రిత పాదయుతే**
**జయ జయహే మధుసూదన కామిని ధైర్యలక్ష్మీ పరిపాలయమాం**

లోక కళ్యాణార్థం ఆ త్రైలోక్య కుటుంబిని శ్రీమన్మహా లక్ష్మీదేవి ధరించిన అష్టలక్ష్మీ దేవతా రూపాలలో మూడవది శ్రీధైర్యలక్ష్మీదేవి అవతారం. ఆదిలక్ష్మి రూపంలో ప్రాణశక్తిని అందించి, ధాన్యలక్ష్మి రూపంలో శరీర ధారుఢ్యానికి, మానసిక ఆరోగ్యానికి అవసరమైన ఆహారాన్ని అందించిన ఆ తల్లి, తన బిడ్డలు పెద్దవాళ్ళయ్యారు కదా అని వారిని వదలి వేయదు. తన పిల్లలకి సరైన వ్యక్తిత్వం, వారి జన్మకు సార్థకత వచ్చే వరకు వారిని వెన్నంటే వుంటుంది. ఏది సాధించాలన్నా ముందుగా కావలసినది ధైర్యం. వీరత్వం అనేది ధైర్యంలోని ఒక భాగమే. ధైర్యలక్ష్మీదేవి మనకి కావలసిన ధైర్యశక్తిని వీరత్వాన్ని అందిస్తూ వీరలక్ష్మిగాను, పౌరుష లక్ష్మిగాను కూడా ప్రస్తుతించబడుతోంది.

**ధైర్యం యొక్క ఆవశ్యకత :** ధైర్య గుణం అవసరాన్ని గురించి విశేషించి చెప్పవలసిన అవసరం లేదు. ధైర్య విహీనమైన జన్మ నిరర్థకమయింది. ఎంతటి బలశాలికి అయినా ధైర్యమే గనక లేకపోతే అతని శక్తి సామర్థ్యాలు అతనికి గాని, అతని ద్వారా సమాజానికి గాని ఏ విధంగానూ ఉపయోగపడవు. పోరాడి గెలవగలను అనే ఆత్మవిశ్వాసం, తదనుగుణంగా వీరత్వం వున్నపుడే ఎంతటి బలశాలికయినా, ధీశాలికయినా గుర్తింపు రాణింపు కలుగుతాయి. మనందరికీ ధైర్యగుణం మన మొదటి గురువైన మాతృమూర్తి (అమ్మ) ద్వారానే అలవడుతుంది. తన శిశువుని గర్భంలో తొమ్మిదిమాసాలపాటు మోసే సందర్భంలో, తల్లి ఎన్నో రకాల శారీరక మానసిక వత్తిడులకు గురవుతుంది. అయినా అవన్నీ సహిస్తుంది. చివరికి తొమ్మిది నెలలు పూర్తయి తనబిడ్డని ఈ బహిః ప్రపంచంలోకి తీసుకురావలసిన సమయం వచ్చినపుడు ఎంతో భయంకరమైన పురిటి నొప్పులను కూడా ఆ తల్లి భరిస్తుంది. కాన్పు అంటే రెండవ జన్మ అని అంటారు ఎంతటి ప్రసవ వేదననైనా ఆ తల్లి తనకు పుట్టబోయే చిన్నారి బిడ్డ కోసంధైర్యంగా అనుభవిస్తుంది. అలా చేయటం ద్వారా యింకా భూమి మీద పడని తన చిన్నారికి నాయనా! ఈ విధంగా జీవితంలో రాబోయే విపత్కర పరిస్థితులను ధైర్యంతో ఎదుర్కొని విజయం సాధించాలి సుమా! అని తన చేతల ద్వారా తెలియజేస్తుంది. అలాగే బిడ్డ పుట్టినది మొదలు ఆ బిడ్డ ఏ చిన్న విషయానికి భయపడినా గుండెలకి హత్తుకొని, వెన్నుదట్టి ధైర్యాన్ని నూరిపోసి ముందుకు నడిపించేది కూడా మన మాతృమూర్తే. ఆ లోకమాత లక్ష్మీదేవి మన అమ్మరూపంలో ఈ విధంగా ధైర్యలక్ష్మిగా మనకి ధైర్యాన్ని అందిస్తోందన్నమాట.



శ్లో॥ అపురూపా అఘోరాత్మా అఖిలాండ జిగీషితా
ప్రాణరూపా పరాదేవీ పరబ్రహ్మ స్వరూపిణీ
రక్తాంబరా రక్తనేత్రా తిరస్కృత సౌరతేజసా
శరణాగత వరదాయాచ ధైర్యలక్ష్మీనమామ్యహం

ఎంతటి ప్రజ్ఞావంతులకయినా, జీవితంలో ఏదో ఒక సమయంలో "ధైర్యం కోల్పోయి ఏం చేయాలో తోచని పరిస్థితి" రావటం అనేది సహజం. అటువంటి "కింకర్తవ్యతావిమూఢ" పరిస్థితులలో మనకి ధైర్యం చెప్పి ముందుకు నడిపించేది సాధారణంగా తల్లి గాని, కొన్ని సందర్భాలలో భార్యకాని అవటం సహజం. ధైర్యలక్ష్మీ దేవి తన అంశని ఈ విధంగా ఆయా స్త్రీ రూపాలలో ప్రవేశపెట్టి అనుగ్రహిస్తోందన్న మాట.

మంచి పనులు చేయాలని చాలా మందే అనుకుంటారు. కాని ఆ పనులను సాధించగలిగేది మాత్రం కొంత మందే. ఎవరి మీదనయితే ధైర్యలక్ష్మీ దేవి కటాక్షం వుంటుందో వారే ఆ పనులను సాధించగలరు. వారికి మాత్రమే ఆ సాహసం తెగువ, సమయస్ఫూర్తి, ఆలోచన కలుగుతాయి.

ఛత్రపతి శివాజీ మహారాష్ట్రలోని ఒక చిన్న సంస్థానంలో సామంతరాజు వద్ద మంత్రిగా పనిచేసే వ్యక్తి కుమారుడు. భవానీ దేవి భక్తుడైన బాల శివాజీకి తల్లి జిజియాబాయి ధైర్యసాహసాలను ఉగ్గుపాలతో రంగరించి పోసింది. ఆ శ్రీమన్మహాలక్ష్మీదేవి భవానీ మాత రూపంలో శివాజీని అనుగ్రహించింది. అందువల్లనే శివాజీకి విశేషమైన ధైర్యసాహసాలు అలవడ్డాయి. స్వశక్తితో చిన్న రాజ్యాన్ని స్థాపించుకుని ఆ తర్వాత ఆ రాజ్యాన్ని కొంచెం కొంచెంగా విస్తరిస్తూ ఆఖరికి అఖండ భారత దేశానికి అధిపతి అయిన మొగల్ పాదుషా ఔరంగజేబును కూడా భయపడే స్థాయికి తీసుకొని వచ్చాడు శివాజీ. చివరికి శివాజీ అంటే వున్న భయం వల్ల ఔరంగజేబు తన రాజధానిని ఢిల్లీ నుంచి ఔరంగాబాదుకి మార్చటం కూడా జరిగింది. యీ విధమైన శక్తి సామర్థ్యాలు శివాజీకి ఆ తల్లి అనుగ్రహం వల్లనే లభించడం జరిగింది.

పిరికివాళ్ళు రెండు రకాలు. పోరాడి గెలవ గలిగిన సామర్థ్యం వుండీ కూడా ధైర్యం లేని కారణంగా తమ సామర్థ్యం తెలుసుకోలేని పిరికివాళ్ళు ఒక రకం అయితే, రెండవ రకం వారికి నిజంగానే వీరత్వం లోపించి శక్తి సామర్థ్యాలు లేక, పిరికివాళ్ళుగా ఉండిపోతారు. ఈ రెండు రకాల పిరికివాళ్ళకీ కూడా ధైర్యలక్ష్మీదేవి అనుగ్రహం కనుక కలిగితే, వారే అనేక విజయాలని సాధించి కీర్తిని పొందుతారు. ఆ తల్లి అనుగ్రహం వల్ల వీరికి ధైర్యం చెప్పగలిగే వాళ్ళ సహాయంలభిస్తే, వారంతటి ఘనులు మరెవరూ వుండరు.



శ్రీ ధైర్యలక్ష్మీదేవి మాహాత్మ్యము – వీర శివాజీ

పిరికివాడు అనగానే మనకి మహా భారతంలోని విరాట పర్వంలోని ఉత్తర కుమారుడు గుర్తుకి వస్తాడు. ఉత్తర ప్రగల్భాలు అనేది లోకవిదితమైన సామెత కదా! రాచనగరులో ఆడవారి ఎదుట అన్ని రకాల ప్రగల్భాలు పలికి సైరంధ్రి బలవంతం వల్ల బృహన్నలని సారధిగా అంగీకరించి యుద్ధరంగానికి వచ్చిన ఉత్తరుడు సువిశాల కౌరవసేనని చూసీ చూడటంతోనే భయపడి వణికిపోయి పలాయనం చిత్తగించటం చూసి మనందరం పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకుంటాం. ఎందుకు? యిలా పిరికివాడిలా పారిపోయాడని. కాని కాస్త స్థిమితంగా ఆలోచిస్తే, నిజజీవితంలో మనందరం కూడా ఏదో ఒకదశలో, ఈ విధమైన పిరికిదనం ఆవహించి ఏం చేయాలో తోచని పరిస్థితిలో వున్న వాళ్ళమే కదా! అనే విషయం గుర్తుకు వస్తుంది. అప్పుడు మనకు నవ్వు బదులు జాలి కలుగుతుంది. మనకి అవసరమయిన సమయంలో ఎవరో ఒకరు ధైర్యం చెప్పటం వల్లనే మన జీవితం సాఫీగా సాగుతోంది. ఉత్తరుడుకి బృహన్నల వేషంలో వున్న అర్జునుడు ధైర్యం చెప్పి అతని చేత రథసారధ్యం చేయిస్తాడు. ఆ విధంగా అర్జునుడి ధైర్య వచనాలు వల్ల వీరుడిగా మారిన ఉత్తరుడు ఎంతో పరిశ్రమ చేసి కురుక్షేత్ర యుద్ధం నాటికి మహా యోధుడుగా తయారయి ఆ ఘోర సంగ్రామంలో వీరోచితంగా యుద్ధం చేసి వీరస్వర్గం అలంకరిస్తాడు. ఇంతటి ప్రభావవంతమైనవి ధైర్యవచనాలు. అత్యవసర పరిస్థితిలో ధైర్యం చెప్పిన వాడే భగవంతుడిగా కన్పిస్తాడనేది మనందరికీ అనుభవైక వేద్యమే.



## గృహలక్ష్మే ధైర్యలక్ష్మి

ఇంట్లో పిల్లలుగాని, బంధువులుకాని, యింటి యజమాని కాని వారి వారి పనులను చక్కబెట్టుకునేందుకు ఎన్నో ప్రయత్నాలు చేసినా నెరవేరక నిరాశతో వున్నపుడు వారికి ధైర్యం చెప్పి ముందుకు నడిపించేది ఆ యింటి యిల్లాలు, గృహలక్ష్మే. ధైర్యం కనకవుంటే సాధించలేనిది అంటూ ఏమీలేదు. కార్యసాధనకి ధైర్యలక్ష్మీదేవి అనుగ్రహం ఎంతోముఖ్యం. మీ పిల్లలుకాని, మీ వారుగాని ఎన్ని యింటర్వ్యూలకి వెళ్ళినా విజయం సాధించలేక దిగాలు పడివున్నారా? అయితే మీరు 21 రోజులపాటు శ్రీధైర్యలక్ష్మీదేవిని ఆరాధించండి. ప్రతినిత్యం "ఓం ఐం శ్రీం సౌః శ్రీం హ్రీం" అనే మంత్రాన్ని 108 సార్లు పారాయణ చేయండి. ఆతల్లినే నమ్ముకోండి. మీ సమస్యలన్నీ తీరి మంచి ఫలితాలు వస్తాయి.

## శ్రీ ధైర్యలక్ష్మీదేవి స్వరూప ప్రభావాలు

అష్టభుజమూర్తి అయిన శ్రీ ధైర్యలక్ష్మీమాత రక్తాంబర ధారిణి అంటే ఎర్రని వస్త్రాలను కట్టుకుని వుంటుంది. ఎరుపు రంగు వీరత్వానికీ, ధైర్యసాహసాలకీ సంకేతం. ఆ తల్లి తన చేతులలో శంఖుచక్రాలు, ఖడ్గం, ధనుర్బాణాలు ధరించి ధైర్యాన్ని అందించే శక్తి రూపిణిగా దర్శనం యిస్తుంది. రెండు చేతులతో వరదముద్రలో భక్తులను అనుగ్రహిస్తూ వుంటుంది. అంతర్బలానికి అధిష్టాన దేవత ధైర్యలక్ష్మీదేవి. అంతర్బలం అంటే మానసిక శక్తి. మానసిక ధైర్యం లేకుండా మనం ఏ పనీ సాధించలేము. అందువల్లనే 'ఓం అంతర్బలాయై నమః" అని ఈ తల్లిని స్తుతిస్తూ వుంటాము. వీరలక్ష్మిగా కూడా కొలిచే ధైర్యలక్ష్మీదేవిని భద్రకాళిగా, చక్రధారిణిగా, యుద్ధ స్వరూపిణిగా కీర్తించటం పరిపాటి. కేవలం ధైర్యాన్ని అందించటమే గాక ఆ ధైర్యం వల్ల మనము చేసే పనులన్నీ సక్రమంగా నెరవేరేలా చేస్తుంది ఆ తల్లి. అంతేకాదు మనము సాధించిన విజయాల వల్ల మనకి శాశ్వత మైన కీర్తి ప్రతిష్టలు వచ్చేలా చేస్తుంది. విజయానంతరం కూడా మనకి అండగా నిలిచి ఖ్యాతిని సంపాదించి పెట్టే ఈ తల్లిని ఖ్యాతిజాయగా వినుతిస్తారు.



## శ్రీ ధైర్యలక్ష్మీదేవి మాహాత్మ్యం

ధైర్యలక్ష్మీమాత ఆగ్రహ, అనుగ్రహ ప్రభావాలు, సులువుగా అర్థం చేసుకోవ డానికి వీలుగా ఆ మాత ప్రభావం గురించి ఒక కథ మన పురాణేతి హాసాలలో చెప్పబడింది. పూర్వకాలంలో సురథుడనే ఒక మహారాజు వుండేవాడు. అతడు అమిత బలశాలి, ధర్మవర్తనుడు. శ్రీమన్మహాలక్ష్మీదేవి పరమభక్తుడు. ఆ సురథుడు అనేక రాజ్యాలను జయించి సువిశాల సామ్రాజ్యం స్థాపించాడు. తన సామ్రాజ్యంలోని ప్రజలను కన్న బిడ్డలవలె చూసుకునేవాడు. ఎప్పుడయితే మనిషి ఉన్నత స్థాయికి చేరుకుంటాడో అతనిని పొగడటానికి అనేకమంది పోటా పోటీలుగా అతని చెంత చేరతారు. అదే విధంగా అందరూ సురథునిచుట్టూ చేరి నువ్వు యింత గొప్పవాడివి అంత మంచి వాడివి అని పొగుడుతూ వుండటంతో కొన్నాళ్ళకి ఆ రాజుకి అహంకారం తలకెక్కింది. సాధించిన విజయాలన్నీ తన శక్తి సామర్థ్యాల వల్లనే సాధ్యం అయినాయని అనుకొని ఆ జగదంబ కటాక్షాన్ని విస్మరించాడు. ఏ క్షణంలో అయితే అహంకారం తలకెక్కి జగన్మాతని అలక్ష్యం చేయటం మొదలు పెట్టాడో ఆ క్షణమే ఆ రాజుపై ధైర్యలక్ష్మీదేవి ఆగ్రహించి అతనిని వదలి వెళ్ళిపోయింది. అహంకారంతో కళ్ళు మూసుకుపోయిన రాజుకి ఆ విషయం కూడా తెలియలేదు. సురథుడు పరిపాలించే రాజ్యంలోని చిన్న సామంతరాజు ధీమంతుడు. అతడు దేవీభక్తుడు. ప్రత్యేకంగా ధైర్యలక్ష్మిని ఆరాధించేవాడు. సురథుని అహంకారధోరణి విన్న ధీమంతుడు చుట్టు ప్రక్కల నున్న చిన్న చిన్న రాజుల సహకారంతో రెండు



వేల సైన్యాన్ని ప్రోగు చేసి సురథుని ఎదిరించటానికి సిద్ధపడ్డాడు. 10 వేలకి పైగా సేనగల సురథుడు గర్వంతో తన సేనని నడిపించాడు. కాని ధీమంతుని సైన్యంలోని ఒక్కొక్కడు పది మంది సురథుడి సైనికులని ఎదిరించి మట్టి కరిపించారు. ఒక్క రోజులోనే సురథుడికి భారీ నష్టం వాటిల్లింది. తన సైన్యం యిలా ఓడిపోవడం చూసిన రాజు ధైర్యం కోల్పోయి మానసికంగా కృంగిపోయాడు. ధైర్యలక్ష్మి అనుగ్రహం లేదు కదా! యింకా చాలా సైన్యమే మిగిలి వుంది. జాగ్రత్తగా యుద్ధం చేస్తే గెలవగలడు. అయినా కాని ధైర్యం లేని కారణంగా, సురథుడు యుద్ధభూమి నుండి భార్యాబిడ్డలతో సహా అడవికి పారిపోయి, సుమేధుడనే ఋషి ఆశ్రమంలో తలదాచుకున్నాడు. అమేయ బలపరాక్రమశాలి అయిన తన భర్త ఈ విధంగా ఎందుకు పిరికివాడిలా పారిపోయాడో ఆ రాజుగారి భార్యకి అర్థం కాలేదు. ఎన్నో విధాల అడిగి చూసింది. కాని రాజు ఏ కారణం చెప్పలేదు. చివరికి ప్రయోజనం లేక సుమేధ ఋషిని ఆశ్రయించి రాణిగారు తన భర్త అధైర్యానికి కారణం అడిగింది. ఆ ఋషి దివ్యదృష్టితో జరిగిన విషయాన్ని గ్రహించి ధైర్యలక్ష్మీదేవి ఆగ్రహించటం వల్ల యిలా జరిగిందని చెప్పి, రాజుని రావించి మూడు మాసాలపాటు నిష్టగా ప్రతి నిత్యం షోడశోపచారములతో, అష్టోత్తర శతనామాలతో ధైర్యలక్ష్మి దేవిని అర్చించమని చెప్పటం జరిగింది. ఋషి చెప్పినట్లుగానే సుమేధుడు భక్తి శ్రద్ధలతో ధైర్యలక్ష్మీదేవిని పూజించి ఆ తల్లి అనుగ్రహాన్ని తిరిగి పొందగలిగాడు. అడవిలోని ఆటవిక వీరుల సహాయంతో ఒకచిన్న సేనను సమకూర్చుకొని ధీమంతుని ఎదుర్కొనే ప్రయత్నం చేయటం మొదలు పెట్టాడు. ఆనాటి రాత్రి ధైర్యలక్ష్మి దేవి ధీమంతునికి కలలో కనిపించి, సురథునిలో మంచి మార్పు వచ్చింది కాబట్టి అతని రాజ్యం అతనికి యిచ్చివేయవలసిందిగా ఆజ్ఞాపించింది. అదే విధంగా సురథునికి కూడా కలలో కనిపించి ధీమంతుడు కూడా నా భక్తుడే, మీరు ఇరువురూ కలహించుకోకండి. అతను ఇచ్చిన రాజ్యాన్ని స్వీకరించు అని చెప్పింది. రాజులిద్దరూ ఉదయాన్నే కల్సుకుని మాత ఆదేశాన్ని చర్చించుకున్నారు. కాని క్షత్రియుడైన సురథుడు తన రాజ్యాన్ని దానంగా తీసుకోవడానికి యిష్టపడక, అందుకు ప్రత్యుపకృతిగా తన ఏకైక బిడ్డ అయిన తన కూతురు లావణ్యవతిని ధీమంతునికి ఇచ్చి వివాహం జరిపించాడు. ఈ విధంగా ప్రబల ప్రత్యర్థులైన ఆ రాజులిద్దరూ ఆ తల్లి అనుగ్రహం వల్ల దగ్గర బంధువులై ఎవరి రాజ్యం వారు ఏలుకోసాగారు. ధైర్యలక్ష్మి కృప ఎంతటి అద్భుతాలను చేస్తుందో ఈ కథ తెలియజేస్తుంది.

**ధైర్యలక్ష్మి నోము** : కుటుంబంలో భర్తగాని, పిల్లలు గాని, తల పెట్టిన కార్యాలు కలిసి రాక కుటుంబ సభ్యులు ధైర్యం కోల్పోయినపుడు, ఆయా కార్యాలు నిర్విఘ్నంగా జరగటం కోసం ఆ యింటి యిల్లాలు చేయవలసిన నోము ధైర్యలక్ష్మి నోముగా చెప్పబడింది. ఒక ఏడాది పాటు ప్రతిరోజూ శుచిగా ధైర్యలక్ష్మీదేవిని అర్చించి ప్రతిరోజూ జువ్వి చెట్టుకు ప్రదక్షిణం చేయాలి. సదా మనస్సులో ఆ

ధైర్యలక్ష్మిని ధ్యానిస్తూ తన వారు తలపెట్టిన పనులు నిర్విఘ్నంగా జరగాలని కోరుకుంటే ఆ మాత అనుగ్రహం తప్పకుండా లభించి సకల కార్యసిద్ధి కలుగుతుంది.

ధైర్యలక్ష్మీదేవిని షోడశోపచారములతో అష్టోత్తర శతనామాలతో అర్చించాలి. నిత్యపూజలు చేసుకునే వీలులేని వారు ఈ క్రింది బీజాక్షరాలు రోజుకి 123 మారులు జపిస్తే ఆ మాత పరిపూర్ణ అనుగ్రహం లభిస్తుంది.

"ఓం ఐం శ్రీం సౌః శ్రీం హ్రీం"

ఆ ధైర్యలక్ష్మీదేవి అనుగ్రహం వల్ల భక్తులెల్లరు తాము తలపెట్టిన అన్ని కార్యాలలోను విజయాన్ని సాధించెదరు గాక!

## శ్రీ ధైర్యలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం

శ్రీవల్లీ శ్రితమందారా శ్రీమత్ శాంత స్వరూపిణీ
శ్రీ ప్రదా శివావాణీ సర్వధృత్ నమోస్తుతే ॥ 1

వాగ్దేవీ మహారాత్రీ కాళరాత్రి త్రిలోచనా
భద్రకాళీ కరాళీచ మహాకాళీ తిలోత్తమా ॥ 2

కాళీకరాళ వక్త్రాంతా కామాక్షీ కామదా శుభా
చండికా చండరూపేశీ చాముండా చక్రధారిణీ ॥ 3

త్రైలోక్య జననీ దేవీ త్రైలోక్య విజయోత్తమా
సిద్ధ లక్ష్మిః క్రియాలక్ష్మిః మోక్ష లక్ష్మీ ప్రసాదినీకాః ॥ 4

యుద్ధ మధ్య స్థితాదేవీ సర్వభూత ప్రభంజనీ
ఆయుద్ధా యుద్ధరూపాచ శాంతా శాంతిస్వరూపిణీ ॥ 5

స్తంభినీ క్షోభినీ మారీ భ్రామణీ శతృమారిణీ
మోహినీ ద్వేషిణీ వీరా అఘోరా రుద్రరూపిణీ ॥ 6

రుద్రైకాదశీ పుణ్యా కల్యాణీ లాభకారిణీ
దేవ దుర్గా మహాదుర్భాతా స్వప్నదుర్గా అష్టభైరవీ ॥ 7

స్వామినీ వేదినీ శక్త్యా శాంబరీ చక్రధారిణీ
దండినీ ముండినీ వ్యాఘ్రా శిఖినీ సోమ సంహతా॥ 8

చింతామణీ చిదానందా పంచబాణ ప్రభోదినీ
బాణ శ్రేణీ సహస్రాక్షీ సహస్రభుజ పాదుకా ॥ 9

నారసింహీ మహోగ్రాసా భక్తానామార్తి నాశినీ
అంతర్బలా స్థిరాలక్ష్మీ జరామరణ నాశినీ ॥ 10



ఖ్యాతిజా భార్గవీ దేవీ దేవయోనీ తపస్వినీ
శాకంబరీ మహాశోణా గరుడో పరిసంస్థితా ॥ 11

సింహగా వ్యాఘ్రగాదేవీ వాయుగా సుహాద్రిగా
అకారాది క్షకారాంతా సర్వవిద్యాధి దేవతా ॥ 12

వైనాయకీ వరారోహా శ్రోణివేలా బహిర్వశీ
జంభినీ జృంభిణీ దేవీ జంభకారిణి నమో నమః ॥ 13

ఏకవీరా విశేషాఖ్యా షష్ఠీదేవీ మనస్వినీ
కపాలినీ మహాదంష్ట్రా భృకుటీ కుటిలాననా ॥ 14

మహా ఘోషా ధైర్యలక్ష్మీ ఖడ్గచర్మధరాశనీ
ఏవం శ్రీ ధైర్యలక్ష్మీ నామ్నాం అష్టోత్తర శృతం ॥ 15

ఓం శ్శాంతి శ్శాంతి శాంతిః



## లక్ష్మీమాతకి ఆయుధాలెందుకు?

లక్ష్మీదేవి ధరించిన అష్టలక్ష్మి రూపాలలో ఆ తల్లి శంఖం, చక్రం, కత్తి, డాలు, ధనుర్బాణాలు, గదా ధరించినట్లుగా కన్పిస్తుంది. జగన్మాత, తన పిల్లల అభివృద్ధిని కాంక్షించే తల్లి కదా మరి ఆయుధాలను ధరించటం ఎందుకు? అనే సందేహం వస్తుంది. ఆయుధధారణ అధికారానికి సంకేతం. ఆ తల్లి లక్ష్మీదేవికి మనల్ని కాపాడవలసిన బాధ్యత ఒకటే కాదు మనలని సరయిన మార్గంలో పెట్టే అధికారం కూడా వుంది. అధికారం లేకుండా బాధ్యత పరిపూర్ణం కాదు. అధర్మాన్ని నాశనం చేయటం ఆ తల్లి బాధ్యతలలో ఒక భాగం. ఆయుధాలని ధరించి సదా దుర్మార్గులని నాశనం చేయటానికి తయారుగా వుంటుంది. విష్ణుమూర్తి, పరమశివుడు, బ్రహ్మ అనేక సందర్భాలలో భక్తులయిన రాక్షసులని కూడా కరుణించి వరాలిచ్చారు. కాని జగన్మాత మాత్రం ఎన్నడూ రాక్షసులని, దుర్మార్గులని దరిజేరనీయలేదు. కుమారుడైన నరకాసురుని మీద కూడా విల్లు ఎక్కుపెట్టింది స్త్రీ మూర్తి. దుష్ట సంహారం ఒక్కటే ధ్యేయం. తన శక్తి ప్రతాపాలతో తన బిడ్డలమైన మనల్ని కంటికి రెప్పలా కాపాడుతూ వుంటుంది. అందుకే ఆయుధధారణిగా దర్శనం యిస్తుంది.

## లక్ష్మీదేవి అనుగ్రహం స్థిరం వుండాలంటే

ఆ జగన్మాత అనుగ్రహం మన మీద అనుక్షణం ఉండాలి అంటే ప్రతినిత్యం స్మరించుకోవలసిన ప్రార్థన

శ్లో ॥ త్రైలోక్య పూజితే దేవి కమలే విష్ణువల్లభే
యధాత్వం సుస్థిరా కృష్ణే తథా భవమయి స్థిరా"

శ్లో॥ "ఈశ్వరీ కమలా లక్ష్మీః చలాభూతిః హరిప్రియా
పద్మా పద్మాలయా సంపద్ రమాశ్రీః పద్మధారిణీ"॥

యిది ఆ తల్లి లక్ష్మీదేవి ద్వాదశనామ స్తోత్రం. ఇది చదువుకుంటే ఆ తల్లి ఎంతో సంతోషించి అనుగ్రహిస్తుంది.

## నిజ జీవితంలో ధైర్యం అవశ్యకత-ఒక సంఘటన

ఈ మధ్యకాలంలో వాస్తవంగా జరిగిన సంఘటన యిది. ఎంతో అభివృద్ధి చెందిన అమెరికా దేశంలో జరిగింది. చిన్నతనం నుండీ ఎంతో కష్టపడి పైకి వచ్చిన ఒక ధనవంతుడి కథ యిది. ఎన్నో రకాల వ్యాపారాలు చాలా చాకచక్యంతో నిర్వహించేడు. దాదాపు రెండువందల బిలియన్ల డాలర్ల ఆస్తికి అధిపతి అయ్యాడు. చాలా చిన్న వయస్సులోనే సంపాదించగలిగాడు. అమెరికా అధ్యక్షుని ప్రాపకం సంపాదించాడు. అంతా అద్భుతంగా వుంది, అనుకునేంతలో అనుకోకుండా అతనికి వ్యాపారంలో నష్టం వచ్చింది. దాదాపు సగం ఆస్తి నష్టపోయాడు. విజయాలే కాని అపజయం తెలియని అతను ఎంతో బాధపడ్డాడు. ఎవరికీ తెలియని సుదూర ప్రదేశానికి వెళ్ళి అక్కడ ఆత్మహత్య చేసుకున్నాడు. యింకా అతనికి మిగిలి వున్న ఆస్తి వల్ల అతను దేశంలోనే పెద్ద ధనవంతుడిగా లెక్క. మళ్ళీ ప్రయత్నం చేసి పోగొట్టుకున్నది సాధించవచ్చు. కాని యివేవీ అతనికి గుర్తుకి రాలేదు. ధైర్యం అనేది లేకపోతే యిటువంటి పరిణామాలే జరుగుతాయి. కష్టాలు సంప్రాప్తించినపుడు ధైర్యం చెప్పేవారు దొరకటం ఎంతో అదృష్టం. ధైర్య సాహసాలు వుంటే ఏదైనా సాధించవచ్చు. ఈ యదార్ధ సంఘటన ద్వారా మనకి ఎట్టి పరిస్థితులలోనూ మనం ధైర్యం కోల్పోకూడదు అనే విషయం అర్థమవుతుంది.



## నీరాజనం

క్షీరాబ్ధి కన్యకకు శ్రీమహాలక్ష్మికిని నీరజాలయకును నీరాజనం
జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు నెలకొన్న కప్పురపు నీరాజనం
అలవేణి తురుమునకు హస్తకమలంబులకు నిలువు మాణిక్యముల నీరాజనం
చరణకి సలయములకు నకియరంభోరులకు నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు అతివ నిజనాభికిని నిరతి నానావర్ణ నీరాజనం
పగటు శ్రీ వేంకటేశు పట్టపురాణియై నెగడు సతి కళలకును నీరాజనం
క్షీరాబ్ధికన్యకకును నీరాజనం, శ్రీమహాలక్ష్మికిని నీరాజనం నీరజాలయకును నీరాజనం॥

-అన్నమాచార్య.





## ధైర్య లక్ష్మీ యంత్రము

### మూల మంత్ర ధ్యాన శ్లోకము

ఓం నమో భగవతీ ధైర్యలక్ష్మీ ఐం శ్రీం సౌః
శ్రీం హ్రీం మమ వ్యాపారే గృహే ఉద్యోగే సర్వస్థలే
నిత్యం ధైర్యరూప ధనం ప్రాపయ ప్రాపయ.
ఆయురారోగ్య భోగ భాగ్యం దేహి దేహి స్వాహా.
**108** సార్లు కుంకుమార్చన - జపము - హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ ధైర్యలక్ష్మి అష్టోత్తర శతనామావళి

ఓం శ్రీవల్లీయై నమః
ఓం శ్రితమందారాయై నమః
ఓం శ్రీమత్యై నమః
ఓం శాంతరూపిణ్యై నమః
ఓం శ్రీ ప్రదాయై నమః
ఓం శివాయై నమః
ఓం వాణ్యై నమః
ఓం సర్వధృత్యై నమః
ఓం వాగ్దేవ్యై నమః
ఓం మహారాత్ర్యై నమః 10
ఓం కాళరాత్ర్యై నమః
ఓం తిలోచనాయై నమః
ఓం భద్రకాళ్యై నమః
ఓం కరాళ్యై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం తిలోత్తమాయై నమః
ఓం కాళ్యై నమః
ఓం కరాళవక్త్రాంతాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం కామదాయై నమః 20
ఓం శుభాయై నమః
ఓం చండికాయై నమః
ఓం చండరూపేశ్యై నమః
ఓం చాముండాయై నమః
ఓం చక్రధారిణ్యై నమః
ఓం త్రైలోకజనన్యై నమః
ఓం త్రైలోక్య విజయోత్తమాయై నమః
ఓం సిద్ధలక్ష్యై నమః
ఓం క్రియాలక్ష్యై నమః
ఓం మోక్షలక్ష్మ్యై నమః 30
ఓం ప్రసాదిన్యై నమః
ఓం యుద్ధమధ్యస్థితాదేవ్యై నమః
ఓం సర్వభూతప్రభంజన్యై నమః
ఓం అయుద్ధాయై నమః
ఓం యుద్ధరూపాయై నమః
ఓం శాంతాయై నమః
ఓం శాంతిస్వరూపిణ్యై నమః
ఓం స్తంభిన్యై నమః
ఓం క్షోభిణ్యై నమః
ఓం మారిణ్యై నమః 40
ఓం భ్రామిణ్యై నమః
ఓం శత్రుమారిణ్యై నమః



ఓం మోహిన్యై నమః
ఓం ద్వేషిణ్యై నమః
ఓం వీరాయై నమః
ఓం అఘోరాయై నమః
ఓం రుద్రరూపిణ్యై నమః
ఓం రుద్రైకాదశిన్యై నమః
ఓం పుణ్యాయై నమః
ఓం కళ్యాణ్యై నమః 50
ఓం లాభకారిణ్యై నమః
ఓం దేవదుర్గాయై నమః
ఓం మహాభూతాయై నమః
ఓం స్వప్న దుర్గాయై నమః
ఓం అష్టభైరవ్యై నమః
ఓం స్వామిన్యై నమః
ఓం వేదిన్యై నమః
ఓం శక్త్యాయై నమః
ఓం శాంబర్యై నమః
ఓం చక్రధారిణ్యై నమః 60
ఓం దండిన్యై నమః
ఓం ముండిన్యై నమః
ఓం వ్యాఘ్ర్యై నమః
ఓం శిఖిన్యై నమః
ఓం సోమసంహర్త్యై నమః
ఓం చింతామణ్యై నమః
ఓం చిదానందాయై నమః
ఓం పంచబాణప్రబోధిన్యై నమః
ఓం బాణశ్రేణ్యై నమః
ఓం సహస్రాక్ష్యై నమః 70
ఓం సహస్రభుజపాదుకాయై నమః
ఓం నారసింహాయై నమః
ఓం మహోగ్రాసాయై నమః
ఓం భక్తానామార్తి నాశిన్యై నమః
ఓం అంతర్బలాయై నమః
ఓం స్థిరాలక్ష్మ్యై నమః
ఓం జరామరణనాశిన్యై నమః
ఓం ఖ్యాతిజాయై నమః
ఓం భార్గవై నమః
ఓం దేవ్యై నమః 80
ఓం దేవయోనయే నమః
ఓం తపస్విన్యై నమః
ఓం శాకంబర్యై నమః
ఓం మహాశోణాయై నమః
ఓం గరుడోపరి సంస్థితాయై నమః
ఓం సింహగాయై నమః
ఓం వ్యాఘ్రగాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం వాయుగాయై నమః
ఓం సుహాద్రిగాయై నమః 90
ఓం అకారాదిక్షకారాంతాయై నమః
ఓం సర్వవిద్యాధిదేవతాయై నమః
ఓం వైనాయక్యై నమః
ఓం వరరోహాయై నమః
ఓం శ్రోణివేలాయై నమః
ఓం బహిర్వశ్యై నమః
ఓం జంబిన్యై నమః
ఓం జృంభిణ్యై నమః
ఓం జంభకారిణ్యై నమః
ఓం ఏకవీరాయై నమః 100
ఓం విశేషాయై నమః
ఓం షష్ఠీ దేవ్యై నమః
ఓం మనస్విన్యై నమః
ఓం కపాలిన్యై నమః
ఓం మహాదంష్ట్రాయై
ఓం భ్రుకుటీకుటిలాననాయై నమః
ఓం మహాఘోషాయై
ఓం ఖడ్గచర్మధరాయై నమః
ఓం అశన్యై నమః

## 7. శ్రీ గజలక్ష్మి దేవి వైభవము

### సర్వ శుభకారిణి శ్రీ గజలక్ష్మీమాత

**శ్లో ॥ జయజయ దుర్గతి నాశిని కామిని సర్వ ఫలప్రద శాస్త్రమయే**
**రథ గజ తురగ పదాతి సమావృత పరిజన మండిత లోకనుతే**
**హరిహర బ్రహ్మ సుపూజిత సేవిత తాపనివారిణి పాదయుతే**
**జయ జయహే మధుసూదన కామిని గజలక్ష్మి పరిపాలయమాం.**

ధర్మసంవర్ధని, దుఃఖ వినాశని అయిన ఆ శ్రీమన్మహాలక్ష్మీదేవి విభవ విశేషాలలో చెప్పుకోదగ్గ ముఖ్యమైన అవతారం శ్రీ గజలక్ష్మీమాత. ఈ గజలక్ష్మి దేవి అనుగ్రహం వల్ల మనకి సర్వశుభాలు కలుగుతాయి. లక్ష్మీదేవి అష్టవిధ కళలలో నాలుగవ చిత్‌స్వరూపంగా శ్రీ గజలక్ష్మీదేవి వినుతికెక్కింది.

ఆదిలక్ష్మిగా ప్రాణశక్తిని, ధాన్యలక్ష్మిగా బలాన్ని, ధైర్యలక్ష్మిగా ధైర్యాన్ని వీరత్వాన్ని యిచ్చిన ఆ జగన్మాత అంతటితో తన బాధ్యత తీరిపోయింది అని అనుకోలేదు. మనం చేసే ప్రయత్నాలు అన్నీ ఫలించి అన్ని విధాలా మనకి సమస్త శుభాలు చేకూరే విధంగా అనుగ్రహించటం కోసం గజలక్ష్మి అవతారం దాల్చింది. శ్రీ గజలక్ష్మీమాతను భక్తి శ్రద్ధలతో కొలిచే వారికి ఏలోటూ రాదు.

శుభం అంటే ఏమిటి?

శుభం అంటే మంచిది అని అందరికీ తెలుసు. కాని ఈ మంచి ఎవరికి? ఎవరికోసం? అనే విషయం అర్థం చేసుకోవటంలోనే దేవ రహస్యం వుంది. రాక్షసులలో అనేకమంది ఘోరతపస్సు చేసారు. ఫలితంగా అమోఘమైన వరాలు పొందారు. త్రిలోక సామ్రాజ్యాధిపత్యం సాధించారు. అవి కూడ విజయాలే. కాని వారి విజయాల వల్ల మంచి వారికి, లోకశాంతికి ఆపద వాటిల్లింది. లోకాలలో ధర్మం నశించి అధర్మం ప్రవర్థిల్లింది. ఇవి అశుభకరమైన విజయాలు. అలా కాకుండా మనం సాధించే విజయాలు లోకహిత, సమాజ హితకారిణులుగా వుండాలి. ఎదుటి వారిని బాధపెట్టేదిగా వుండకూడదు మన విజయం. ఈ విధమైన శుభకరమైన విజయాలని అందరికీ అందించేది గజలక్ష్మీమాత. అందరి బాగుకోరే ఆ తల్లి ఎవరూ బాధపడటాన్ని సహించలేదు.

## గజలక్ష్మీ దేవీ రూప విశేషాలు

గజం అనగా ఏనుగు. భారాన్ని మోసే శక్తికి సంకేతం గజం. దిగ్గజాలు ఈ భూభారాన్ని మోస్తున్నాయని అంటారు. ఏనుగులు రాచరికానికి అధికారానికి కూడా ప్రతీకలు. గజరాజులచే సదా సేవించబడుతూ వుండే గజలక్ష్మీమాత ఈ జగత్తు బరువు బాధ్యతలన్నీ మోసే చల్లని తల్లి. బాధ్యత గలవారికే అధికారం ఉంటుంది అంటారు. అందువల్లనే గజరాజులతో సేవలు అందుకుంటూ ఆ తల్లి సర్వప్రాణుల



భవితవ్యాన్ని తీర్చిదిద్దే అధికారం కలిగిన చల్లని తల్లిగా ప్రసిద్ధికెక్కింది. ఈ తల్లి మహాసాగర మధ్యంలో, మహాపద్మమధ్యస్థితగా మనకు దర్శనం యిస్తుంది. పద్మం శుభసూచకం. ఇరువైపులా అలంకరించబడిన రెండు పిల్ల ఏనుగులు తమ తొండాలతో అమృతకలశాలను పట్టుకుని ఈ తల్లికి అభిషేకం చేస్తూ వున్నట్లుగా మనకు కన్పిస్తుంది. ఈ మాత వినీలాంబరధారిణి. ఆకాశం నీలి రంగులో వుంటుంది. వినీలాంబరం సర్వసమున్నత స్థానానికి ప్రతీక. నీలిరంగు మణిమాణిక్య శోభితమైన ఆభరణాలను ధరిస్తుంది శ్రీగజలక్ష్మి మాత. నీలిరంగు పువ్వులంటే ఈ తల్లికి యిష్టం. సదా ప్రసన్నంగా వుండే ఆ తల్లి తన రెండు చేతులలో పద్మాలను ధరించి వుంటుంది. మిగిలిన రెండు వరద హస్తాలతో భక్తులను అనుగ్రహిస్తూ వుంటుంది. సదా గజరాజులచే అమృతాభిషేకం చేయించుకునే ఈ గజలక్ష్మి మాతని మహేంద్రాది దేవతాగణం సేవిస్తూ వుంటారు. సమస్త దేవతాగణానికీ కూడా శుభప్రదాత అయిన ఈ తల్లి పాదకమలాల చెంత దేవతలు శిరస్సు వంచి పాద నమస్కారం చేస్తూ వుంటే ఆయా దేవతల కిరీట కాంతులు ఆ తల్లి పాదాలపైపడి ఎంతో మనోహరంగా ప్రతి ఫలిస్తూ వుంటాయి. దేవతలు తమ తమ కిరీటాలనే భిక్షాపాత్రలుగా చేసుకుని దేహి దేహి అని సదా ఆమె కరుణా కటాక్షాలను కోరుకుంటూ వుంటారట. ఆ తల్లి దివ్యసన్నిధానాన్ని వర్ణించడం ఎవరితరం? సదా పూర్ణ కలశాభిషేచిత అయిన ఆ తల్లి తన అమృత దృక్కులతో భక్తుల సమస్త దోషాలను పోగొట్టి "దుర్గతి నాశిని" గా ప్రసిద్ధి కెక్కింది. నిత్యసత్య స్వరూపిణి అయిన ఆ తల్లిని మహేంద్రాదులే గాక బ్రహ్మరుద్రాదులు కూడా సేవిస్తూ వుంటారు. అందువల్లనే హరిహర బ్రహ్మ సుపూజిత సేవితగా ఆ తల్లి కీర్తించబడింది. తన అమృత దృక్కులతో భక్తుల సమస్త పాపాలను పోగొట్టే గజలక్ష్మి దేవిని దుర్గతినాశిని, సర్వరోగ ప్రతిక్రియాకారిణి, సర్వ విష రోగహారిణిగా పూజించటం పరిపాటి. ఏ మందులకూ తగ్గని విష జ్వరాలు వచ్చినపుడు గజలక్ష్మీదేవి పూజిస్తే పరిపూర్ణ ఆరోగ్యం కలుగుతుంది. సదా భక్తి తత్పరతలతో తనను సేవించే భక్తుల కోరిన కోర్కెలు తీర్చు కల్పవృక్షమయిన ఆ తల్లి ఎక్కడయినా ధర్మానికి, మర్యాదకి ఆచార వ్యవహారాలకి అపచారం జరిగితే వెంటనే తన ఆగ్రహాన్ని, ప్రతాపాన్ని చూపి భక్తులు తిరిగి సరైన మార్గంలో వర్తించేలా చేస్తుంది. ధర్మ సంరక్షణి అయిన శ్రీ గజలక్ష్మి మాత ప్రభావం తెలియజేసే ఈ కథ విష్ణుపురాణంలో చెప్పబడింది.

## సముద్ర రాజతనయ శ్రీగజలక్ష్మి మాత మాహాత్మ్యము

సాధారణంగా దేవతలు దానవులు ఒకరిపై మరొకరు ఆధిపత్యం సాధించటం కోసం తరచు కలహించుకుంటూ వుండేవారు. అధర్మ ప్రవృత్తి గల రాక్షసులపై ధర్మవర్తనులైన దేవతలు విజయం సాధించేలా చూసే బాధ్యతని తనపై వేసుకున్నాడు స్థితికారకుడు శ్రీమహావిష్ణువు. విష్ణుపత్ని, ప్రపంచేశ్వర నాయిక అయిన ఆ లక్ష్మీదేవి

కూడా తన కటాక్షాన్ని సదా దేవతలపై ప్రసరింపజేస్తూ వుండేది. ఆకారణంగా దేవతలకి సమస్త శుభాలు, జయాలు కలుగుతూ వచ్చాయి. ఒకసారి దేవతలు దానవులపై విజయం సాధించి ఆనందోత్సాహాలతో స్వర్గానికి తిరిగివచ్చి ఎంతోఘనంగా వేడుకలు జరుపుకుంటున్నారు. దేవేంద్రునితో సహా అందరూ కూడా మితిమీరిన విందులు వినోదాలలో మునిగిపోయి కన్నుమిన్నుగానక వున్నారు. ఎవరికీ కూడా తమ విజయాలన్నీ తమకి లక్ష్మీనారాయణుల అనుగ్రహం వల్లనే లభించాయనే స్పృహ లేనే లేదు. ఇటువంటి సమయంలో అసమాన తపోధనుడు ముక్కోపి అయిన దూర్వాసమహర్షి వైకుంఠానికి వెళ్ళి లక్ష్మీ నారాయణులన్నా దర్శనం చేసుకున్నాడు. లక్ష్మీనారాయణులు మునికి తమ ప్రసాదంగా పారిజాత సుమమాలని బహుకరిస్తారు. భవబంధాలు తెంచుకున్న ఋషి ఆ మాలను ఏంచేసుకుంటాడు? దీనిని సద్వినియోగం చేయాలంటే దేవేంద్రునికి యివ్వాలి అని అనుకుని స్వర్గలోకం చేరాడు దూర్వాసుడు. వినోదాలలో, విందులలో మునిగి వున్న ఇంద్రుడు దూర్వాసుని ఆగ్రహ ప్రభావం బాగా తెలిసిన వాడు కనుక ముని రాక వార్త వినగానే ఎదురువచ్చి గౌరవంగా సత్కరిస్తాడు. దూర్వాసుడు సంతోషించి తన దగ్గరవున్న పారిజాతమాలను దేవేంద్రునికి యిస్తాడు. అప్పటి వరకు కేళీవిలాసాల్లో మునిగివున్న యింద్రుడు ఆ మాలను ఎంతో నిర్లక్ష్యంగా అందుకుని తన పట్టపుటేనుగు ఐరావతానికి అలంకారంగా వేస్తాడు. లక్ష్మీనారాయణుల ప్రసాదమైన ఆ మాలయొక్క శక్తిని భరించలేక ఆ ఏనుగు తత్తరపాటుతో ఆ మాలను నేలపై పడవేసి తొక్కుకుంటూ కంగారుగా సముద్రగర్భంలోకి వెళ్ళిపోతుంది. జరిగినదంతా తెలుసుకున్న ఆ జగన్మాత లక్ష్మీదేవికి ఎంతైనా కోపం వస్తుంది. సకల శుభాలకీ కారణభూతమైన తనని నిర్లక్ష్యం చేయటమే గాక లక్ష్మీనారాయణుల ప్రసాదాన్ని ఈ విధంగా అగౌరవ పరచటం సహించలేని ఆ తల్లి దేవతలకి తగిన బుద్ధి చెప్పాలని నిర్ణయించుకుంది. ఆ తల్లి క్షీరసాగర గర్భంలోకి వెళ్ళిపోయింది. యిక దేవతలకి కష్టాలు మొదలయ్యాయి. ఒక్కొక్కటిగా ఐశ్వర్యాలన్నీ దేవతలని విడిచి పెట్టి వెళ్ళిపోవడం మొదలు పెట్టాయి. దానితో రాక్షసులు సులువుగా దేవతలను జయించటం మొదలు పెట్టారు. తాము అనుభవించే కష్టాలకు తోడు రాక్షస గురువు శుక్రచార్యుడు మృతసంజీవినీ విద్యతో రాక్షసులను పునర్జీవితుల్ని చేయటంతో దేవతలకు దిక్కులోచక శ్రీమహావిష్ణువుని ఆశ్రయించారు. దేవతలకు శుభాలు కలగాలంటే ఆ జగన్మాత లక్ష్మీదేవి అనుగ్రహం వుండాలని, క్షీర సాగర మథనం చేస్తే లక్ష్మీదేవితో పాటు అమృతం కూడా లభిస్తుందని శ్రీ మహావిష్ణువు చెప్పటం జరిగింది.

మందర పర్వతం కవ్వంగా, వాసుకి సర్పరాజం కవ్వపు త్రాడుగా దేవదానవులిరువురూ కలసి క్షీర సాగర మథనం కొనసాగించారు."ఆదిలోనే హంస పాదులాగ బరువైన మందర పర్వతం మాటి మాటికీ సముద్రంలోకి కృంగిపోవటం మొదలు పెట్టింది. లక్ష్మీదేవి వియోగంలో నున్న నారాయణుడు సముద్ర గర్భంలో



ప్రవేశించి కూర్మావతారుడై మందర పర్వతాన్ని మూపున మోసి క్షీర సాగర మథనం కొనసాగేలా చూసాడు. ఎంతలో ఎంతమార్పు. లక్ష్మీదేవి విడిచి వెళ్లేసరికి సాక్షాత్తూ నారాయణుడికి కూడా అవస్థలుతప్పలేదు. భయంకర హాలహల విషజ్వాలలకి భయపడి లోకాలన్నీ గగ్గోలెత్తి పోతే పరమశివుడు ఎంతో దయతో ఆ విషాన్ని మ్రింగి గరళకంఠుడై లోకాలని రక్షించాడు. ఆ తర్వాత క్రమంగా కౌస్తుభాది మణులు, ఐరావతం, ఉచ్చైశ్రవం, కల్పవృక్షం, కామధేనువు బయటికి వచ్చేక లక్ష్మీదేవి ఇరువైపులా మత్తేభాలు బంగారు కలశాలతో అభిషేకం చేస్తూ వుండగా గజలక్ష్మీ అవతారంగా క్షీర సాగరం నుంచి ఆవిర్భవించింది. గజరాజులచే సేవించబడే ఆ శ్రీ గజలక్ష్మీ మాతని ఈవిధంగా స్తుతించడం జరిగింది.

చతుర్భుజాం ద్వినేత్రంచ పరాభయకరాన్వితాం
అబ్జద్వయ కరాంభోజాం అంబుజాసన సంస్థితాం
ససువర్ణ గజోత్రాప్యాం ప్లావమానం మహాచర్యాం
సర్వాభరణ శోభాభ్యాం శుభ్ర వస్త్రోత్తరీయకాం
చామర గ్రాహ నారీభి స్సేవితాం పార్శ్వయో ద్వయో
ఆపాదలతికావసనాం కిరీట ముకుటోజ్జ్వలాం!
దేవేంద్రుడు ఎన్నో విధాల ఆ తల్లిని క్షమించమని వేడుకున్నాడు.

కరుణా సముద్ర అయిన ఆ తల్లి ఎంతో దయతో తన అపార కృపా కటాక్షాలను దేవతలపై తిరిగి కురిపించింది. ఈ విధంగా ఆ తల్లి ఆగ్రహించటం వల్ల చివరికి దేవతలకి అమృతం కూడా లభించింది. ఆ విధంగా ఆ తల్లి ఆగ్రహం, అనుగ్రహం రెండూ కూడా లోకకల్యాణ కారకములైనాయి. ఈ గజలక్ష్మీమాతని శ్రీ వైభవలక్ష్మీదేవి రూపంగా ఆరాధించుటం పరిపాటి.

### విషజ్వరహారిణి - గజలక్ష్మీమాత

గజలక్ష్మీ మాత సర్వవిషరోగహారిణి. సర్వరోగ ప్రతిక్రియాకారిణి. ఇంట్లో పిల్లలకి ఎంతకూ తగ్గని, ఏ మందులకూ లొంగని విష జ్వరాలు వచ్చినపుడు అమిత ప్రభావపూర్ణమైన ఈ క్రింది స్తోత్రాన్ని భక్తి శ్రద్ధలతో ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం పఠిస్తే వెంటనే సత్ఫలితాలు కన్పిస్తాయి.

అతిలోకా అసామాన్యా మహాద్భుత విభూతికా
నిత్యస్నాతా నిత్యశుభ్రా పరంపర పరాపరా॥
పద్మస్థితా పద్మగంధా చతుర్బాహు సుశోభితా
వరదాభయమందారా అరవిందా స్వయారమా॥
చకచ్చకిత వస్త్రాఢ్యా శుండాలాంచ సుధాభాండం
స్నపతిః ఇందీవరాననా - గజలక్ష్మీ పాతుమే సదా॥

## శ్రీ వైభవలక్ష్మీ ఆరాధనం

యా రక్తంబుజ వాసినీ చందాంశు తేజస్వినీ
యా రక్తా రుధిరాంబరా హరి సఖీ యాశ్రీర్మనోహ్లాదనీ
యా రత్నాకర మంధనాత్ ప్రఘటితా విష్ణోశ్చ యాగేహినీ
సామాంపాతు మనోరమా భగవతీ లక్ష్మీశ్చ పద్మాలయా!

భక్త సులభురాలైన శ్రీ గజలక్ష్మి మాతని సేవించే మార్గాలు ఎన్నో వున్నాయి. వాటిలో శ్రీ వైభవలక్ష్మి ఆరాధనం ఒకటి.



విభవము అంటే ప్రజ్ఞావిశేషం. లేదా మాహాత్మ్యము. ఆ తల్లి విభవ విశేషాల వలననే మనకి సమస్త రకాలయిన సుఖసంపదలు, ఐశ్వర్యాదులు కలుగుతున్నాయి. ఐశ్వర్యదాయిని అయిన శ్రీ వైభవ లక్ష్మి వ్రతాన్ని చాతుర్వర్ణాలవారు, వయస్సుతో సంబంధం లేకుండా చేయవచ్చు. ఈ పూజ చేయటానికి శుక్రవారాలు లేదా గురువారం సాయంత్రం కాని మంచిది. ఇంటిలో స్త్రీలందరూ కలిసి సామూహింగా ఈ పూజ చేసుకొనవచ్చును. కనీసం సంవత్సరంలో ఒకసారైనా ధనత్రయోదశినాడు ఈ వైభవ లక్ష్మి వ్రతం చేసినట్లయితే మంచి ఫలితాలు కలుగుతాయి. పెళ్ళికాని పిల్లలు మంచి భర్తని, కొత్తగా పెళ్ళయినవారు సత్సంతానాన్ని పొందగలుగుతారు. ఋణ బాధలతో బాధపడేవారు ఈ వ్రతం చేస్తే మంచి ఆదాయం కలిగి అప్పులు తీర్చగలుగుతారు.

కొల్హాపురిలో వెలసి వున్న మహాలక్ష్మిదేవిని గజలక్ష్మీదేవి ప్రతిరూపంగా చెప్పటం జరిగింది. ఆత్మ సౌందర్యాన్ని ఆలంబన చేసుకుని, భక్తి శ్రద్ధలనే సాధనల ద్వారా పరిశుద్ధమైన మనస్సుతో శ్రీ గజలక్ష్మీదేవిని అర్చించిన వారికి కోరిన కోర్కెలు అన్నీ తీరి సమస్త శుభాలను పొందగలుగుతారు. ఆ తల్లిని షోడశోపచారాలతో అష్టోత్తరశతనామావళితో అర్చించిన వారికి సమస్త సంపదలు, శుభాలు కలుగుతాయి.

శ్రీ గజలక్ష్మి మాత మూల మంత్రం ఈ విధంగా చెప్పబడింది. "ఓం శ్రీం హ్రీం క్లీం గజలక్ష్మి దేవతాయై నమః" రోజూ నిత్య పూజలు చేయలేని వారు ఈ మూలమంత్రాన్ని రోజుకి 123 సార్లు జపించినట్లయితే ఆ తల్లి అనుగ్రహం పరిపూర్ణంగా కలుగుతుంది. సకల తాప నివారణ చేసే ఆ తల్లి పాద పద్మాలను ఆశ్రయించి భక్తులందరూ తరించెదరు గాక!



శ్రీ గజలక్ష్మీదేవి ఆవిర్భావం

## శ్రీగజలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం

స్వయంభువా సర్వాధిష్ఠా స్వేచ్ఛాచార వినోదినీ
రూపసర్వస్వ వైభూతీ లోకాతీత విలాసినీ॥ 1

నిరుపమానిత్యాసత్యా నిరవధిక కృపారసా
అనూహ్య దివ్యాకారా పాతుమే సర్వదా సతాం ॥ 2

నిత్యసత్య స్వరూపాచ నిత్యానంద నికేతనా
నిత్య ప్రకాశినీచైవ స్వప్రకాశాత్మ స్వరూపిణీ ॥ 3

నిత్యానందా నిత్యబోధా నాదినీ జనమోదినీ
సత్యప్రత్యయనీ చైవ స్వప్రకాశాత్మ రూపిణీ॥ 4

ఉమాభగవతీ దుర్గా చాంద్రీదాక్షాయణీశిఖా
గంగా సరస్వతీ వేణీ యమునా నర్మదాపగా॥ 5

సముద్రవసనావాసా బ్రహ్మాండశ్రేణి మేఖలా
దశవాయు జయాకారా కాశ్యపీకమలా తథా॥ 6

శ్రీరంజితా మహాకావ్యా సోమ సూర్యాగ్నిలోచనా
అదితిర్దేవమాతాచ అష్ట పుత్రాష్టయోగినీ ॥ 7

బడబాగ్ని శిఖావక్త్రా మహాకబళ తర్పణా
మహాభూతా మహాదర్పా మహాసారా మహాక్రతుః॥ 8

పంచభూత మహాగ్రాసా పంచభూతాధి దేవతా
సర్వ ప్రమాణ సంపత్తి సర్వరోగ ప్రతిక్రియా ॥ 9

బ్రహ్మాండాంతర్బహి ర్వ్యాప్తా విష్ణు వక్షోవిభూషిణీ
శాంకరీ విధివక్త్రస్థా ప్రవరా పరహేతుకా ॥ 10

నవకోటి మహాశక్తి సముపాస్య పదాంబుజా
సౌవర్ణ రత్నాకరద్యా కనత్సౌభరణ విభూషితా ॥ 11

నకపృష్ఠగతారాధ్యా విష్ణులోక విలాసినీ
వైకుంఠ రాజమహిషీ శ్రీరంగనగరాశ్రితా ॥ 12

అష్టాదశభుజేలక్ష్మీ మహాష్టాదశపీఠగా
భూమినీళాది సంసేవ్యాస్వామి చిత్తానువర్తినీ॥ 13

పద్మా పద్మాలయే పద్మీపూర్ణ కుంభాభిషేచితా
ఇందిరారిందిరేందిరాభాక్షీ క్షీరసాగరకన్యకే ॥ 14

శాశ్వత్యైశాశ్వతాకారా లోకానుగ్రహకారిణీ
సారసీ మానసీ హంసీ హంసలోకప్రదాయినీ॥ 15

చిన్ముద్రాలంకృతాకార కోటిసూర్య సమప్రభా
సుఖప్రాణి శిరోరేఖాసదదృష్ట ప్రదాయినీ ॥ 16

సర్వసాంకర్య దోషఘ్నీ విషరోగాది భంజనీ ।
సదాశాంతా సదాశుద్ధాగృహచ్ఛిద్రనివారిణీ ॥ 17

కలిదోష ప్రశమనీచ కోలాహలపురస్థితా ।
గౌరీలాక్షణికా ముఖ్యో జఘన్యాకృతి వర్జితా ॥ 18

అనంత నిత్యమహిషీ ప్రపంచేశ్వర నాయకీ ।
అత్యుచ్ఛ్రిత పదాంత స్థా పరమవ్యోమ నాయకీ ॥ 19

పరమేశీనిత్య సంతుష్టా సర్వేశీదోషవర్జితా ।
గజలక్ష్మీ జగన్మాత ర్విష్ణుపత్నీ నమోస్తుతే ॥ 20

### దీపావళినాడు లక్ష్మీదేవినే ఎందుకు పూజిస్తూంటాం?

తమసోమా జ్యోతిర్గమయ – తమస్సు అంటే చీకటిఅనీ, అజ్ఞానంఅనీ అర్థం. చీకట్లు పోగొట్టేదీపం లాంటిదే అజ్ఞానాన్ని పోగొట్టే జ్ఞాన జ్యోతి కూడా. మన పూర్వీకులు దీపాన్ని దైవంతో పోలుస్తూ "దీపం జ్యోతి పరబ్రహ్మ" అని చెప్పటం జరిగింది. భారతీయ సంస్కృతిలో దీపానికి ఎంతో ప్రాముఖ్యం యివ్వటం జరిగింది. 'భా' అనగా కాంతి. 'రత' అంటే యిష్టంగలవారు. కాబట్టి భారతీయులు అంటే కాంతికి, జ్ఞానానికి విలువనిచ్చే వారని అర్థం. ఏకార్యక్రమమైన దీపోజ్జ్వలనంతో మొదలుపెట్టటం మన అనవాయితీ. వెలుగుతూవుండే దీపంలో తాను కొలువుంటా నని మహాలక్ష్మీదేవి శెలవిచ్చింది. దీపం ఆతల్లి ప్రతిరూపం అని అంటారు. దీపావళి రోజున అధర్మంపై ధర్మం సాధించిన విజయానికి గుర్తుగా మనం దీపాలను వెలిగిస్తాం. దీపకాంతులతో ఏగృహము అయితే కాంతిభరితంగా వుంటుందో ఆ గృహం లక్ష్మీనిలయముగా వుంటుందని మన పెద్దవాళ్ళు చెప్తూవుంటారు. దీపానికి నమస్కారంచేస్తే అది లక్ష్మీదేవికి నమస్కరించినట్లే. దీపావళినాడు లక్ష్మీదేవిని పూజిస్తే విశేష ఫలితాలు కలుగుతాయి. మనదేశంలోని అన్ని ప్రాంతాలవారు దీపావళినాటి సాయంత్రం కొత్తవస్త్రాలను ధరించి దీపాలను వెలిగించి ధనలక్ష్మీపూజ చేస్తారు. ప్రసాదాన్ని, తాము, తమ కుటుంబంవారు స్వీకరించటమేగాక యిరుగుపొరుగువారికి బంధుమిత్రులకి పంచటం ఆచారంగా వస్తున్నది. లక్ష్మీకటాక్షం కోరేవారు దీపావళినాడు విధిగా ధనలక్ష్మీపూజ చేయాలి.

## గజలక్ష్మీ మంగళ హారతి

గజలక్ష్మి అని నిన్ను చాలగ పిలిచితే
లో లక్ష్మి నీకింత చాలామేలా
పాలా సముద్రుని పట్టి పలుమారు పిలిచితే
గజలక్ష్మి దేవి మంగళం మంగళం.
అలికి పూచిన యింట్లో చిలుకుజల్లితినెనె
మెలుకువతో రామ్మా అలుక లేక
కలకల నవ్వుతూ కలియండలెక్కుచు
అలుక ముద్దుల బంగారు కొలికీ
మంగళమ్ మంగళమ్.
గజలక్ష్మి దేవి నీకు మంగళం మంగళం
కొంగు మూటావిప్పి బంగారు మోరువేసి
పొంగుచూ యిచ్చేనే మంగళ హారతీ
అంగనాలాకూనూ అభయమిచ్చే తల్లి
మా యింట వెలసిన శ్రీలక్ష్మీదేవీ మంగళం మంగళం
ఒంటిగా రావమ్మ యింటికి వచ్చెదవమ్మా
జంటబాపకవుండు వెంట నుండూ
కంఠమున మెరిసేటి జంట హారములిస్తూ
మా యింట వెలసిన శ్రీలక్ష్మీదేవి మంగళం మంగళం.
గజలక్ష్మిదేవీ మంగళం-

## శ్రీ గజలక్ష్మీ స్తోత్రమ్

ఇది ఇంద్రకృత గజలక్ష్మీ స్తోత్రమ్. అనేక కష్టాలు పడి, క్షీర సాగరమధనం సాగించిన తర్వాత తిరిగి దేవరాజ్యాన్ని పొందిన యింద్రుడు ఆ గజలక్ష్మీమాతని ఈ విధంగా ప్రార్థించాడు. ఎంతో ప్రత్యేకమైన ఈ స్తోత్రాన్ని పరాయణం చేస్తే మన కష్టాలన్నీ గట్టెక్కి సమస్త శుభాలు నెరవేతాయని విష్ణుపురాణంలో చెప్పబడింది.

సింహాసన గతః శక్రః సంప్రాప్య త్రిదివం పునః
దేవరాజ్యే స్థితో దేవీ తుష్టావాబ్జకరాం తతః॥

**ఇంద్ర ఉవాచ :**

నమస్తస్యై సర్వభూతానం జననీ మబ్జసంభవామ్
శ్రియమునీంద్ర పద్మాక్షీ విష్ణు వక్షః స్థల స్థితామ్॥ 1
పద్మాలయాం పద్మకరాం పద్మపత్రనిభేక్షణాం
వందే పద్మముఖాందేవీం పద్మనాభ ప్రియామ్యహమ్॥ 2



త్వం సిద్ధిస్త్వం స్వధా స్వాహా సుధాత్వం లోకపావనీ
సంధ్యారాత్రిః ప్రభాభూతిః మేధా శ్రద్ధా సరస్వతీ. 3
యజ్ఞ విద్యా మహావిద్యాగుహ్యవిద్యాచ శోభనే
ఆత్మ విద్యాచ దేవీత్వం విముక్తి ఫలదాయినీ 4
ఆ న్వీక్షికే త్రయీ వార్తా దండనీతి స్త్వమేవచ
సౌమ్యా సౌమ్యైః జగద్రూపైః త్వయైతద్దేవి పూరితం 5
కాత్వన్యాత్వమృతే దేవి సర్వయజ్ఞమయంవపుః
అధ్యాస్తే దేవదేవస్య యోగాచింత్యం గతాభృతః 6
త్వయాదేవి పరిత్యక్తం సకలం భువనత్రయమ్
వినష్టప్రాయం అభవన్త్వయేదానీం స మేధితమ్॥ 7
దారాపుత్రాస్తదాగారం సుహృద్వాన్యధానాదికం
భవత్యేతన్ మహాభాగే నిత్యం త్వదీక్షణాన్నృణాం॥ 8
శరీరారోగ్యమేశ్వర్య మరిపక్ష క్షయః సుఖం
దేవిత్వ దృష్టి దృష్టానాం పురుషాణాంన దుర్లభమ్॥ 9
త్వమంబా సర్వభూతానాం దేవదేవీ హరిః పితా
త్వయైతద్విష్ణునా చ అంబ జగద్వ్యాప్తం చరాచరమ్॥ 10
మనః కోశస్తథా కోశం మా గృహం మా పరిచ్ఛదమ్
మా శరీరం కళత్రం చ త్వజేథాః సర్వపావనీ॥ 11
మాపుత్రాన్మా సృహృద్వర్గాన్మాపశురమ్మా విభూషణాం
త్వజేథా మమ దేవస్య విష్ణోర్వక్షస్థలాశ్రయే॥ 12
సత్త్వేన సత్య శౌచాభ్యాం తథా శీలాదిభిర్గుణైః
త్వజ్యంతే తేనరోః సద్యః సంయుక్తా యే త్వయామలే 13
త్వం యావలోకి తాః సద్యః శీలాధ్యైఃరఖిలౌర్గు
కులైశ్వర్యైశ్చ పూజ్యంతే పురుషానిర్గుణా అపి॥ 14
సశ్లాఘ్యః సగుణీ ధాన్యః సకులీనః సబుద్ధిమాన్
సశూరః సచవిక్రాంతే యస్త్వయాదేవి వీక్షితః॥ 15
సద్యో వైగుణ్యమాయాంతి శీలాద్యాః సకలాగుణాః
పరాంగముఖీ జగద్ధాత్రీ యస్యత్వంవిష్ణువల్లభే॥ 16
నతాన్ వర్ణయితుః శక్తాగుణాజింతాహ్వాపివేధసః
ప్రసీద దేవి పద్మాక్షీ మాస్మాం స్త్యా క్షీః కదాచ న॥ 17

**పరాశర ఉవాచ :**

ఏవం శ్రీః సంస్తుతాం సమ్యక్ ప్రాణిహృష్టా శతక్రతుం
శృణ్వతం సర్వదేవానాం సర్వభూతస్థితాద్విజం॥ 18

**శ్రీః ఉవాచ :**
పరితుష్టాస్మి దేవేశ స్తోత్రేణానేనతే హరేః
వరం వృణీష్వ యస్త్విష్టోవరదాహం తవాగం॥ 19
**ఇంద్ర ఉవాచ :**
వరదా యదిమేదేవి వరాహోం యదివాప్యహం
త్రైలోక్యం చత్వయా త్యాజ్య మేషమేస్తువరః పరః॥ 20
స్తోత్రాణ యస్త్వైతేన త్వాం స్తోష్యత్యబ్ధి సంభవే
సత్వయాన పరిత్యాజ్యేద్వితీయోస్తువరోమమ॥ 21
**శ్రీః ఉవాచ :**
త్రైలోక్యం త్రిదేశ శ్రేష్టంన సంత్యక్ష్యామి వాసవ
దత్తో వరో ఏమీ యాయంతా స్తోత్రారాధన దృష్టయా॥ 22
యశ్చసాయం తథా ప్రాతః స్తోత్రేణానేన మానవః
స్తోష్యతే చెన్నతస్యాహం భవిష్యామి పరాంజ్ముఖీ॥ 23
**పరాశర ఉవాచ :**
ఏవం వరం దదౌ దేవీ దేవరాజాయవైపురా
మైత్రేయ శ్రీమహాభాగా స్తోత్రానారాధన తోషితా॥ 24
భృగౌః ఖ్యాత్యాం సముత్పన్నా శ్రీ పూర్వ ముదదే పునః
దేవదానవ యత్నేన ప్రసూ తామృతమంధనే॥ 25
ఏవం యదా జగత్స్వామీ దేవరాజోజనార్ధనః
అవతారః కరోత్యేషా తదా శ్రీస్తత్సహాయినీ॥ 26
పునశ్చ పద్మసంభూతాయదాదిత్యో భవద్వరిః
యదా చ భార్గవో రామస్తదా భూద్వణిత్వీయం॥ 27
రామత్తే చా భవత్సీతా రుక్మిణీ కృష్ణ జన్మనీ
అన్యేషు చావతారేషు విష్ణో రేఖానపాయినీ॥ 28
దేవత్వే దేవదేహేయం మనుషత్వేచ మానుషే
విష్ణో దేహానురూపాంవై కరోత్యేషాత్మనస్తువమ్॥ 29
యశ్చైత శృణుయాజ్జన్మ లక్ష్మా యశ్చపఠేన్నరః
శ్రియోన విచ్యుతోస్తస్య గృహే యువత్కులాత్రయం॥ 30
పఠ్యతే యేషు చైవర్షే గృహేషు శ్రీస్తవంమునే
అలక్ష్మీః కలహాధారా న తోష్యతే కదా చ న॥ 31
ఏతత్తే కథితం బ్రహ్మ న్యన్మాం త్వం పరిపృచ్ఛసి
క్షీరాబ్దౌ శ్రీర్యధాజాతా పూర్వం భృగు సుతాసతి॥ 32
ఇతి సకల విభూత్య వాప్తిహేతుఃస్తుతిరియ మింద్ర ముఖోద్గతాంహి లక్ష్మాః
నతేషు కదా చిదప్య లక్ష్మీః

**శ్రీ విష్ణుపురాణే గజలక్ష్మీ స్తోత్రం సంపూర్ణం.**





## గజలక్ష్మీ యంత్రము

### మూల మంత్ర ధ్యాన శ్లోకము

ఓం నమో భగవతీ గజలక్ష్మీ ఓం హ్రీం క్లీం క్లీం
హ్రీం క్లీం మమ హృదయే ధైర్య స్వరూప ఝుంకారం
దేహి దేహి. మమ శత్రూన్ దాపయ దాపయ
మమ గృహే ధనం ప్రాపయ ప్రాపయ స్వాహా -
**108** సార్లు కుంకుమార్చన - జపము - హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ గజలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ఓం స్వయంభువాయై నమః
ఓం సర్వాధిష్ఠాయై నమః
ఓం స్వేచ్ఛాచారవినోదిన్యై నమః
ఓం రూపసర్వస్వవిభూత్యై నమః
ఓం లోకాతీతవిలాసిన్యై నమః
ఓం నిరుపమాయై నమః
ఓం నిత్యాయై నమః
ఓం సత్యాయై నమః
ఓం నిరవధిక కృపా రసాయై నమః
ఓం అనూహ్య దివ్యాకారాయై నమః 10
ఓం నిత్యసత్య స్వరూపాయై నమః
ఓం సర్వదాయై నమః
ఓం సతాయై నమః
ఓం నిత్యానంద నికేతనాయై నమః
ఓం నిత్యప్రకాశిన్యై నమః
ఓం స్వప్రకాశస్వరూపిణ్యై నమః
ఓం నిత్యానందాయై నమః
ఓం నిత్యబోధాయై నమః
ఓం నాదిన్యై నమః
ఓం జనమోదిన్యై నమః 20
ఓం సత్యప్రత్యన్యై నమః
ఓం స్వప్రకాశాత్మరూపిణ్యై నమః
ఓం ఉమాయై నమః
ఓం భగవత్యై నమః
ఓం దుర్గాయై నమః
ఓం చాంద్రియై నమః
ఓం దాక్షాయణ్యై నమః
ఓం శిఖాయై నమః
ఓం గంగాసరస్వతీవేణీ
నర్మదాపగాయై నమః
ఓం సముద్రవసనాయై నమః 30
ఓం బ్రహ్మాండశ్రేణి మేఖలాయై నమః
ఓం దశవాయుధ్వజ యాకారాయై నమః
ఓం కాశ్యప్యై నమః
ఓం కమలాదేవ్యై నమః
ఓం శ్రీరంజితాయై నమః
ఓం మహాకావ్యాయై నమః
ఓం సోమసూర్యాగ్ని లోచనాయై నమః
ఓం అదిత్యై నమః
ఓం దేవమాతాయై నమః
ఓం అష్టపుత్రాష్ట యోగిన్యై నమః 40
ఓం బడబాగ్ని శిఖావక్త్రాయై నమః
ఓం మహాకబళతర్పణాయై నమః
ఓం మహాభూతాయై నమః
ఓం మహాదర్పాయై నమః
ఓం మహాసారాయై నమః
ఓం మహాక్రతవే నమః
ఓం పంచభూతమహాగ్రాసాయై నమః



ఓం పంచభూతాది దేవతాయై నమః
ఓం సర్వప్రమాణాయై నమః
ఓం సంపద్యై నమః 50
ఓం ఓం సర్వరోగప్రతి క్రియాయై నమః
ఓం బ్రహ్మాండాంతర్బహిర్వ్యాప్తాయై నమః
ఓం విష్ణువక్షోవిభూషిణ్యై నమః
ఓం శాంకర్యై నమః
ఓం విధివక్త్రస్థాయై నమః
ఓం ప్రవరాయై నమః
ఓం పరహేతుక్యై నమః
ఓం నవకోటి మహాశక్తి
సముపాశ్యపదాంబుజా నమః
ఓం కనత్సౌవర్ణరత్నా
ద్యాభరణభూషితాయైనమః
ఓం నకపష్టగతారాధ్యాయై నమః 60
ఓం విష్ణు లోకవిలాసిన్యై నమః
ఓం వైకుంఠరాజమహిష్యై నమః
ఓం శ్రీరంగ నగరాశ్రితాయై నమః
ఓం అష్టాదశభుజాయై నమః
ఓం లక్ష్మ్యై నమః
ఓం మహాష్టాదశ పీఠగాయై నమః
ఓం భూమినీళాది సంసేవ్యాయై నమః
ఓం స్వామి చిత్తానువర్తిన్యై నమః
ఓం పద్మాయై నమః
ఓం పద్మాలయాయై నమః 70
ఓం పద్మిన్యై నమః
ఓం పూర్ణకుంభాభిషేచితాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం ఇందిరేభాక్షాయై నమః
ఓం క్షీరసాగరకన్యకాయై నమః
ఓం ఓం శాశ్వత్యై నమః
ఓం శాశ్వతాకారాయై నమః
ఓం లోకానుగ్రహకారిణ్యై నమః
ఓం సారసియై నమః
ఓం మానసియై నమః 80
ఓం హంసియై నమః
ఓం హంసలోక ప్రదాయిన్యై నమః
ఓం చిన్ముద్రాలంకృతా కారాయై నమః
ఓం కోటిసూర్యసమప్రభాయై నమః
ఓం సుఖప్రాణి శిరోరేఖా నమః
ఓం సదదృష్ట పదాయిన్యై నమః
ఓం సర్వసాంకర్య దోషఘ్న్యై నమః
ఓం విష రోగాదిభంజన్యై నమః
ఓం సదా శాంతాయై నమః 90
ఓం సదా శుద్ధాయై నమః
ఓం గృహచ్ఛిద్రానివారిణ్యై నమః
ఓం కలిదోషప్రశమన్యై నమః
ఓం కోలాహలపురస్థితాయై నమః
ఓం గౌర్యై నమః
ఓం లాక్షణికాయై నమః
ఓం ముఖ్యాయై నమః
ఓం జఘన్యాకృతి వర్జితాయై నమః
ఓం అనంత నిత్య మహిష్యై నమః
ఓం ప్రపంచేశ్వరనాయికాయైనమః100
ఓం అత్యుచ్ఛ్రితపసదాంతస్థాయై నమః
ఓం పరమవ్యోమనాయికాయై నమః
ఓం పరమేశ్యై నమః
ఓం నిత్యసంతుష్టాయై నమః
ఓం సర్వేశ్యై నమః
ఓం దోషవర్జితాయై నమః
ఓం గజలక్ష్మ్యై నమః
ఓం జగన్మాతాయై నమః
ఓం విష్ణుపత్న్యై నమః 108

## 8. శ్రీసంతానలక్ష్మీదేవి వైభవము

### సత్సంతానదాయిని శ్రీ సంతానలక్ష్మీదేవి ప్రశంస

శ్లో ॥ అయిగజవాహిని మోహిని చక్రిణి రాగవివర్ధిని జ్ఞానమయే
గుణగణవారిధి, లోకహితైషిణి, సప్తస్వర సుర గానసుతే
సకల సురాసుర దేవ మునీశ్వర మానవ వందిత పాదయుతే
జయజయహే మధుసూదన కామిని సంతానలక్ష్మీ పరిపాలయమాం ॥

సత్సంతానాన్ని అనుగ్రహించే తల్లి శ్రీ సంతానలక్ష్మీదేవి. అష్టలక్ష్మీ అవతారాలలో అయిదవది శ్రీ సంతానలక్ష్మీదేవి. ఆ తల్లి అనుగ్రహం వుంటే సమర్థులైన సంతానం కలుగుతారు. ఎన్ని భోగభాగ్యాలున్నా సత్సంతానం లేకపోతే ఆ తల్లిదండ్రులకు మనశ్శాంతి వుండదు.

### సంతానం ఎందుకు ?

పురాణకాలం నుండి నేటి వరకు పిల్లలకోసం తపించిపోవటం అనేది అవిచ్ఛిన్నంగా వస్తున్న ఒక సాంఘిక ఆచారం, అలవాటు. అసలు మన భారతీయ సంస్కృతిలో సంతానానికి యింత పెద్ద స్థానం ఎందుకు యిచ్చారు. అని ఆలోచిస్తే అది కేవలం తల్లిదండ్రుల సంతోషం కోసం, వారి ఆస్తిపాస్తులను పంచి యివ్వడం కోసం మాత్రమే కాదు అని అర్థమవుతుంది.

సంతానం ఎందుకు ?

'పున్నామ' నరకం నుంచి తప్పించటానికి పుత్రులు ఉండాలి అని అంటారు. అంతేగాక తల్లిదండ్రులు తాము ఏమి సంపాదించినా దానిని తమ పిల్లలు అనుభవిస్తూ ఆనందంగా వుంటే చూసి సంతోషిస్తూ వుంటారు. అసలు పిల్లలు లేకపోతే జీవనమే వ్యర్థం అనుకుని ఎన్నో రకాలుగా పిల్లలు పుట్టడం కోసం తంటాలు పడే తల్లిదండ్రులని ఎంతోమందిని చూస్తూనే ఉంటాం. అయితే కేవలం వ్యక్తుల ఆనందంకోసం, వారికి సద్గతులు కలగటం కోసం మాత్రమే అయితే సంతాన భాగ్యానికి యింత ముఖ్యమైన స్థానం యివ్వబడిందా అని లోచిస్తే సంతానాపేక్షకి ముఖ్యకారణం ఒక మహోన్నత మైన సామాజిక బాధ్యత అని మనకి అర్థమవుతుంది.

అనాదికాలం నుండీ కూడా భరతజాతి తాము సముపార్జించిన అశేష విజ్ఞాన, సంస్కార, సాంస్కృతీ విశేషాలను, ఒక తరం నుంచి మరొక తరం వారికి అందజేయాలనే సంకల్పంతోనే, గృహస్థా శ్రమంస్వీకరించి సంతానాభిలాషులు కావటం జరిగింది ఎంతో కాలం తపస్సు చేసి ఎన్నో వేదాంత రహస్యాలను దర్శించిన ఋషులు, అనేక సంవత్సరాలు కృషి చేసి విజ్ఞాన రహస్యాలు కనుగొన్న శాస్త్రజ్ఞులు పటుతరమైన పరిశ్రమచేసి నిఖిల శస్త్రాస్త్రసముహాలు సంపాదించిన మహావీరులు,



ధర్మ సూక్ష్మాలు తెలిసిన తత్త్వవేత్తలు, ఒకరేమిటి అందరూ తమకి తెలిసిన అన్ని విషయాలను తరువాత తరానికి అందజేయాలంటే సంతానం ఒక్కటే మార్గం అని మన భారతీయ సంస్కృతి తెలియజేస్తోంది. సంతానం కలిగినంత మాత్రంచేత తల్లితండ్రులకి వారి ఆశయం నెరవేరదు. ఆ సంతానం బుద్ధిమంతులై ప్రయోజకులయినపుడే కన్నవారికి ఆనందం. అష్టైశ్వర్యాలలోను సంతానం అనేది ఒక ప్రముఖ సంపదగా చెప్పబడింది. ఆ భాగ్యం అనుగ్రహించే తల్లి మహలక్ష్మీదేవి అవతారమైన శ్రీ సంతానలక్ష్మీదేవి. ఆ తల్లి తన కృపను వివిధ రూపాలలో అనుగ్రహిస్తుంది. సంతానం కోసం పరితపించే వారు నేడూ వున్నారు. కాని ఆశయంలోనే మార్పు వచ్చింది. లౌకిక వ్యవహారాలలో తలమునకలయిపోయి, తాము సంపాదించిన కోట్ల ఆస్తిపాస్తులు 'తమ' వారికి అందజేయాలని, సంతానం కోసం పరితపించి పోవటం నేడు చూస్తేనే వున్నాం.

సంతానలక్ష్మీదేవి అనుగ్రహం వల్ల సంతాన ప్రాప్తి, పుట్టిన సంతానం మంచి బుద్ధులతో సమర్థులవ్వటం రెండూ కూడా సిద్ధిస్తాయి. శ్రీ సంతాన లక్ష్మీదేవి అనుగ్రహం గలవారికి ఈ విధమైన సంతాన భాగ్యం యిబ్బడి ముబ్బడిగా కలుగు తుంది.

శ్లో॥ రత్నాకర సముద్భూతా బ్రహ్మమన్మధ మాతృకా
కృపారసలసన్నేత్రా లోక సంరక్షకారిణీ
సృష్టి చక్ర పరిభ్రమణీ నిత్య హరితాశ్రీకరీ
సర్వదుపాతుమాందేవీ శ్రీమత్సంతానద్దానీ

సాధారణంగా సృష్టిని చేసే పని బ్రహ్మదేవునిది. అందుకే ఆయనని సృష్టికర్త అన్నారు. కాని ఆ బ్రహ్మదేవుని తల్లి లక్ష్మీదేవి కాబట్టి నిజానికి ఈ సృష్టికి మూలకారణం ఆ తల్లే. అదే విధంగా స్త్రీ పురుషులలో ఉత్తేజాన్ని రేపి వారు సంతానాభిలాషులై సృష్టి కార్యానికి సిద్ధపడేలా చేసేవాడు మన్మధుడు. అయితే మన్మధుడుకూడా లక్ష్మీదేవికి ప్రియపుత్రుడే. అందువల్ల ఏ విధంగా చూసినా ఈ యావత్తు సృష్టికి కారకురాలు ఆ సంతాన లక్ష్మీదేవే. బ్రహ్మదేవుణ్ణి, మన్మధుణ్ణి ఆయా పనులకు నియమించి సృష్టి చక్రం సవ్యంగా తిరిగేలా చూసే ఆ తల్లిని సృష్టి చక్రభ్రమణకారిణి అనటం ఎంతో సమంజసం. ఈ తల్లిని సేవించి ఎందరో సంతానాన్ని పొందిన సందర్భాలు మనకి పురాణాలలో కన్పిస్తాయి.

### సంతానలక్ష్మీదేవి స్వరూప స్వభావాలు

సంతాన లక్ష్మీదేవి తన ఒడిలో ఒక చిన్నారి బాలుడిని కూర్చోబెట్టుకుని దర్శనం యిస్తుంది. పసుపురంగు పట్టుచీర ధరించిన ఆ తల్లి తన రెండు చేతులలో పూర్ణకలశాలను ధరించి వుంటుంది. పూర్ణకలశం పరిపూర్ణత్వానికి చిహ్నం. ఈ రెండు కలశాలతోను భక్తి, జ్ఞాన సంపదలను మనకి అందిస్తుంది ఆ తల్లి. దుర్మార్గాన్ని

అంతమొందించే ఆ తల్లి రెండు చేతులలో కత్తి, డాలు ధరించి వుంటుంది. ఒక చేత్తో పిల్లవానిని పట్టుకుని మరొక చేతితో భక్తులకు అభయ ప్రదానం చేస్తూ దర్శనమిస్తుంది. ఈ తల్లి బ్రహ్మాండ గర్భిణీగా ప్రసిద్ధికెక్కింది. ఎందువల్లనంటే ఈ కనిపించే చరాచర సృష్టియావత్తూ ఆ తల్లి లీలావిలాసమే. అండపిండ బ్రహ్మాండ పరివృతమైన ఈ పదునాలుగు భువనాలు ఆ తల్లి కడుపులో నుంచి వచ్చినవే అందువల్లనే సహజ కవి పోతనామాత్యుడు ఆ తల్లిని ఈ విధంగా వర్ణించాడు.

ప॥ అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి పుచ్చిన యమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనంబులనుండెడి అమ్మ దుర్గమా
యమ్మ కృతాబ్ధియిచ్చుత మహత్వకవిత్వపటుత్వ సంపదల్.

సాధారణంగా సంతాన విహీనతకి సర్పదోషం కారణం అనటం పరిపాటి. ఈ సంతానలక్ష్మీ మాత అనుగ్రహం వల్ల సర్పదోషం, కమఠదోషం, మండూక దోషం అనే మూడు రకాల దోషాలు పరిహారం అవుతాయి అని శాస్త్రాలు చెబుతున్నాయి.

## నవ్వు లక్ష్మీదేవి ప్రతిరూపం

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని ఉపనిషత్తులలో చెప్పబడింది. "తన సంతోషమే స్వర్గము" అని సుమతీ శతకకారుడు అన్నాడు. సంతోషం సగం బలం అనే సామెత వుండనే వుంది. నవ్వటం ఒక భోగం. నవ్వించటం ఒక యోగం అన్నారు నేటి ఆధునిక లాఫాలజిస్టులు.

నవ్వుతూ జీవించే వారి వద్ద, యితరులను నవ్వించే వారి వద్ద, నవ్వుతూ పరిస్థితులను ఎదుర్కొనే వారి వద్ద తాను కలకాలం కొలువుంటానని బ్రహ్మాండ పురాణాన్ని అనుసరించి లక్ష్మీదేవి భూదేవితో చెప్పటం జరిగింది. విరగబడి, పగలబడి నవ్వి అపహాస్యం పాలు కావటం కాదు నవ్వటం అంటే. మనసారా, హాయిగా నిష్కల్మషంగా చల్లటి చిన్న మందహాసం చాలు ఎదుటి వారి మనసు గెల్చుకోవటానికి. కొంత మంది చూడటానికి బాగాలేక పోయినా కొద్దిగా నల్లగా వున్నా వారి చల్లని వెన్నెల హాయివంటి చిరునవ్వుతో ఎదుటి వారిని ఆకట్టు కుంటారు. వారికి అంతటా జయమే. రండి! మనందరం కూడా ఆ లక్ష్మీదేవి అనుగ్రహం కోసం హాయిగా నవ్వుతూ కలకాలం జీవిద్దాం. మన బాధ్యతలన్నీ ఆ తల్లివే.



## శ్రీ సంతానలక్ష్మీదేవి మాహాత్మ్యం

అయోధ్యా నగరాన్ని పరిపాలించిన దిలీపుడు రఘుకులానికి మూలపురుషుడు. అతడు ఎంతో ధర్మపరుడైన ప్రభువు. ప్రజల్ని కన్నబిడ్డల్లా చూసుకునేవాడు. కాని దిలీపునకు ఎంతోకాలం సంతానం కలగక అలమటిస్తూ వుంటే గురువైన వశిష్ఠుడు లక్ష్మీదేవికి ప్రతిరూపమైన గోమాత నందినీ ధేనువుని సేవించమని సలహా యిచ్చాడు. రాజ్యభారాన్ని మంత్రులపై ఉంచి ఆ రాజదంపతులు నందినీధేనువు అనే గోమాతకి సేవచేయటం మొదలు పెట్టారు. రోజూ ఆ గోమాతతో పాటు అడవికి పోయి సాయంత్రం తిరిగి వచ్చేవారు. యిలా వుండగా ఆ జగన్మాత వారిని పరీక్షించాలని అనుకుంది ఒకమాయ సింహం రూపం దాల్చి ఒకనాడు ఆ గోమాతని కబళించ బోయింది. దిలీప మహారాజు ఆ సింహాన్ని అడ్డుకుని, గోవు బదులుగా తనని తాను సింహానికి ఆహారంగా సమర్పించుకోవటానికి సిద్ధపడతాడు. అతని భక్తి విశ్వాసాలకి మెచ్చి ఆ తల్లి ఆ రాజుని అనుగ్రహించింది. ఆ మాత అనుగ్రహం వల్ల దిలీపుడు విఖ్యాత రఘుమహారాజుని కొడుకుగా పొందగలిగాడు. ఆ రఘుకులానికి చెందిన వాడే అయిన శ్రీరామచంద్రమూర్తి ఆవిర్భావం కూడా పుత్రకామేష్టి అనే యాగం చేసిన తరువాత మాత్రమే సిద్ధించింది. ఈ యాగాన్ని చేయించినవాడు ఋష్యశృంగ మహర్షి. అతని తండ్రి అయిన విభాండక మహర్షి. విభాండకుడు ఘోర తపస్సుచేసి లోకకల్యాణానికి కారకుడయ్యే పుత్రుడు కావాలని శ్రీమాతని అర్థించాడు.ఆ తల్లి కటాక్షం వల్ల పుట్టిన ఋష్యశృంగుడు యాగం చేయిస్తే దేవతలు స్వయంగా దిగివచ్చి హవిర్భాగం స్వీకరించేవారట. అటువంటి ఋష్య శృంగుణ్ణి దశరథ మహారాజు రావించి యాగ నిర్వహణ చేయవలసిందిగా కోరాడు. దశరథుడు అశ్వమేధ యాగాన్ని, పుత్రకామేష్టి యాగాన్ని ఋష్యశృంగుని ఆధ్వర్యంలో చేయించాడు. దేవతలంతా సంతోషించి ప్రాజాపత్యునిచేత ధన్వంతరి తయారు చేసిన దివ్యపాయసాన్ని ప్రసాదంగా పంపారు. ఆ పాయసం ప్రభావం వల్ల శ్రీరామలక్ష్మణ భరత, శత్రుఘ్నుల జననం జరిగింది.

వేదవేదాంగ వేత్త అయిన వ్యాసుడు తనకు సమర్థుడైన పుత్రుడు కావాలని ఆ మాతని అర్థించి 'శుకుడు' అనే కొడుకుని కన్నాడు. శుకమహర్షి బ్రహ్మజ్ఞాని, విరాగి, మహా తపస్సంపన్నుడు. వేద వ్యాసుడు రచించిన అష్టాదశ పురాణాలలోనూ శ్రీ భాగవత పురాణం జగద్విఖ్యాతం కావటానికి ముఖ్యకారణం అది శుక యోగీం ద్రుని చేత చెప్పబడటం వల్లనే అని విజ్ఞులు అంటారు. యీ విధంగా పురాణకాలంలో ఎంతోమంది యజ్ఞాలు, యాగాలు, తపస్సులు చేసి ఆ తల్లి లక్ష్మీదేవి అనుగ్రహంవల్ల యోగ్యులయిన సంతానాన్ని పొందగలిగారు. వారు ఆ కాలంలో ఏవైదిక కర్మలు చేసారో, ఏ ఏ వేదమంత్రాలు చదివారో తెలుసుకోవటం మనకి సాధ్యమయ్యే విషయం



శ్రీ సంతానలక్ష్మీదేవి అనుగ్రహం - రఘుజననం





కాదు. కాని కలియుగంలో దేవతలందరూ నామపారాయణంతో సంతుష్టులవుతారని చెప్పబడింది. కాబట్టి మనం భక్తి శ్రద్ధలతో ఆ శ్రీమహాలక్ష్మీదేవి అంశారూపం అయిన శ్రీ సంతానలక్ష్మి దేవిని అష్టోత్తర శతనామాలతో అర్చిస్తే సత్సంతాన ప్రాప్తి తప్పక కలుగుతుంది అని చెప్పబడింది. సంతాన లక్ష్మిదేవి ప్రీతికోసం షోడశోప చారములతో పూజచేసేవారు ముత్తయిదువులకు తాంబూలం యిచ్చేటపుడు పండ్లని ఈయకూడదు. ఆ దేవి నిత్యపూజలు చేయలేనివారు ఆ తల్లి మూలమంత్రమును జపిస్తే కూడా సత్ఫలితములు కలుగుతాయి.

**శ్రీ సంతానలక్ష్మిదేవి మూలమంత్రం :**

"ఓం హ్రీం శ్రీం క్లీం ఐం ఓం శ్రీమత్ సంతానలక్ష్మై నమః" ఈ మంత్రాన్ని ప్రతిరోజు రాత్రి భోజనానికి ముందు జపిస్తే ఆ మాత అనుగ్రహం తప్పక కలుగుతుందని చెప్పటం జరిగింది. శ్రీ సంతానలక్ష్మిదేవి అనుగ్రహం వల్ల అందరికీ సత్సంతాన ప్రాప్తి కలుగుగాక!

## సంతానం - దైవభక్తి

సంతానంయొక్క సంస్కారానికి, వారిలోని దైవభక్తికి, వారిలోని ఆత్మ విశ్వాసానికి పునాదివేసేది, వెయ్యవలసినది తల్లిదండ్రులే. పసితనం నుంచీ తల్లి వెనుక తిరుగుతూ పిల్లలు అనేక విషయాలు తెలుసుకుంటారు. అందులో అతిముఖ్యమైనవి భగవంతుని మీద భక్తివిశ్వాసాలు. మనకి ఎంతటి నమ్మకంవుందో అంతటి నమ్మకం పిల్లలకికూడా భగవంతునిపై కలిగేలా చెయ్యటంలోనే తల్లిదండ్రుల ప్రతిభ వుంటుంది. యాంత్రికంగా పనిచేసి వచ్చి ఆలస్యంగా పడుకుని, అంతే ఆలస్యంగా లేచి, ఆదరాబాదరాగా స్నానాలు కానిచ్చి, ఆఫీసులకు పరుగులుపెట్టే తల్లిదండ్రుల్ని చూసి పిల్లలు ఏం నేర్చు కుంటారో వూహించండి. యిక యింట్లో తాతగారో నానమ్మో ఏదో చెప్పబోతే మాకెక్కడ తీరికవుంది. మాకోసం మీరే ప్రార్థన చేసేయండి అంటూ వుంటారు టీనేజి పిల్లలు. నిజానికి దైవం గురించి ఆలోచించటానికి సమయం లేదంటే అది మన ఆలోచనలోని లోపమే. సరిగ్గా చెప్పాలంటే పెంపకంలో లోపం. శ్రద్ధగా చదువుకోడం ఎంతో అవసరం. అన్నీ నేర్చుకోవటం చాలా అవసరం. కాని మన ప్రయత్నం మనం చేస్తూనే భగవంతుని అనుగ్రహంకోసం ప్రార్థించు కుంటు వుంటే తప్పక మంచి ఫలితాలు కలుగుతాయి. దైవానుగ్రహం లేకుండా ఏదీ సాధ్యపడదుకదా! ప్రార్థన అంటే పైకి వినిపించేలా ఆర్భాటంగా చేయనక్కరలేదు. మనస్ఫూర్తిగా, భక్తితో లక్ష్మీమాత బీజాక్షరాలు మనసులో స్మరించుకుంటే మనకోరికలన్నీ తీరుతాయి. అందుకు అవసరమయినది రోజుకి 15నిమిషాలు. మనసు ప్రశాం తంగా వుంచుకుని ప్రార్థిస్తేనే ఆ ప్రార్థన ఫలిస్తుంది. పిల్లలూ ! రండి! ఈ సులువుమార్గం మీ తల్లిదండ్రుల వద్దనేర్చుకుని అన్నిటా విజయంసాధించాలి మీరు!

## శ్రీ సంతానలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం

రత్నాకర సముద్భూతా బ్రహ్మమన్మథ మాతృకా
సృష్టి చక్ర పరిభ్రమణీ నిత్య హరితా నమోస్తుతే॥ 1

శ్రీకరీ శ్రీమతీ దేవీ శ్రీమత్సంతాన దాయినీ
శ్రీకాంతా శ్రీకళా శుభ్రా కర్మనిర్మూల కారిణీ॥ 2

శ్రీవిద్యాశార్వరీ భుంజ్యే జంభాసుర నిబర్హిణీ
వ్యోమకేశాఖిల ప్రాణా పంచకోశ విలక్షణా॥ 3

పంచకోశాత్మికా ప్రత్యక్పంచ బ్రహ్మాత్మికా సదా
దేవకీదేవ సంకాశా వార్ధిజా కరుణాకరా॥ 4

శర్వరీ సర్వ సంపన్నా సర్వపాప ప్రభంజనీ
గంభీరా గహనాగుహ్యా యోనిలింగార్ధధారిణీ॥ 5

శేషవాసుకి సంసేవ్యా చపలాపరి వర్జినీ
అవిద్యావాస నామాయా ప్రకృతిః సర్వమోహినీ॥ 6

శక్తిః ధారణ శక్త్యైక్య చిదచిచ్ఛక్తి యోగినీ
బ్రహ్మ విష్ణు మహేశాది జాతవ్యార్థ విశేషణా॥ 7
నాభౌ వహ్ని శిఖాకారా లలాటే చంద్ర సన్నిభా
బ్రహ్మాండ గర్భిణీ బాలా సప్తావరణ దేవతా॥ 8
వైరాజోత్తమ సామ్రాజ్యా కుమార కుశలోదయా
వారణాసీ వాసలభ్యా ఆర్యావర్త జనస్తుతా॥ 9
జగదుత్పత్తి సంస్థాన సంహార త్రయకారణా
త్వమంబా విష్ణు సర్వస్వా మహేశ్వరీ నమో నమః॥ 10
సర్వలోకానాం జననీ పుణ్యమూర్తి పాతుమాం సదా
భూమీ నీళాది సంసేవ్యా స్వామి చిత్తానువర్తినీ॥ 11
పద్మా పద్మాలయా పద్మీ పూర్ణకుంభాభి షేచితా
మంగళామంగళానాం చ దేవతానాం చ దేవతా॥ 12
ఉత్తమానాం ఉత్తమోశ్రేయః పరమామృతాయచ
ధనధాన్యాభివృద్ధి కృత్ సార్వభౌమ సుఖోచ్ఛ్రయా॥ 13

ఆందోళికాది సౌభాగ్యమత్తేభాది మహోదయా
పుత్ర పౌత్రాభివృద్ధించ విద్యాభోగ బలాధికా॥ 14

ఆయురారోగ్య సంపత్త్యై అష్టైశ్వర్య విధాయచ
సూక్ష్మాత్ సూక్ష్మతరాంగతయే పరమేశ విభూతిభిః॥ 15

సదాయాపాంగ సందత్త బ్రహ్మేంద్రాది పదస్థితా
అవ్యాహత మహాభాగ్యా అక్షోభ్య విక్రమాయచ॥ 16

వేదానాం సమన్వయాచ వేదానా మవిరోధినే
నిశ్శ్రేయ పద ప్రాప్తిః అసాధ్య పరాజయా॥ 17

శ్రీమంత్రరాజ రాజ్ఞీ శ్రీవిద్యా క్షేమకారిణీ
శ్రీం బీజ జపసంతుష్టా ఐం హ్రీం శ్రీం బీజ పాలికాః॥ 18
ప్రవృత్తి మార్గ సులభా విష్ణుః ప్రథమ కింకరీ
క్లీంకారార్థ సవిత్ర్యై సౌమంగళ్యాధి దేవతా॥ 19
శ్రీ షోడశాక్షరీ విద్యా శ్రీయంత్రపుర వాసినీ
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే॥ 20
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నరప్రియా
ఏవం సంతానలక్ష్మీశ్చ నామ్నామష్టోత్తర శతం॥ 21

ఓం శ్శాంతి శ్శాంతి శాంతిః

## బాలారూపిణి - సంతానలక్ష్మీ మాత

ఎట్లానిన్నెత్తుకొందునమ్మా! మహాలక్ష్మీ తల్లీ
ఎలానిన్నెత్తూ కొందునామ్మా!
ఆట్లాడే బాలవు నీవూ, యిట్లా రమ్మని పిలిచీ
కొట్లాధనము యిచ్చిన తల్లీ ఎట్లా నిన్నెత్తుకొందునమ్మా ! మహాలక్ష్మీ
పసిబాలవైతే ఎత్తుకొందూ నీ నామస్మరణా విసుగు
లేకుండా చేసితే ముక్తిని బొందూ ఎట్లానిన్నెత్తుకొందునమ్మా ! మహాలక్ష్మీ
ముసిమూసీ నగవులతోనూ పసిబాలరూపున్నాదీ
వసుధా బిరబిర అంగళ్ళూ గాచి అసమాన ఘనురాలైయుంటివి
ఎట్లా నిన్నెత్తుకొందునమ్మా! మహాలక్ష్మీ తల్లీ !
ఏలా నిన్నెత్తుకొందునమ్మా!
వెయ్యి నామములా కల్పవల్లీ వేమారు మాకు మాకూ
సాయామై వుండుము తల్లీ ! ఎట్లా నిన్నెత్తుకుందునేనమ్మా! మహాలక్ష్మీ
సామ్రాజ్యా గురుడూ మాపై వేమారూకరుణాలుంచినా
ఆయుష్య వృద్ధులు అయిశ్వర్యములూ సాయమూ సంపదాలీయుము తల్లీ
ఎట్లా నిన్నెత్తుకుందునమ్మా ! మహాలక్ష్మీ.....

సురులూ అసురూలూ మిమ్ము గొలువాగానూ సురలందరూ కూడీ
చెలరేగి యిరుగడ లందెలు మ్రోయా ఎట్లా నిన్నెత్తుకుందునమ్మా! మహాలక్ష్మీ
కాంతాలందరూ గూడి కైవారమివ్వాగానే సరిగమపదయనీ
సమ్మోదమనుచునూ దురితముదొక్కుచూ ఎట్లానిన్నెత్తుకుందనమ్మా! మహాలక్ష్మీ
చల్లానీ రూపముతోనే వెలసీ మేమున్నాచోటా
పల్లవా పాణిని పిలిచిన పలికే తల్లీ ఎట్లా నిన్నెత్తుకుందునమ్మా ! మహాలక్ష్మీ
మూడు లోకములా జనులకు ఎల్లా సంపదలివ్వగానే
తల్లీ నీవూ మాకు సంపదలిస్తే తరవాత నిన్నెత్తుకొందూనమ్మా !
ఎట్లా నిన్నెత్తుకొందునమ్మ! మహాలక్ష్మీ తల్లీ
ఏలా నిన్నెత్తుకొందునమ్మ!

## శ్రీ సిద్ధలక్ష్మీ స్తోత్రం

ఇది దారిద్ర్య నాశక సిద్ధ లక్ష్మీ స్తోత్రం. శివుడు విష్ణుపత్ని లక్ష్మీదేవి ప్రభావాన్ని వర్ణించి చెప్పే ఈ స్తోత్రం బ్రహ్మాండ పురాణంలో చెప్పబడింది. ఈశ్వర విష్ణు సంవాద సందర్భంలో ఆవిర్భవించిన ఈ స్తోత్రం ఎంతో మహిమాన్వితమైనది. భక్తి శ్రద్ధలతో పఠించిన వారికి సమస్త బాధలు, దారిద్ర్యం తొలగిపోయి సకలైశ్వర్యాలు శుభాలు కలుగుతాయి.

బ్రాహ్మీచ వైష్ణవీం భద్రాం షడ్భుజాంచ చతుర్ముఖమ్
త్రినేత్రాంచ త్రిశూలాంచ పద్మ చక్రగదా ధరామ్॥ 1

పీతాంబరధరాం దేవీం నానాలంకార భూషితామ్
తేజః పుంజ ధరాం శ్రేష్ఠాం ధ్యాయే ద్బాల కుమారికామ్॥ 2

ఓంకారం లక్ష్మీరూపేణ విష్ణుర్హృదయ మవ్యయమ్
విష్ణుమానందమధ్యస్థం హ్రీంకార బీజరూపిణీ॥ 3

ఓం క్లీం అమృతానందభద్రే సద్యః ఆనందదాయినీ
ఓం శ్రీం దైత్య భక్షరదాం శక్తిమాలినీ శతృమర్దినీ॥ 4

తేజః ప్రకాశినీ దేవీ వరదా శుభకారిణీ
బ్రాహ్మీచ వైష్ణవీ భద్రా కాళికా రక్తశాంభవీ॥ 5

ఆకార బ్రహ్మరూపేణ ఓంకారం విష్ణుమవ్యయమ్
సిద్ధిలక్ష్మీ పరాలక్ష్మీ మహాలక్ష్మీ నమోస్తుతే ॥ 6
సూర్యకోటి ప్రతీకాశం చంద్రకోటి సమప్రభమ్
తన్మధ్యేనికరే సూక్ష్మం బ్రహ్మరూప వ్యవస్థితమ్॥ 7
ఓంకారం పరమానందం క్రియతే సుఖసంపదా
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్ధ సాధికే॥ 8



ప్రథమే త్ర్యయంబికా గౌరీ ద్వితీయే వైష్ణవీతథా
తృతీయే కమలా ప్రోక్తా చతుర్థం సురసుందరీ॥ 9

పంచమీ విష్ణుపత్నీచ షష్ఠే చ వైష్ణవీ తథా
సప్తమే చ వరాగేహా అష్టమేవరదాయినీ॥ 10

నవమే ఖడ్గత్రిశూలా దశమీ దేవిదేవతా
ఏకాదశే సిద్ధిలక్ష్మీః ద్వాదశో లలితాత్మికా॥ 11

ఏత స్తోత్రం పఠన్తస్త్వాం స్తువంతి భువిమానవాః
సర్వోపద్రవ ముక్తాస్తే నాత్ర కార్యావిచారణా॥ 12

ఏకమాసం ద్విమాసం వా త్రిమాసం వా చతుర్థకమ్
పంచమాసం చ షణ్మాసం త్రికాలం యః పఠేన్నరః॥ 13

బ్రాహ్మణాః క్లేశతో దుఃఖ దారిద్రాభయపీడితః
జన్మాంతర సహస్రేషు ముచ్యన్తే సర్వక్లేశతః॥ 14

అలక్ష్మీర్లభతే లక్ష్మీం, అపుత్రః పుత్ర ముత్తమమ్
ధన్యం యశస్యమాయుష్యం వహ్నిచౌర భయేషుచ॥ 15

శాకినీ భూతభేతాళ సర్వవ్యాధి నిపాతకే
రాజద్వారే మహాఘోరే సంగ్రామేరిపుసంకటే॥ 16

సభాస్థానే శ్మశానం చ కారాగృహారిబంధనే
అశేష భయసంప్రాప్తౌ సిద్ధి లక్ష్మీం జపేన్నరః॥ 17

ఈశ్వరేణకృతం స్తోత్రం ప్రాణినాంహితకారణమ్
స్తువంతి బ్రాహ్మణా నిత్యం దారిద్ర్య నచవర్ధతే॥ 18

యాశ్రీః పద్మవనే కదంబశిఖరే రాజగృహే కుంజరే
శ్వేతే చాశ్వయుతే వృషే చ యుగళే యజ్ఞే చ యూపస్థితే
శంఖే దేవకులే నరేంద్ర భవనే గంగాతటే గోకులేసా
శ్రీస్తిష్ఠతు సర్వదా మమగృహే భూయాత్సదానిశ్చలా॥ 19

**యిది శ్రీ బ్రహ్మాండ పురాణే ఈశ్వర విష్ణు సంవాదే దారిద్ర నాశన సిద్ధలక్ష్మీం స్తోత్రం సంపూర్ణం.**

## సంతాన లక్ష్మీ యంత్రము





### మూల మంత్ర ధ్యాన శ్లోకము

ఓం నమో భగవతీ సంతానలక్ష్మీ ఓం హ్రీం శ్రీం
సౌః సౌః శ్రీం హ్రీం మమ గృహే సంతాన రూప ధనం
ఖేలయ ఖేలయ, ధన కనక వస్తు రూపేణ ఆహోదం
ఆనయ ఆనయ మమ సకల భోగాన్ ప్రాపయ ప్రాపయ స్వాహా -
**108** సార్లు కుంకుమార్చన - జపము - హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.





### శ్రీ సంతానలక్ష్మీ అష్టోత్తర శతనామావళి



ఓం రత్నాకర సముద్భూతాయై నమః
ఓం బ్రహ్మమన్మధ నమః
మాతృకాయై నమః
ఓం సృష్టిచక్రపరిభ్రమణ్యై నమః
ఓం నిత్యహరితాయై నమః
ఓం శ్రీకర్యై నమః
ఓం శ్రీమత్యై నమః
ఓం శ్రీదైవ్యై నమః
ఓం సంతానదాయిన్యై నమః
ఓం శ్రీకాంతాయై నమః 10
ఓం శ్రీకళాయై నమః
ఓం శుభ్రాయై నమః
ఓం కర్మనిర్మూలకారిణ్యై నమః
ఓం శ్రీవిద్యాయై నమః
ఓం శార్వర్యై నమః
ఓం జంభాసురనిబర్హిణ్యై నమః
ఓం వ్యోమకేశాఖిల ప్రాణయై నమః
ఓం పంచకోశవిలక్షణాయై నమః
ఓం పంచకోశాత్మికాయై నమః
ఓం పత్న్యై నమః 20
ఓం పంచబ్రహ్మాత్మికాయై నమః
ఓం శివాయై నమః
ఓం దేవక్యై నమః
ఓం దేవసంకాశాయై నమః
ఓం వార్ధిజాయై నమః
ఓం కరుణాకరాయై నమః
ఓం శర్వర్యై నమః
ఓం సర్వసంపన్నాయై నమః
ఓం సర్వపాపప్రభంజిన్యై నమః
ఓం గంభీరాయై నమః 30
ఓం గహనాయై నమః
ఓం గుహ్యాయై నమః
ఓం యోనిలింగార్ధధారిణ్యై నమః
ఓం శేషవాసుకిసంసేవ్యాయై నమః
ఓం చపలాయై నమః
ఓం వరవర్ణిన్యై నమః
ఓం అవిద్యాయ్యై నమః
ఓం వాసనాయై నమః
ఓం మాయాయై నమః
ఓం ప్రకృత్యై నమః 40
ఓం సర్వమోహిన్యై నమః
ఓం శక్త్యై నమః

ఓం ధారణశక్త్యై నమః
ఓం చిదచిచ్ఛక్త్యై నమః
ఓం యోగిన్యై నమః
ఓం బ్రహ్మవిష్ణుమహేశాది
జాతవ్యార్థవిశేషణాయై నమః
ఓం నాభౌవహ్నిశిఖాకార్థాయై నమః
ఓం లలాటే చంద్రసన్నిభాయై నమః
ఓం బ్రహ్మాండగర్భిణ్యై నమః
ఓం బాలాయై నమః 50
ఓం సప్తావరణదేవతాయై నమః
ఓం వైరాజోత్తమ సామ్రాజ్యాయై నమః
ఓం కుమారకుశలోదయాయై నమః
ఓం వారణాసీవాసలభ్యాయై నమః
ఓం ఆర్యావర్త జనస్తుత్యాయై నమః
ఓం జగదుత్పత్తిసంస్థాన సంహారత్రయకారణ్యైనమః
ఓం అంబాయై నమః
ఓం విష్ణుసర్వస్వాయై నమః
ఓం మహేశ్వర్యై నమః
ఓం సర్వలోకానాంజనన్యై నమః 60
ఓం పుణ్యమూర్త్యై నమః
ఓం భూమినీళాది సంసేవ్యాయై నమః
ఓం స్వామిచిత్తానువర్తిన్యై నమః
ఓం పద్మాయై నమః
ఓం పద్మాలయాయై నమః
ఓం పద్మిన్యై నమః
ఓం పూర్ణకుంభాభిషేచితాయై నమః
ఓం మంగళానాంమంగళాయై నమః
ఓం దేవతానాం దేవతాయై నమః
ఓం ఉత్తమానాముత్తమాయై నమః 70
ఓం శ్రేయసే నమః
ఓం పరమామృతాయై నమః
ఓం ధనధాన్యాభివృద్ధికర్త్యై నమః
ఓం సార్వభౌమసుఖోచ్ఛ్రయాయై నమః
ఓం ఆందోళికాది సౌభాగ్యాయై నమః
ఓం మత్తేభాది మహోదయాయై నమః
ఓం పుత్రపౌత్రాభివృద్ధయే నమః
ఓం విద్యాభోగబలాధికాయై నమః
ఓం ఆయురారోగ్యసంపత్త్యై నమః
ఓం అష్ట ఐశ్వర్యాయై నమః 80
ఓం సూక్ష్మాత్ సూక్ష్మతరాగతయే నమః
ఓం పరమేశవిభూత్యై నమః
ఓం సదయాపాంగసందత్త
బ్రహ్మేంద్రాది పదస్థితయే నమః
ఓం అవ్యాహత మహాభాగ్యాయై నమః
ఓం అక్షోభ్య విక్రమాయై నమః
ఓం వేదానాం సమన్వయాయై నమః
ఓం వేదానా మవిరోధాయై నమః
ఓం నిశ్రేయ పదప్రాప్తి
అసాధ్యపరాజయై నమః
ఓం శ్రీమంత్రరాజరాజ్ఞ్యై నమః
ఓం శ్రీవిద్యాయై నమః 90
ఓం క్షేమకారిణ్యై నమః
ఓం శ్రీం బీజజపసంతుష్టాయై నమః
ఓం ఐం హ్రీం శ్రీం బీజపాలికాయైనమః
ఓం ప్రవృత్తిమార్గసులభాయై నమః
ఓం విష్ణుప్రథమకింకర్త్యై నమః
ఓం క్లీంకారార్థసవిత్ర్యై నమః
ఓం సౌమంగళ్యాధి దేవతాయై నమః
ఓం శ్రీషోడశాక్షరీ విద్యాయై నమః
ఓం శ్రీయంత్రపురవాసిన్యై నమః
ఓం సర్వమంగళమాంగల్యాయైనమః100
ఓం శివాయై నమః
ఓం సర్వార్థసాధికాయై నమః
ఓం శరణ్యాయై నమః
ఓం త్ర్యంబికాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం నారాయణ్యై నమః
ఓం నరప్రియాయై నమః
ఓం శ్రీసంతానలక్ష్మ్యై నమః 108



## 9. శ్రీవిజయలక్ష్మీదేవి వైభము

### శ్రీ విజయలక్ష్మీదేవి ప్రశస్తి

శ్లో ॥ జయకమలాసని సద్గతిదాయని జ్ఞాన వికాసిని గానమయే
అనుదినమర్చిత కుంకుమ భూసర భూషిత వాసిత వాద్యనుతే
కాంచన ధారా స్తుతి వైభవ వందిత శంకర దేశిక మాన్యపదే
జయజయహే మధుసూదనకామిని విజయలక్ష్మీ పరిపాలయమాం ॥

శ్రీమన్మహాలక్ష్మీదేవి ధరించిన అష్టలక్ష్మీ అవతారాలలో ఆరవది అయిన శ్రీ విజయలక్ష్మీ దేవి అవతారం ఎంతో ముఖ్యమైనది. విజయాన్ని చేకూర్చే ఈ తల్లి అనుగ్రహం లేకుండా ఎవరూ ఏ పనీ సాధించలేదు. తాను యిచ్చిన సామర్థ్యాలని, అవి దేహబలం కావచ్చు, బుద్ధిబలం కావచ్చు, మనోధైర్యం కావచ్చు తన భక్తుడు ఎంత వరకు వాటిని సద్వినియోగించుకున్నాడో పరీక్షించి సరైన సమయంలో విజయం సిద్ధించేలా అనుగ్రహిస్తుంది శ్రీవిజయలక్ష్మీదేవి.

### విజయం అంటే ఏమిటి?

జయం, విజయం అనే రెండు పదాలగురించి స్థూలంగా ఆలోచిస్తే లోక వ్యవహారాలలో వాటిని ఒకే అర్థంలో ఉపయోగించటం జరుగుతోంది అని తెలుస్తుంది. 'వి' అనే ఒక విశేషాన్ని జయానికి ముందు చేరిస్తే అది విజయం అవుతుంది "వి"అంటే విశేషమైన, విశిష్టమైన, అన్ని చోట్లా అనే అర్థాలు చెప్పబడ్డాయి. విజయం అంటే సర్వత్రా జయం అని అర్థం మనం చేసిన పని ఫలితాన్నియిస్తే దాన్ని జయం అంటాం. ఉదాహరణకి పరీక్ష రాసాక మంచి మార్కులతో పాసయితే అది జయం. కాని ఆ పరీక్ష రాయటానికి ఏదో ఒక ఉద్దేశం వుంటుంది కదా! ఏదో ఉద్యోగం రావాలనో, పై చదువుకి సీటు రావాలనో, ప్రమోషన్ కావాలనో కదా పరీక్ష రాస్తాం. ఆ పరీక్షలో ఉత్తీర్ణులమవటంతో పాటు ఏ ఉద్దేశంతో ఆ పరీక్ష రాసామో అది కూడా నెరవేరితే అంటే అనుకున్న ఉద్యోగమో, అనుకున్న ప్రమోషనో కాలేజీ సీటో లభిస్తే అది పరిపూర్ణమైన జయం. దాన్నే విజయం అని అంటారు. అనుకున్న ఫలితం పరిపూర్ణంగా పొందటమే విజయం అంటే. యీ విధమైన విజయాన్ని మనకి ప్రసాదించే తల్లి శ్రీ విజయలక్ష్మీదేవి. అందువల్ల విజయం అంటే అది సంఘర్షణకి, యుద్ధానికి సంబంధించిన పదం మాత్రమే కాదని అన్ని రకాల ప్రయత్నాలకి సంబంధించినదని తెలుసుకోవటం అవసరం. విజయం అనేది మనం చేసే కృషి మీద ఏకాగ్రత మీద ఆధారపడి వుంటుంది అని మనందరికీ తెలుసు. మరిదాని కోసం వేరే ఒక అధిష్టాన దేవత అవసరం ఏమిటి? అనే సందేహం కలుగుతుంది. ఏ పనైనా మనం ఒక ప్రత్యేక ఫలితాన్ని ఆశించి చేయటం సహజం. చేసిన పని సఫలం అయి అనుకున్న ఫలితం వస్తేనే మనం చేసిన పనికి ఒక

అర్థం, సార్థకత్వం లభిస్తుంది. పనిని పరిపూర్ణంగా చేసినంత మాత్రాన తప్పక ఫలితం లభిస్తుందని ఎవరూ చెప్పలేరు. మానవ ప్రయత్నానికి దైవాను గ్రహంతోడయినప్పుడే విజయం సాధించటం జరుగుతుంది. మానవ ప్రయత్నం చేయాలంటే అందుకు అవసరమైన దేహ శక్తి, బుద్ధిశక్తి, ధైర్యశక్తి, వివేచనా శక్తి వుండాలి. ఈ శక్తులు అన్ని యిచ్చేది కూడా ఆ శ్రీమాతే. ఈ శక్తులన్నీ మానవుడు సరిగ్గా వినియోగించగలిగిన నాడు విజయాన్ని కూడా ఆ తల్లే మనకి సమకూర్చి పెడుతుంది.

## శ్రీవిజయలక్ష్మీదేవి స్వరూప స్వభావాలు

శ్లో॥ అష్టబాహుయుధాందేవీం సింహాసనవరస్థితాం
సుహాసినీం సుకేశీంచ కిరీట ముకుటోజ్జ్వలాం ॥
శ్యామాంగీం కోమలాకారం సర్వాభరణ భూషితాం
ఖడ్గం పాశం గదాచక్రం అభయం సవ్యహస్తకే ॥
కేతకం అంకుశం శంఖం వరదం వామహస్తకే
రాజరూప ధరాంశక్తిం ప్రభుం సౌందర్య శోభితాం ॥

విజయలక్ష్మీదేవి అష్టభుజమూర్తి. ఈ తల్లి ఎర్రని వస్త్రం ధరించి వుంటుంది. శంఖం, చక్రం, ధనుర్బాణాలు, ఖడ్గం, గద, మొదలైన ఆయుధాలను ఆరు చేతులలో ధరించి వుండి రెండు వరద హస్తాలతో భక్తులను అనుగ్రహిస్తూ వుంటుంది. సర్వాభరణ భూషిత అయిన ఈ తల్లి మణిమయ కిరీటధారిణిగా దర్శనమిస్తుంది. ఈ తల్లిని ఎర్రని పూలు, ఎర్రని వస్త్రములు, ఎర్రని అక్షతలు, ఎర్ర చందనంతో పూజ చేయాలి. ఎరుపు రంగు స్పర్థకి, సంఘర్షణకి సూచకం. సృష్టిలోని సమస్త తంత్ర విద్యలకీ అధిష్టాన దేవత శ్రీ విజయలక్ష్మీ మాత. అమ్మవారిని అర్చించడానికి మంత్ర, తంత్ర, యంత్ర మార్గాలు శ్రేష్టమయినవి. మంత్రం కంటే ఎక్కువ శక్తి వంతమైనది, తంత్ర సాధన. అనాది కాలం నుంచీ తంత్ర సాధన మన భారతదేశంలో అమ్మవారి ఆరాధనలో ఎంతో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించి వుంది. బెంగాల్‌లో ఈనాటికీ తంత్రసాధన అమలులో వుంది. అస్సాంలోని కామాఖ్యపీఠం, ఒరిస్సాలోని జగన్నాధ పురీ, మన రాష్ట్రంలోని శ్రీశైలం అనాది కాలం నుంచీ తంత్ర సాధనకు ప్రసిద్ధికెక్కినవి. సాధకుని చిత్తశుద్ధి, సాధన యొక్క పరమార్థం మంచిదయితే ఆ తంత్ర సాధన లోక కల్యాణకారక మవుతుంది. అలా కాక తంత్ర సాధన యొక్క లక్ష్యం దుర్మార్గమయినదయితే దానిని క్షుద్ర సాధన అనిఅంటారు. సర్వతంత్రాలకి మూలస్థానమయిన శ్రీ విజయ లక్ష్మీ మాతని 'సర్వతంత్ర ప్రసూతికాయై' అని అర్చిస్తారు. యుద్ధభూమిలో ఈ తల్లి చూపే పరాక్రమానికి ఎదురునిల్చి ఎవరూ నిలబడలేరు అందువల్లనే ఈమెని 'అపరాజిత'గా పిలుస్తారు. ఈ తల్లి అనుగ్రహం



వున్న వారికి రాజయోగం వుంటుం దని విశ్వసిస్తారు. అందువల్ల ఉన్నత పదవులు ఆశించే వారికి ఈ తల్లి అనుగ్రహం అత్యవసరం. "రాజద్వారే, రాజగృహే సర్వత్ర విజయీభవేత్" ఆశీర్వచన వాక్యం ఈ విజయలక్ష్మీదేవి అనుగ్రహం వల్లనే సిద్ధిస్తుంది.

శ్లో॥ కుమార విఘ్నరాజ పూజితాంఘ్రి దివ్య పంకజం
హిమాంశు సన్నిభాననమ్ సమస్త సౌఖ్యదాయినీం
రమేశ పద్మ గర్భ చంద్రశేఖరాభిర్యుతామ్
నమామి చారుహాసినీం భజామి వహ్ని వాసినీం॥

యిది శ్రీ విజయలక్ష్మీ దేవి స్తోత్రమ్. బ్రహ్మాది దేవతల చేత సదా పూజింపబడే ఆ తల్లి యుద్ధ మధ్యస్థితగా వర్ణించబడింది. యుద్ధం అంటే శస్త్రాస్త్రాలతో చేసేది మాత్రమే కాదు. నిత్యం ఎన్నో సమస్యలని ఎదుర్కొంటూ వాటితో యుద్ధం చేస్తూనే వున్నాం మనం. అటువంటి సమయంలో ఆ తల్లి విజయలక్ష్మీదేవిని తలుచుకుని భక్తి శ్రద్ధలతో వేడుకుంటే తప్పక కరుణించి మనకి తరుణోపాయం చూపుతుంది. రణరంగంలో చండీరూపిణిగా ఈ తల్లి చక్రాయుధధారిణి అయి గరుడ వాహినిగా శత్రుసైన్యాలను క్షణమాత్రంలో రూపుమాపుతుంది.

### జయం - విజయం

జయ విజయులు లక్ష్మీనారాయణులు నివసించే వైకుంఠ ద్వారం చెంత కాపలా కాసే కావలివారు. విజయం ఆ వైకుంఠలక్ష్మీ దేవి కనుసన్నలలో మెలగుతూ వుంటుంది. కాబట్టి మనం ఎల్లప్పుడు ఆ తల్లి లక్ష్మీదేవిని స్థిరమైన భక్తి విశ్వాసాలతో విజయం యివ్వవలసిందిగా ప్రార్థించుకోవాలి. ఆ విజయలక్ష్మీదేవి అనుగ్రహం మన మీద వుంటే మనం తలచిన కార్యాలన్నీ విజయవంత మవుతాయి. జయం, విజయం అనే మాటల్ని సాధారణంగా ఒకే అర్థంలో వాడేస్తూ వుంటాం. జయం అంటే పరీక్ష పాసవటం అయితే విజయం అంటే పరీక్ష పాసయి వుద్యోగం రావటమో, ఎమ్‌సెట్‌లో మంచి ర్యాంకు వచ్చి మంచి కాలేజీలో సీటు రావటం అని అర్థం. సర్వే సర్వత్రా జయాన్ని విజయం అంటారు. పరీక్షలకి వెళ్ళే విద్యార్థులు, ఇంటర్వ్యూలకి వెళ్ళే యువకులూ శ్రీ విజయలక్ష్మీ దేవి బీజాక్షర జపం 'ఓం క్లీం' అనే బీజాక్షరాలను రోజుకి 108 సార్లు జపిస్తే తప్పకుండా విజయం సాధించి మంచి ఫలితాలను పొందగలుగుతారు.

## శ్రీ విజయలక్ష్మీదేవి మాహాత్మ్యము

శ్రీవిజయలక్ష్మీదేవి అనుగ్రహ కటాక్షాలు ఉంటే ఎంతటి సంకట పరిస్థితుల నైనా ధైర్యంగా ఎదుర్కొని చివరికి అపూర్వ విజయాలను సాధించవచ్చు. తనని భక్తి విశ్వాసాలతో కొలిచే వారి సమస్తబాధ్యతలనీ వహించి వారికి విజయం చేకూరుస్తుంది ఈ తల్లి. శ్రీవిజయలక్ష్మీమాత అనుగ్రహానికి సంబంధించిన ఒక కథ మనకి పురాణాలలో కన్పిస్తుంది. పూర్వం మనోరమ అనే సుక్షత్రియ వంశానికి చెందిన ఒక వనిత విధివశాన భర్తను, సర్వసంపదలను పోగొట్టుకుని తప్పనిసరి పరిస్థితులలో తన కుమారుడైన సుదర్శనుడితో సహా గంగాతీరంలోని అడవులలోకి చేరుకుంది. అడవులలో నానా కష్టాలు పడి చివరికి భారద్వాజ ఋష్యాశ్రమానికి చేరింది. తన దురదృష్టానికి ఎంతో కుమిలి పోతూ బాధపడే 'మనోరమ'ని చూసి భరద్వాజునికి జాలి కలిగింది. తన తపశ్శక్తిద్వారా వారి కష్టాలకి తరుణోపాయం ఏమిటి? అని ఆలోచించాడు. మనోరమని ఆమె పుత్రుడు సుదర్శనుడిని రావించి వారికి ధైర్యం చెప్పి సమస్త విజయాలను చేకూర్చే శ్రీవిజయలక్ష్మీదేవి బీజాక్షరాలను సుదర్శనుడికి ఉపదేశించాడు. ఆ రాజకుమారుడు ఎంతో నియమనిష్ఠలతో బీజాక్షర జపం చేస్తూ శ్రీ విజయలక్ష్మీమాతని ఆరాధించసాగాడు. భరద్వాజుని ద్వారా సకల శాస్త్రాలను యుద్ధ విద్యలను కూడా నేర్చుకున్న సుదర్శనుడు యుక్తవయస్సు వచ్చేసరికి సాటిలేని వీరునిగా రూపొందాడు. క్రమంగా ఆ అడవులలోని నిషాదులను మంచి చేసుకుని వారి రాజుని మిత్రునిగా చేసుకున్నాడు. ఇంతలో కాశీరాజు తన కుమార్తె శశికళకు స్వయంవరం చాటించడంతో, ఋషి అనుమతితో, నిషాదరాజుతో కలిసి, ఆ స్వయం వరానికి వెళ్ళాడు సుదర్శనుడు. దేవీ భక్తురాలయిన రాకుమార్తె శశికళకి స్వప్నంలో దేవి కనిపించి సుదర్శనుని గురించి చెప్పి రేపటి స్వయంవరంలో అతనినే వరించమని ఆదేశిస్తుంది. దేవి మాట ప్రకారం శశికళ స్వయంవరంలో సుదర్శనుడినే వరిస్తుంది. కాని ఆసమయానికి సుదర్శనుడు మున్యాశ్రమంలో పెరుగుతున్న కారణంగా బ్రాహ్మణ వేషధారిగా వున్నాడు. తమని కాదని ఒక బ్రాహ్మణుని రాకుమార్తె వరించటం సహించలేకపోయారు స్వయం వరానికి వచ్చిన చోళ, పాంచాల, విదర్భ, కోసల, సింధు, కరూశ, మద్ర రాజులు వారు మత్సరంతో పోరుకు దిగుతారు. నిషాద రాజు స్వల్ప సైన్యం సహాయం చేయగా సుదర్శనుడు ఎంతో ధైర్యంతో అపార శత్రు సేనావాహినితో పోరుకు సిద్ధమయి విజయలక్ష్మీదేవిని ధ్యానిస్తాడు. సుదర్శనుడి నమ్మకానికి, భక్తికి సంతోషించిన విజయలక్ష్మీదేవి అనుగ్రహించింది. ఇక యుద్ధ రంగంలో ఎక్కడ చూసినా ఆ తల్లి వీరవిహారమే.

ఎర్రని చీర, ఆభరణాలు, పువ్వులు ధరించి దివ్యశోభతో గరుడ వాహినిగా సమస్త ఆయుధాలని ధరించి ఆ తల్లి స్వయంగా రణరంగంలోకి దిగింది. ఇంకేముంది క్షణాలలో శత్రుసైన్యాలన్నీ కకావికలయిపోయాయి. విజయం సుదర్శనుడిని



శ్రీ విజయలక్ష్మీదేవి మాహాత్మ్యము

వరించింది. ఈ విధంగా ఆ తల్లి సుదర్శనుడికి విజయాన్ని సంపాదించి పెట్టింది. ఆ తల్లి దయ అమోఘం కదా!

యుద్ధంలో మరణించిన కోసల రాజు స్థానంలో, అతనికి వారసులు లేని కారణంగా, విజయలక్ష్మీ దేవి సుదర్శనుడిని కోసల రాజ్యానికి రాజుగా చేసి ధర్మయుక్తంగా ప్రజారంజకంగా రాజ్యం చేయమని ఆదేశిస్తుంది. తన కుమారుడు కోసల దేశాధిపతి కావటం చూసి 'మనోరమ' ఎంతో సంతోషించింది. సుదర్శనుడు కాశీ రాకుమారి శశికళని వివాహమాడి అయోధ్య రాజధానిగా కోసల దేశాన్ని చిరకాలం ప్రజారంజకంగా పరిపాలించాడు. సదా విజయలక్ష్మీదేవిని ఆరాధిస్తూ ఎనలేని కీర్తి ప్రతిష్టలు సంపాదించాడు. తన్ను నమ్మిన వారికి ఆ తల్లి ఏవిధంగా అద్భుత విజయాలను అనుగ్రహిస్తుందో మనకి ఈ కథ ద్వారా తెలుస్తోంది. పాండవులు అజ్ఞాత వాస ప్రారంభంలో ఈ తల్లిని అర్చించి ఆమె అనుగ్రహం వల్ల నిర్విఘ్నంగా అజ్ఞాత వాసం పూర్తి చేసుకున్నారట. పాండవ మధ్యముడైన విజయుడు విజయదశమి రోజున విజయలక్ష్మీదేవి అనుగ్రహం వల్ల ఉత్తర గోగ్రహణంలో కురు వీరులను ఓడించి విజయాన్ని సాధించాడు. ఆ మాత దయకు పాత్రులయిన వారికి ఎక్కడా అపజయం వుండదు.

ఎన్ని అర్హతలున్నా, ఎన్ని ఇంటర్వ్యూలకి వెళ్ళినా సరైన ఉద్యోగం దొరకక బాధ పడే యువకు(తు)లు, ఎన్నో శక్తియుక్తులు వుండి కూడా ఉన్నతోద్యోగానికి నోచుకోని ఉద్యోగులు, పిల్లల ఉన్నతిని కళ్లారా వీక్షించి తృప్తి చెందుదామని ఆశతో ఎదురు చూసే తల్లిదండ్రులు, సర్వకార్యసిద్ధి కోసం ఆ విజయలక్ష్మీదేవిని ఆరాధిస్తే వారి వారి మనోభీష్టాలు తప్పక సిద్ధిస్తాయి. అమ్మవారిని షోడశోపచారములతో పాటు అష్టోత్తర శతనామావళితో అర్చించాలి. తమ కుటుంబ సభ్యుల అభ్యున్నతి కోసం, సర్వత్ర విజయసాధన కోసం అహరహం తపించిపోయే గృహలక్ష్ములు ఈ విజయలక్ష్మీమాతని అర్చిస్తే వారి కోరికలన్నీ తీరి వారి కుటుంబాలు సుఖ సంతోషాలతో తులతూగుతూ ఉంటాయి. నిత్యం పూజ చేయలేని వారు 'ఓం క్లీం' అనే విజయలక్ష్మీ దేవి బీజాక్షరాలను రోజుకి 108 సార్లు జపిస్తే అనుకున్న కార్యాలు వెంటనే నెరవేరతాయి. శ్రీ విజయలక్ష్మీదేవి అనుగ్రహం వల్ల భక్తులందరి మనోభీష్టాలు తీరి సుఖ శాంతులతో వర్ధిల్లెదరు గాక!

### శ్రీవిజయలక్ష్మీ దేవి మంగళ హారతి

జయ జయ హారతి జగదంబా హారతీ
మంగళా హారతీ విజయలక్ష్మీ నీకిచ్చేద మమ్మా ॥జయ జయ
పచ్చకర్పూరపు హారతులివే గొనుమా
పడతులు తెచ్చిరీ బాగుగా గైకొనుమా
మమ్ముకాపాడీ దీవించవమ్మా



మా యింటి మహాలక్ష్మీ నీవేనమ్మా ॥ జయ జయ...
నీలవేణిరో విజయలక్ష్మీ దేవి
అందరీ యింటనూ కాపాడితివమ్మా
యింటింటనూ వెలసితీవమ్మా
ఆనందముగ మా యింటికీ రావమ్మా ॥ జయ జయ...

### శ్రీ విజయలక్ష్మీ దేవి అష్టోత్తర శతనామస్తోత్రం

వీరా ఘోరాఘోరా చ విశ్వజిద్విశ్వధారిణి
విశ్వస్య వీరతామూర్తే విజయోస్తు నమోస్తుతే॥ 1
చండికా చండ రూపేశీ చాముండా చక్రధారిణీ
త్రైలోక్య జననీదేవీ త్రైలోక్య విజయోత్తమా॥ 2
జయవిజయా జయంతీ దేవీం అపరాజితా
పిప్పలా విశాలాక్షీ రక్షోఘ్నీ వృష్టికారిణీ॥ 3
దుష్ట విద్రావిణీ దేవీ సర్వోపద్రవనాశినీ
శారదా శర సంధానా సర్వశాస్త్ర స్వరూపిణీ॥ 4
యుద్ధమధ్య స్థితా దేవీ సర్వభూత ప్రభంజనీ
ఆయుద్ధా యుద్ధ రూపాచ శాంతా శాంతి స్వరూపిణీ॥ 5
చిత్రఘంటా సునందాశ్రీ మానవీ మను సంభవా
స్తంభనీ క్షోభిణీ మారీ భ్రామిణీ శత్రు మారిణీ॥ 6
మోహినీ ద్వేషిణీ వీరా అమోఘా రుద్రరూపిణీ
రుద్రైకా దశీ పుణ్యా కల్యాణీ లాభకారిణీ॥ 7
శతరుద్ర హరా హంత్రీ సర్వ సంహార కారిణీ
పురుషా పౌరుషీ తుష్టి సర్వతంత్ర ప్రసూతికా॥ 8
ఆగ్నేయా పార్థివా దేవీ వాయవ్యా వ్యోమకేతనా
సత్యజ్ఞానాత్మికా బ్రాహ్మీ బ్రాహ్మీ బ్రహ్మసనాతనీ॥ 9
కోటి బ్రహ్మాది సంసేవ్యా కోటి రుద్రాది కీర్తితా
మాతులుంగమయం ఖేట సౌవర్ణ చషకం తథా॥ 10
పద్మద్వయం పూర్ణకుంభం కీరంచ వరదాభయే
పాశం అంకుశం శంఖం చక్రం శూలం కృపాణికాం॥ 11
ధనుర్బాణౌ చాక్షమాలాం చిన్ముద్రామపి భిభ్రతీం
అష్టాదశ భుజే లక్ష్మీ మహాష్టాదశ పీఠగే॥ 12
భూమి నీళాది సంసేవ్య స్వామి చిత్తానువర్తినీ
మంగళం మంగళానాం త్వం దేవాతానాంచదేవతా॥ 13
ఉత్తమోత్తమోనాంచ త్వం శ్రేయః పరమామృతాం

ధనధాన్యాభివృద్ధిశ్చ సార్వభౌమ సుఖోచ్ఛయా ॥ 14
ఆందోళికాది సౌభాగ్యా మత్తేభాది మహోదయా
పుత్రపౌత్రాభివృద్ధిశ్చ విద్యాభోగ బలాధికా॥ 15
ఆయురారోగ్య సంపత్యష్టైశ్వర్యం త్వమేవహి
పరమేశ విభూతిశ్చ సూక్ష్మాత్ సూక్ష్మతరాం గతీం॥ 16
సదయాపాంగ సందత్తా బ్రహ్మేంద్రాది పదస్థితీం
అవ్యాహత మహాభాగ్యా త్వమేవాక్షోభ్య విక్రమాం॥ 17
సమన్వయాం వేదానాంచవేదనామ విరోధయా
నిశ్శ్రేయ సపదప్రాప్తి సాధనానాం ఫలరూపిణీ ॥ 18
రక్ష రక్ష విజయలక్ష్మీ సర్వదా దేహిమే జయం

## శ్రీ కమలాస్తోత్రం

ఇది కమలాస్తోత్రం. లక్ష్మీదేవి మహిమలను గురించి ఆ తల్లి ధరించిన అంశారూపాలను గురించి చెప్పే ఈ స్తోత్రానికి శివుడు పార్వతికి చెప్పటం జరిగింది. సకల సంపదలనీ యివ్వటంతో పాటు ఈ స్తోత్రాన్ని పఠించిన వారికి సర్వవ్యాధి నివారణ జరుగుతుందని చెప్పబడింది.

ఓంకార రూపిణీ దేవీ విశుద్ధ సత్వరూపిణీ
దేవానాం జననీం త్వం హి ప్రసన్నా భవసుందరీ॥ 1

తన్మాత్రం చైవ భూతాని తవ వక్షస్థలం స్మృతామ్
త్వమేవ వేద గమ్యా తు ప్రసన్నాభవ సుందరీ॥ 2

దేవదానవ గంధర్వ యక్ష రాక్షస కిన్నరః
స్తూయసే త్వం సదా లక్ష్మీ ప్రసన్నా భవ సుందరీ॥ 3

లోకాతీతా ద్వైతా తీతా సమస్త భూతవేష్టితా
విద్వజ్జన కీర్తితా చ ప్రసన్నా భవ సుందరీ॥ 4

పరిపూర్ణా సదా లక్ష్మీ త్రాతీ తు శరణార్థిషు
విశ్వాద్యా విశ్వకత్రీంచ ప్రసన్నా భవ సుందరీ॥ 5

బ్రహ్మరూపా చ సావిత్రీ త్వద్దీ ప్త్యా భాసతే జగత్
విశ్వరూపా వరేణ్యా చ ప్రసన్నా భవ సుందరీ॥ 6

క్షిత్యప్తేజో మరుద్వ్యోమ పంచభూత స్వరూపిణీ
బంధాదేః కారణం త్వ హి ప్రసన్నా భవ సుందరీ॥ 7

మహేశేత్వం హేమవతీ కమలా కేశవే పిచ
బ్రహ్మణః ప్రేయసీ త్వం హి ప్రసన్నా భవసుందరీ॥ 8



చండీ దుర్గాకాళికాచ కౌశికీ సిద్ధి రూపిణీ
యోగినీ యోగ గమ్యాచ ప్రసన్నా భవ సుందరీ॥ 9

బాల్యేచ బాలికా త్వం హి యౌవనే యువతీతిచ
స్థవిరే బృంద రూపాచ ప్రసన్నా భవ సుందరీ॥ 10

గుణమయీ గుణాతీతా ఆద్యావిద్యా సనాతనీ
మహత్తత్వాది సంయుక్తా ప్రసన్నా భవ సుందరీ॥ 11

తపస్వినీ తపసిద్ధి స్సర్గసిద్ధోస్తదర్థిషు
చిన్మయీ ప్రకృతిః త్వంతు ప్రసన్నా భవ సుందరీ॥ 12

త్వమాది ర్జగతాం దేవి త్వమేవ స్థితికారణమ్
త్వమన్తే నిధన స్థానం స్వేచ్ఛాచారా త్వమే వహి॥ 13

చరాచరాణాం భూతానాం బహిరన్తస్త్వమే వహి
వ్యాప్యవ్యాపక రూపేణ త్వం భాసి భక్త వత్సలే॥ 14

త్వన్మాయయా హృతజ్ఞానా నష్టాత్మానో విచేతసః
గతాగతం ప్రపద్యంతే పాపపుణ్య వశాత్సదా॥ 15

తావ స్సత్యం జగద్భాతి శుక్తికార జతం యధా
యావత్ర జ్ఞాయతే జ్ఞానం చేతసా నాన్యగామినీ॥ 16

త్వజ్ఞానాత్తు సదా యుక్తః పుత్రదార గృహాదిషు
రమంతే విషయాన్సర్వానంతే దుఃఖ ప్రదాన్ ధ్రువమ్॥ 17

త్వదాజ్ఞయా తు దేవేశీ గగనే సూర్యమండలమ్
చంద్రశ్చ భ్రమతే నిత్యం ప్రసన్నా భవ సుందరీ॥ 18

బ్రహ్మేశవిష్ణు జననీ బ్రహ్మాఖ్యా బ్రహ్మ సంశ్రయా
వ్యక్తా వ్యక్త చ దేవేశీ ప్రసన్నా భవసుందరీ॥ 19

అచలా సర్వగా త్వం హి మాయా తీతా మహేశ్వరీ
శివాత్మా శాశ్వతా నిత్యా ప్రసన్నా భవ సుందరీ॥ 20

సర్వకార్య నియంత్రీ చ సర్వభూత హితేశ్వరీ
అనంతా నిష్కలా త్వం హి ప్రసన్నాభవసుందరీ॥ 21

సర్వేశ్వరీ సర్వవంద్యా అచింత్యా పరమాత్మికా
భుక్తి ముక్తి ప్రదాత్వం హి ప్రసన్నా భవసుందరీ॥ 22

బ్రహ్మాణీ బ్రహ్మలోకేత్వం వైకుంఠే సర్వమంగళా
ఇంద్రాణి అమరావత్యా మంబికా వరుణాలయే ॥ 23

యమాలయే కాలరూపా కుబేర భవనే శుభా
మహానందాగ్ని కోణే చ ప్రసన్నా భవ సుందరీ॥ 24

నైరుత్యాం రక్తదంతాత్వం వాయవ్యాం మృగవాహినీ
పాతాళే వైష్ణవీరూపా ప్రసన్నా భవ సుందరీ॥ 25

సురసాత్వం మణిద్వీపే ఈశాన్యాం శూలధారిణీ
భద్రకాళీ చ లంకాయాం ప్రసన్నా భవ సుందరీ॥ 26

రామేశ్వరీ సేతుబంధే సింహళే దేవమోహినీ
విమలాత్వం చ శ్రీక్షేత్రే ప్రసన్నా భవసుందరీ॥ 27

కాళికాత్వం కాళీఘాటే కామాఖ్యా నీలపర్వత
విరజా అంగదేశేత్వం ప్రసన్నా భవ సుందరీ॥ 28

వారణస్యామన్నపూర్ణా అయోధ్యాయాం మహేశ్వరీ
గయాసురి గయా ధామ్ని ప్రసన్నా భవ సుందరీ॥ 29

భద్రకాళీ కురుక్షేత్రే త్వం చ కాత్యాయినీ వ్రజే
మహామాయా ద్వారకాయాం ప్రసన్నా భవ సుందరీ॥ 30

క్షుధాత్వం సర్వజీవానాం వేలా చ సాగర స్వహి
మహేశ్వరీ మధు రాయాం చ ప్రసన్నా భవ సుందరీ॥ 31

రామస్య జానకీ త్వంచ శివస్య మనమోహినీ
దక్షస్య దుహితా చైవ ప్రసన్నా భవ సుందరీ॥ 32

విష్ణు భక్తి ప్రదాంత్వం చ కంసాసుర వినాశినీ
రావణ నాశినాం చైవ ప్రసన్నా భవ సుందరీ॥ 33

లక్ష్మీ స్తోత్ర మిదం పుణ్యం యఃపఠేద్భక్తి సంయుతః
సర్వజ్వరభయం నాశ్యే సర్వవ్యాధినివారణమ్॥ 34

పఠనాదపి స్తోత్రస్య కింన సిద్ధ్యంతి భూతలే
తస్మాస్తోత్ర వరం ప్రోక్తం సత్యం సత్యం హి పార్వతీ॥ 35

ఇదంస్తోత్రం మహాపుణ్యమాపదుద్ధారకారణమ్
త్రిసంధ్యమేకసంధ్యం వాయః పఠేస్సతతం నరః॥ 36

ముచ్యతే సర్వపాపేభ్యోం తథాతు సర్వసంకటాం
ముచ్యతే నాత్ర సందేహో భువి స్వర్గే రసాతలే ॥ 37







## విజయ లక్ష్మీ యంత్రము

### మూల మంత్ర ధ్యాన శ్లోకము

ఓం నమో భగవతీ విజయలక్ష్మీ ఓం శ్రీం హ్రీం క్లీం
క్లీం శ్రీం హ్రీం మమ గృహే, వ్యాపారే, ఉద్యోగే
వ్యవహారే చ విజయ స్వరూప లక్ష్మీం ప్రాపయ
ప్రాపయ ధనాదికం ప్రాప్తయ ప్రాప్తయ స్వాహా -
108 సార్లు కుంకుమార్చన - జపము - హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ విజయలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ఓం శ్రీ వీరాయై నమః
ఓం ఘోరాయై నమః
ఓం అఘోరాయై నమః
ఓం విశ్వజితే నమః
ఓం విశ్వధారిణ్యై నమః
ఓం విశ్వస్య వీరతామూర్త్యై నమః
ఓం విజయాయై నమః
ఓం చండికాయై నమః
ఓం చండరూపిణ్యై నమః
ఓం చాముండాయై నమః 10
ఓం చక్రధారిణ్యైః నమః
ఓం త్రైలోక్య జనన్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం త్రైలోక్యవిజయోత్తమాయై నమః
ఓం జయాయై నమః
ఓం విజయాయై నమః
ఓం జయంత్యై నమః
ఓం అపరాజితాయై నమః
ఓం పిప్పలాయై నమః
ఓం విశాలాక్ష్యై నమః 20
ఓం రక్షోఘ్న్యై నమః
ఓం వృష్టికారిణ్యై నమః
ఓం దుష్టవిద్రావిణ్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం సర్వోపద్రవ నాశిన్యై నమః
ఓం శారదాయై నమః
ఓం శరసంధానాయై నమః
ఓం సర్వశస్త్ర స్వరూపిణ్యై నమః
ఓం యుద్ధ మధ్య స్థితాదేవ్యై నమః
ఓం సర్వభూత ప్రభంజన్యై నమః 30
ఓం అయుద్ధాయై నమః
ఓం యుద్ధరూపాయై నమః
ఓం శాంతాయై నమః
ఓం శాంతి స్వరూపిణ్యై నమః
ఓం చిత్రఘంటాయై నమః
ఓం సునందాయై నమః
ఓం శ్రీయై నమః
ఓం మానవ్యై నమః
ఓం మనుసంభవాయై నమః
ఓం స్తంభిన్యై నమః 40
ఓం క్షోభిణ్యై నమః
ఓం మార్త్యై నమః
ఓం భ్రామిన్యై నమః
ఓం శత్రుమారిణ్యై నమః



ఓం మోహిన్యై నమః
ఓం ద్వేషిన్యై నమః
ఓం వీరాయై నమః
ఓం అమోఘాయై నమః
ఓం రుద్రరూపిణ్యై నమః
ఓం రుద్రైకాదశిన్యై నమః 50
ఓం పుణ్యాయై నమః
ఓం కళ్యాణ్యై నమః
ఓం లాభకారిణ్యై నమః
ఓం శతరుద్ర హరాయై
ఓం హంత్ర్యై నమః
ఓం సర్వసంహార కారిణ్యై నమః
ఓం పురుషాయై నమః
ఓం పౌరుష్యై నమః
ఓం తుష్టైయై నమః
ఓం సర్వతంత్ర ప్రసూతికాయై నమః60
ఓం ఆగ్నేయాయై నమః
ఓం పార్థివాయై నమః
ఓం వాయవ్యాయై నమః
ఓం వ్యోమకేతనాయై నమః
ఓం సత్యజ్ఞానాత్మకాయై నమః
ఓం బ్రాహ్మ్యై నమః
ఓం బ్రహ్మసనాతన్యై నమః
ఓం కోటిబ్రహ్మాది సంసేవ్యాయై నమః
ఓం కోటిరుద్రాది కీర్తితాయై నమః
ఓం మాతులుంగమయం నమః 70
ఓం ఖేటభిభ్రత్యై నమః
ఓం సౌవర్ణ చషకభిభ్రత్యై నమః
ఓం పద్మద్వయందధానాయై నమః
ఓం పూర్ణకుంభం భిభ్రత్యై నమః
ఓం కీరందధానాయై నమః
ఓం వరదాభయదానాయై నమః
ఓం పాశంభిభ్రత్యై నమః
ఓం అంకుశంభిభ్రత్యై నమః
ఓం శంఖం వహంత్యై నమః
ఓం చక్రం వహంత్యై నమః 80
ఓం శూలం వహంత్యై నమః
ఓం కృపాణికాం వహంత్యై నమః
ఓం ధనుర్బాణౌభిభ్రత్యై నమః
ఓం అక్షమాలాందధానాయై నమః
ఓం చిన్ముద్రాంభిభ్రత్యై నమః
ఓం అష్టాదశభుజాయై నమః
ఓం మహాష్టాదశ పీఠగాయై నమః
ఓం లక్ష్మ్యై నమః
ఓం భూనీళాదిసంసేవ్యాయై నమః
ఓం స్వామిచిత్తానువర్తిన్యై నమః 90
ఓం మంగళానాం మంగళాయై నమః
ఓం దేవతానాం దేవతాయై నమః
ఓం ఉత్తమానాం ఉత్తమాయై నమః
ఓం శ్రేయసే నమః
ఓం పరమామృతాయై నమః
ఓం ధనధాన్యాభివృద్ధయే నమః
ఓం సార్వభౌమ సుఖోచ్ఛ్రయాయై నమః
ఓం ఆందోళికాది సౌభాగ్యాయై నమః
ఓం మత్తేభాదిమహోదయాయై నమః
ఓం పుత్రపౌత్రాభివృద్ధియే నమః 100
ఓం విద్యాభోగబలాధికాయై నమః
ఓం ఆయురారోగ్య సంపత్యై నమః
ఓం అష్టైశ్వరాయై నమః
ఓం పరమేశ విభూత్యై నమః
ఓం సూక్ష్మాత్ సూక్ష్మతరాగతయే నమః
ఓం సదయాపాంగసందతాయ నమః
ఓం బ్రహ్మేంద్రాది పదస్థితాయై నమః
ఓం అవ్యాహత మహాభాగ్యాయై నమః
ఓం అక్షోభ్య విక్రమాయై నమః
ఓం వేదనా సమన్వయాయై నమః
ఓం వేదనా మవిరోధాయై నమః
ఓం నిశ్శ్రేయసపద ప్రాప్తిసాధనానాంఫల
రూపిణ్యై నమః

# 10. శ్రీ విద్యాలక్ష్మీ దేవి వైభవము

## శ్రీవిద్యాలక్ష్మీ ప్రశస్తి

శ్లో ॥ ప్రణతసురేశ్వరి భారతి భార్గవి శోకవినాశని రత్నమయే
మణిమయ భూషిత కర్ణ విభూషణ శాంతి సమావృత హాసముఖే
నవనిధిదాయిని కలిమల హారిణి కామ్యఫలప్రద హాసయుతే
జయజయహే మధుసూదన కామిని శ్రీవిద్యాలక్ష్మీ పరిపాలయమాం.

జన్మలన్నింటిలోకి మానవ జన్మ ఉత్కృష్టమైనది అంటారు. ఎందుకంటే మానవులకి మాత్రమే వివేకం, బుద్ధికుశలత, ఆలోచించేశక్తి వుంటాయి. ఏది మంచి ఏది చెడు అని ఆలోచించి మరీ నిర్ణయం తీసుకో గలిగిన శక్తి మనిషికి మాత్రమే వుంది. మనకి ఈ శక్తి శ్రీ విద్యాలక్ష్మీదేవి అనుగ్రహం వల్లనే సంప్రాప్తం అవుతుంది శ్రీమహాలక్ష్మీదేవి దాల్చిన అష్టలక్ష్మీ అవతారాలలో సప్తమ అవతారం శ్రీవిద్యా లక్ష్మీమాత.

యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః

అన్ని జీవులలోను బుద్ధి రూపంలో కొలువుండేది ఆమాత. శ్రీవిద్యాలక్ష్మీ అనుగ్రహం కలవారికి వినయ సంపద కూడా అలవడుతుంది. "విద్యావినయసంపన్నే" అన్నారు కదా! ఎప్పుడయితే విద్యాప్రతిభ, వినయం, మృదుసంభాషణం ఒక చోట వుంటాయో సమస్త సంపదలన్నీ అక్కడ నివాసం వుంటాయి.

## శ్రీవిద్యాలక్ష్మీ - శ్రీ సరస్వతి అమ్మవార్ల అనుగ్రహ ప్రత్యేకతలు

ఎప్పుడయినా విద్య విషయం ప్రస్తావనకి రాగానే మనకి తక్షణం శ్రీ సరస్వతిదేవి రూపం మన మనోనేత్రాల ముందు ప్రత్యక్షం అవుతుంది. కాని విద్యాలక్ష్మీ విద్యాబుద్ధులకు అధిష్టాన దేవత అని చెప్పటంతో సహజంగానే విద్యాలక్ష్మీ, సరస్వతీ మాతల యిరువురి కటాక్షాలలో వున్న తేడా ఏమిటి? అనే ప్రశ్న వుదయిస్తుంది. సరస్వతీదేవి అనుగ్రహం కలవారికి సమస్త విద్యలు శాస్త్ర జ్ఞానం కలగటం తధ్యం. ఆమె అనుగ్రహం కలవాళ్ళు మహాజ్ఞానులు, మహావిద్యాంసులు అవుతారు. కాని వారికి సమాజంలో తప్పకుండా గుర్తింపు వస్తుందని కాని, భోగభాగ్యాలు కలుగుతాయని గాని నియమం లేదు. కాని శ్రీ విద్యాలక్ష్మీమాత అనుగ్రహం కలిగిన వారికి సకల విద్యలూ, జ్ఞానం లభించటమే గాక వారిలోని విద్వత్తుకి, ప్రతిభకి గుర్తింపు లభిస్తుంది. తద్వారా వారిలోని ప్రతిభ సమాజ వికాసానికి మరింత ఉపయోగపడుతుంది. అంతేగాక శ్రీ విద్యాలక్ష్మీ మాత అనుగ్రహం కలిగిన వారికి ప్రతిభకు గుర్తింపుతోపాటు భోగభాగ్యాలు కూడా లభిస్తాయి. ఉదాహరణకి ఎందరో ప్రతిభావంతులయిన గాయనీమణులు వున్నారు కాని శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మీకి



మాత్రం ఆమె ప్రతిభకు తగ్గ గౌరవం గుర్తింపు భారతరత్న బిరుదు లభించాయి. అదే విధంగా ఎందరో శాస్త్రవేత్తలున్నారు డా॥ అబ్దుల్ కలాంకి మాత్రమే రాష్ట్రపతి పదవిని అలంకరించే యోగం కలిగింది. అవివారు కోరుకున్నవి కావు. ఆ భగవదను గ్రహంవల్ల లభించినవే. ఈ విధంగా విద్యాలక్ష్మీ మాత అనుగ్రహం వుంటే ప్రతిభ, ప్రతిభకి తగిన గుర్తింపు, ప్రతిభద్వారా సమాజవికాసం, సమాజంలో సమున్నత స్థానం, భోగభాగ్యాలూ లభిస్తాయి. సామాన్య జనానీకం లక్ష్మీ సరస్వతులు అత్తా కోడళ్ళు అనీ ఇరువురు ఒకచోట వుండరు అనీ అనుకుంటూ వుంటారు. అందువల్లనే చదువు వున్నచోట ధనం వుండదు, ధనం వున్న చోట చదువు వుండదు అని అనుకుంటూంటారు. ఇది నిజంగా అపోహే. యిందులో ఏమాత్రం నిజంలేదు. మన మానవ సంబంధాలు దేవతలకి అంటగట్టడం ఏమాత్రం సరికాదు. శ్రీ విద్యాలక్ష్మీదేవి అనుగ్రహం కలవారికి విద్య,సంపద రెండూ లభిస్తాయి. శ్రీవిద్యాలక్ష్మీ దేవిని ఆరాధించిన వారికి విద్యాబుద్ధులు కలగడమే మాత్రమే గాక తగిన గుర్తింపు కూడా కలిగి అతి త్వరలో ఉన్నతస్థాయికి చేరుకోగలుగుతారు. ఆ శ్రీమహాలక్ష్మీదేవి తన భక్తులకు బలం, ధైర్యం సాహసం బుద్ధి వంటి అన్ని రకాల శక్తులూ యిచ్చి విజయాన్ని కూడా ప్రసాదించి తన భక్తుడు అహంకారపూరితుడవుతున్నాడా లేక వివేచనతో ధర్మాచరణ చేస్తున్నాడా అని పరీక్షిస్తుంది. ఈ పరీక్షలో నెగ్గిన వారికే శ్రీ విద్యాలక్ష్మీదేవి అనుగ్రహం లభిస్తుంది.

## శ్రీ విద్యాలక్ష్మీమాత స్వరూపం - ఆతల్లి ప్రసాదించే విద్యలు

శ్రీవిద్యాలక్ష్మీమాత మహాపద్మంలో కూర్చుని దర్శనం యిస్తుంది. యిరువైపులా ఏనుగులు ఈ తల్లిని తామరపూవులతో సేవిస్తూ వుంటాయి. ఈ మాత పసుపుపచ్చని పట్టు పీతాంబరం ధరించే వరదాభయచతుర్భుజమూర్తి. రెండు చేతులతో పద్మాలను ధరించిన ఈ మాత మరొక చేతిలో పుస్తకాన్ని ధరించి వుంటుంది. వేరొక చేతితో భక్తులకు అభయప్రదానం చేస్తూ ఉంటుంది. ఈ తల్లికి బిల్వపత్రాలంటే ఎంతో యిష్టం.

శ్లో ॥ చతుర్భుజాం మహాలక్ష్మీం గజయుగ్మ సుపూజితాం
పద్మపత్రాభ నయనాం వరాభయకరోజ్జ్వలాం
ఊర్ధ్వద్వయ కరాయాబ్జాం దధతీం శుక్ల వస్త్రదాం
పద్మాసనీ సుహాసనీంచ భజేహాం సర్వమంగళాం ॥

ఇక ఈ తల్లి అనుగ్రహించే విద్యల విషయానికి వస్తే సకల విద్యాస్వరూపిణి అయిన ఈ మాత సాధకుడికి ఏ విద్య అవసరమో ఆ విద్యని అనుగ్రహిస్తుంది. యోగ్యతని బట్టి విద్యని ప్రసాదిస్తుంది.

శ్రీ విద్యాలక్ష్మీమాత దయవల్ల సాధకుడు వివిధ స్థాయిలలో వివిధ రకాలయిన విద్యలను నేర్చుకుంటాడు. ప్రథమ స్థాయిలో వున్న సాధకుడికి అవసరమయినది

యజ్ఞవిద్య. ఆ తరువాత గుహ్యవిద్య, ఆ తర్వాత ఆత్మ విద్య, చివరలో మహావిద్య అవసరమవుతాయి. సాధకులలో అతి తక్కువ మందే మహావిద్య స్థాయికి చేరగలుగుతారు.

యజ్ఞవిద్య : యత్+జ్ఞ = యజ్ఞ యత్ ఏది సత్యమో, ఏది నిత్యమో, ఏది యుక్తమో, జ్ఞ అంటే తెలుసుకోవడం కాబట్టి యజ్ఞవిద్య ద్వారా మనకి మనం చేయవలసిన విధులను, కర్మలను, పాటించవలసిన ఆచారాలను గురించి ఆ తల్లి తెలియజేస్తుంది. యజ్ఞ విద్య ద్వారా నిత్యం చేయవలసిన పనులకి సంబంధించి ఏ విధమైన పనులను చేయాలి? ఏ పనులు చేయకూడదు? అనేవిషయాలు కూడా తెలియజేయబడతాయి. ప్రాథమిక స్థాయిలో సాధకుడికి అవసరమయినది ఈ యజ్ఞ విద్య. ఈ విద్య మానవుణ్ణి ధర్మాచరణ దిశగా ప్రేరేపిస్తుంది. ఏ విధమైన ధర్మాచరణ చేయాలో యజ్ఞ విద్యలో చెప్పబడుతుంది.

గుహ్యవిద్య : గుహ్యం అంటే రహస్యం అని అర్థం. రెండవ స్థాయిలో సాధకుడికి అవసరమైనవి ధర్మ రహస్యాలు. గుహ్యవిద్య ద్వారా ధర్మాధర్మ విచక్షణా జ్ఞానంతో పాటు ఏఏ పనులను చేస్తే ఎటువంటి ఫలితాలు కలుగుతాయి? సత్కర్మాచరణ వల్ల కలిగే లాభాలు ఏమిటి? చెడ్డ పనులను ఎందుకు చేయకూడదు? జపించే మంత్రాల వెనుకనున్న గూఢార్థాలు ఏమిటి అనే విషయాలు గుహ్యవిద్య తెలుస్తాయి. దీనినే రహస్య విద్య అని కూడా అంటారు.

ఆత్మ విద్య : ధర్మాన్ని ఆచరించే విధానం, ఆచరించవలసిన అవసరం గురించి కూడా తెలుసుకున్న సాధకుడు మూడవ దశలో నేర్చుకోవలసింది ఆత్మ విద్య. లౌకిక ప్రపంచంతో సంబంధం లేకుండా జీవాత్మని పరమాత్మతో సంధానం చేసి ముక్తిని పొందే మార్గాన్ని తెలియజేసేది ఆత్మజ్ఞానం. ఈ సంసారిక బంధాల నుండి విడివడి శాశ్వతానందాన్ని ప్రసాదించే ఆ తల్లి సాన్నిధ్యాన్ని చేరుకోవటమే ముక్తి అంటే. ఈ స్థితిని సాధకుడు పరిణతి చెందినపుడు మాత్రమే చేరుకోగలుగుతాడు.

మహావిద్య : యీ పరమ పదసోపాన పరంపరలో జీవినేర్చుకోవలసిన అత్యుత్తమ జ్ఞానం మహావిద్య. మహావిద్యని అభ్యసించిన వారు చరాచర సృష్టిలోని అన్ని వస్తువులలోను ఆ జగన్మాత ప్రతిరూపాన్ని చూడగలుగుతారు. అంతటా నిండి వున్న ఆ తల్లి యొక్క లీలా విలాసమే ఈ సృష్టి యావత్తూ అని అర్థం చేసుకున్న సాధకుడు, నిరహంకారంతో, మనస్ఫూర్తిగా, తనని తాను ఆ తల్లి పాదారవిందాలకు అర్పించుకుంటాడు. ఇక ఆ స్థితిలో సాధకుడు తన ముక్తి గురించి కూడా ప్రయత్నించడు, ఆలోచించడు.సదా ఆ మాత సన్నిధిలో నిత్యానందంలో మునిగిపోయి వుండే స్థాయికి చేరుకుంటాడు. ఆ తరువాత ఆ సాధకుడికి కోరికలేవీ వుండవు. కోర తగిన వస్తువు అంటూ ఏమీవుండదు. కోరవలసిన అవసరమూ వుండదు. ఈ స్థాయికి చేరిన ముముక్షువులు అతి కొద్ది మందే వుంటారు. శ్రీరామకృష్ణ పరమహంస, ఈ స్థితికి చేరగలిగిన పరమభక్తుడు. అన్నిచోట్లా అందరిలోనూ ఆ కాళీమాతని



దర్శించగలిగాడు రామకృష్ణుడు. ఇలాంటి అత్యుత్తమ విద్య కూడా విద్యాలక్ష్మీ దేవి అనుగ్రహం వల్లనే లభిస్తుంది. మహావిద్యా స్వరూపిణి అయిన ఆ తల్లిని సర్వవిద్యాధి దేవతగా ప్రస్తుతించటం జరిగింది. సర్వాతీతా, సర్వమాతృకా, సర్వేశ్వర మనోహారి, సర్వేశీ, సర్వవ్యాపికా అని శ్రీవిద్యాలక్ష్మీదేవి కీర్తించ బడుతోంది.

శ్లో॥ అకారాది క్షకారాంతా అనంతా అవ్యయా రమా<br>
సురూపా విరూపా చ వేదా వేదచారిణీ<br>
సర్వవిత్ సర్వదాదేవీ సర్వాతీతా సర్వ మాతృకా<br>
సర్వేశ్వర మనోహరీ మాతా సర్వేశీ సర్వవ్యాపికా<br>
అనూహ్య ప్రగతి గామీ అవిరామ చారిణీత్వం<br>
శ్రీముగ్ధలోకాన్ ముకురా ముఖేముఖే సరస్వతీ

శ్రీ విద్యాలక్ష్మీ మాత అనుగ్రహం కావాలనుకునేవారు ఆతల్లి బీజాక్షర జపం చేయాలి. ఈ బీజాక్షరాలలో "ఏ" అనే అక్షరం ఎంతో మహిమాన్వితమైనది. ఈ విధమైన "ఏ" కార మంత్ర జపానికి గల ప్రాముఖ్యతని తెలిపే ఒక ఉదంతాన్ని తెలుసుకుందాం.



## శ్రీవిద్యాలక్ష్మీదేవి మాహాత్మ్యం – బీజాక్షర మహిమ

పూర్వం కోసల రాజ్యంలో దేవదత్తుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. భగవంతుడు దేవదత్తునికి అన్ని సౌఖ్యాలూ యిచ్చినా, సంతానాన్ని మాత్రం యివ్వకపోవడంతో అందుకోసం ఆ బ్రాహ్మణుడు అనేక ప్రయత్నాలు చేసాడు. చివరికి పెద్దల సలహాని అనుసరించి యజ్ఞం చేయాలని సంకల్పించాడు. యాగం చేయించే నిమిత్తం గోభిలుడు అనే బ్రాహ్మణుని "ఉద్గాత" గా (మంత పఠనం చేసే ఋత్వికునిగా) నియమించుకుని యజ్ఞం మొదలు పెట్టాడు. మంత్ర పాఠం చేసే సమయంలో గోభిలుడికి వున్న శ్వాస సంబంధమైన సమస్యవల్ల, మంత్ర పఠనాక్రమంలో దురదృష్టవ శాత్తూ స్వర భంగం అవుతుంది. శాస్త్రాలు తెలిసిన దేవదత్తుడికి చాలా కోపం వస్తుంది. గోభిలుడిని గద్దించి "స్వరభంగం అవుతోంది తెలియటం లేదా?" అని ప్రశ్నిస్తాడు కోపంగా. నిజానికి యజ్ఞయాగాదులు చేసేవారు కోపతాపాలు దగ్గరకు రాకుండా శాంతంగా వుండాలి. అలాంటిది యజ్ఞం చేస్తూ కూడా యజ్ఞం చేయించే తనపై దేవదత్తుడు కసురుకోవటంతో గోభిలుడికి బాధ కలిగింది. యజ్ఞ దీక్షలో వుంటూ ఉద్గాతని కసురుకున్నావు కాబట్టి నీవు చేసిన పాపానికి నీకు పుట్టబోయే కొడుకు విద్యారహితుడు, మూర్ఖుడు అవుతాడు అని శపిస్తాడు.

యజ్ఞఫలంగా దేవదత్తుడికి పుత్ర సంతానం కలుగుతుంది. అతనికి ఉతథ్యుడు అని పేరు పెట్టడం జరుగుతుంది. కాని శాపవశాన ఆ పిల్లవాడు పరమమూర్ఖుడుగా, చదువురాని వాడుగా తయారవుతాడు. దేవదత్తుడు ఎంత ప్రయత్నం చేసినా ఉపయోగం లేకపోతుంది. సాటి బ్రాహ్మణులంతా తన కుమారుడిని గురించి నానా





శ్రీ విద్యాలక్ష్మీదేవి మహిమ



మాటలు అంటూ వుండటంతో విసుగు పుట్టి కొడుకుని యింటి నుంచి తరిమివేస్తాడు దేవదత్తుడు. శాపగ్రస్తుడు అయిన ఉతథ్యుడు గంగాతీరంలో ఏకాకిగా తన దురవస్థకి విలపిస్తూ కాలం గడపసాగాడు. ఇంతలో ఒక రోజు నారదమహర్షి అక్కడికి వచ్చి ఉతథ్యుని చూసి జాలి పడి కారణం అడిగాడు. మూర్ఖుడైన ఆ ఉతథ్యుడు సరైన సమాధానం కూడా చెప్పలేకపోయాడు. దివ్యదృష్టితో శాప విషయాన్ని తెలుసుకున్న నారదుడు విద్యాలక్ష్మీదేవి అనుగ్రహం వుంటే ఈ బాలుడు తప్పక బాగుపడతాడు అని అనుకున్నాడు. ఉతథ్యుడు యిదేమీపట్టక ఊఊ అని ఏడుస్తున్నాడు. నారదునికి ఒక ఉపాయం తోచింది. ఊఊ బదులు గా ఏఏ అని ఏడిస్తే 'ఏ' కారం విద్యాలక్ష్మి బీజాక్షరం కాబట్టి ఫలితం రావచ్చు అని ఆ బాలునికి 'ఏ' 'ఏ' అని ఏడవమని బోధిస్తాడు. ఆ పిల్లవాడు కూడా అలాగే 'ఏ' 'ఏ' అని ఏడవసాగాడు. ఆ తల్లి మహిమలు అనంతం. విద్యాలక్ష్మి మహిమ వల్ల ఉతథ్యుడి బుద్ధిక్రమక్రమంగా వికసించసాగింది. లోక విషయాలన్నీ క్రమంగా అతనికి తెలియసాగాయి. ఆ విషయం ఉతథ్యుడికి తెలియదు. 'ఏ' కార జపం మాత్రం అలా కొనసాగుతూనే వుంది. ఇది ఇలా వుండగా ఒకనాడు ఒక చిన్న లేడి పిల్ల పరుగెత్తుకుంటూ వచ్చి ఉతథ్యుని యింట్లో దూరి దాక్కుంది. దానిని తరుముకుంటూ ఒక బోయవాడు వచ్చాడు. ఉతథ్యుని చూసి 'అయ్యా నువ్వు చూస్తే బాపనయ్యలా వున్నావు. నేను వేటాడుతున్న లేడి పిల్ల యిలా వచ్చిందా? చూసావా? నిజం చెప్పు. గత నాలుగు రోజుల నుంచి మాకు తిండి లేదు. నాకు ఈ రోజు ఈ వేట దొరకకపోతే నా కుటుంబం యావత్తూ ఆకలితో మాడి చావటం ఖాయం అని అన్నాడు. లేడి ఎక్కడ వుందో నిజం చెప్పేస్తే బోయవాడు దాన్ని తక్షణం చంపేస్తాడు. ఒక వేళ చెప్పకపోతే బోయవాడు అతని కుటుంబం ఆకలితో అంతరిస్తారు ఏం చేయాలి? అని ఉతథ్యుడు ఆలోచించాడు. అసత్యదోషం అంటకుండా ఏం చెప్పాలి అనుకుంటూ వుండగా ఆ విద్యాలక్ష్మి పరిపూర్ణ అనుగ్రహం వల్ల అతని నోటి వెంట ఈ శ్లోకం వచ్చింది.

శ్లో ॥ యాపశ్యతినసాబ్రూతే యాబ్రూతే సా నపశ్యతి
అహో వ్యాధ స్వకారార్థిన్ కింపృచ్ఛసి పునః పునః ॥

"ఓ బోయవాడా! చూడగలిగే శక్తిగల నా కళ్ళకి మాట్లాడే శక్తి లేదు. మాట్లాడే నా నోటికి చూడగల శక్తి లేదు. నేను ధ్యానంలో వున్నాను. నన్నెందుకు పదే పదే అడుగుతావు" అని అన్నాడు. పై నుంచి దేవతలు సత్యంసత్యం అని ఆశీర్వదించారు. ఉతథ్యుడికి సత్యవ్రతుడని పేరుపెట్టారు. ఇలా దేవతలు ఆకాశం నుండి పలకటం చూసిన ఆ బోయవాడు ఈయన ఎవరో మహాను భావుడనుకుని ఆకలి మరచిపోయి సాష్టాంగనమస్కారంచేసి పరుగు పరుగున ఊరి లోనికి పోయి అందరికీ ఈ మహానుభావుడి గురించి చెప్తాడు. అచిరకాలంలోనే అమ్మవారిదయవల్ల సత్యవ్రతుడైన ఉతథ్యుడు మహా విద్వాంసునిగా ప్రఖ్యాతి చెందాడు. యీ విధంగా

మూర్ఖుడు, విద్యారహితుడు అయిన ఉతథ్యుడు "ఏ" కార మంత్ర జపం ద్వారా మహావిద్వాంసుడయ్యాడు. ఉతథ్యునిచే చెప్పబడిన పై శ్లోకం తర్కశాస్త్రంలో, ధర్మసూక్ష్మాలను తెలియజేసే సందర్భంలో ఉదాహరిస్తారు. విద్యని కాంక్షించే సాధకుని హృదయాంతర్గత దైవంగా శ్రీ విద్యాలక్ష్మి ఎల్లకాలము వుండాలని పురాణాలలో చెప్పబడింది.

తమ పిల్లలకి తగిన విద్యా బుద్ధులు కావాలని తహతహలాడే మాతృమూర్తులు, ఎంత చదివినా మార్కులు రావటం లేదని బాధపడే విద్యార్థులు, అన్ని అర్హతలున్నా గుర్తింపు రావటం లేదని బాధపడే ఉద్యోగులూ, తమ విద్యత్తుని సమాజం సరిగా ఉపయోగించుకోవడం లేదనుకునే కళాకారులు, శాస్త్రజ్ఞులూ, విద్వాంసులూ ఈ విద్యాలక్ష్మీమాతని అర్చిస్తే ఆ తల్లి అనుగ్రహం చేత వారి వారి మనోభీష్టాలను తీర్చుకోగలుగుతారు. ఆ తల్లిని షోడశోపచారాలతో, అష్టోత్తర శతనామావళితో అర్చించినట్లయితే పరిపూర్ణ విద్యాలాభంతో పాటు భోగభాగ్యాలు కూడా తప్పకుండా సిద్ధిస్తాయి. సశాస్త్రీయమైన పూజ ప్రతినిత్యం చేసుకోలేని వారు శ్రీ విద్యాలక్ష్మి బీజాక్షర మంత్రం జపం "ఏ ఏల - ఏం ఏం లం" రోజుకి 123 పర్యాయములు జపిస్తే తక్షణ ఫలితాలు కలుగుతాయి. ఎంతటి గడ్డు సమస్యలకైనా వెంటనే పరిష్కారం దొరుకుతుంది. అందరూ ఆ విద్యాలక్ష్మి అమ్మవారిని యథాశక్తి పూజించి ఆ తల్లి అనుగ్రహం వల్ల సకల విద్యా పారంగతులై భోగభాగ్యాలతో వర్థిల్లెదరు గాక!

### శ్రీ విద్యాలక్ష్మీ మంత్రజపం

ఎంతో విద్యావంతులయిన మీకు సరైన ఉద్యోగం, గుర్తింపు, వేతనం లభించడం లేదా? కలత చెందకండి. విద్యాలక్ష్మీదేవిని ఆరాధిస్తే మీ సమస్యలకి తప్పక పరిష్కారం దొరకుతుంది. "ఓం నమో భగవతీ విద్యాలక్ష్మీ దేవతాయై నమః - ఓం హం ఐం శ్రీం హం ఐం శ్రీం" - యిది విద్యాలక్ష్మీ మూలమంత్రం రోజుకి 108 సార్లు భక్తి శ్రద్ధలతో ఈ మంత్రాన్ని మనస్సులో జపిస్తే మీ సమస్యలన్నీ తీరి మంచి స్థానాన్ని పొందగలుగుతారు.

శ్రీ సరస్వతీ దేవి అనుగ్రహిస్తే జ్ఞానం, పాండిత్యం లభించి విద్వాంసులవుతారు. శ్రీ విద్యాలక్ష్మి మాత అనుగ్రహిస్తే జ్ఞానానికి తగిన గుర్తింపు లభించి ఉన్నత స్థానాన్ని పొంది తద్వారా భోగభాగ్యాలు కూడా పొందగలుగుతారు.



### శ్రీ మహాలక్ష్మీదేవి - పద్మం

శ్లో॥ సహస్రదళపద్మస్థాం పద్మనాభ ప్రియాం సతీం
పద్మాలయాం పద్మవక్త్రాం పద్మ పత్రాభలోచనాం॥

శ్లో॥ పద్మపుష్ప ప్రియాం పద్మ పుష్ప తల్పాధిశాయినీం
పద్మినీం పద్మహస్తాంచ సస్మితాం తాం భజేముదా॥

శ్లో॥ పద్మనాభ ప్రియాదేవీం పద్మాక్షీం పద్మవాసినీం
పద్మవక్త్రాం పద్మహస్తాం వందే పద్మమహర్నిశమ్॥

శ్లో॥ పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మ దళాయతాక్షి
విశ్వ ప్రియే విష్ణు మనోనుకూలే త్వ త్వాదపద్మంమయి సన్నిధత్స్వ॥

శ్లో॥ పద్మాసనే పద్మ ఊరూ పద్మాక్షీ పద్మ సంభవే
త్వం మాం భజసి పద్మాక్షి యేన సౌఖ్యం లభామ్యహమ్॥

పద్మానికి లక్ష్మీదేవికి అవినాభావ సంబంధం వుంది. ఆ తల్లికి తామర పువ్వులు అంటే ఎంతో యిష్టం. ఆ తల్లి పద్మినీ జాతికి చెందిన స్త్రీ మూర్తి. సహస్రదళ మహాపద్మంలో పద్మాసన భంగిమలో కూర్చుని వుంటుంది. పద్మనాభుడైన ఆ శ్రీహరికి ప్రియసతి అయిన ఆ తల్లి పద్మముల వంటి విశాలమైన కన్నులు కలదై - పద్మాక్షి అని కీర్తించబడుతోంది. రెండు చేతులలో పద్మాలను ధరించి జ్ఞానాన్ని, ముక్తినీ ప్రసాదిస్తూ వుంటుంది ఆ తల్లి. పద్మాలతో చేసిన హారాన్ని ధరించటం అంటే ఆ తల్లికి ఎంతో యిష్టం. శుక్రవారం నాడు చేసే మహాలక్ష్మి హోమంలో నేతిలో ముంచిన పద్మాలను హోమంలో వేస్తారు. పద్మసంభవుడైన బ్రహ్మదేవుడికి తల్లి ఆ మాత. ఇంతగా పద్మాలతో మమేకం అవుతూ ఆ తల్లి మనకి ఏం సూచిస్తుంది.

### మంగళ హారతి

అంబ నీకిదిగో హారతీ జ్ఞాన ప్రభో జగదాంబ నీకిదిగో హారతీ
అమ్మనాకు సమ్మతిగా అభయమియ్యవే కుందరవదన (2)
నీవద్ద కూర్చుండి మాటలాడీ సమ్మతించి
భాగ్యమెంతో కుంభహారతి తెచ్చినానూ ! అంబనీకిదిగో హారతీ.....
హరిహర బ్రహ్మదులంతవారికి ఆదిమూలమైన శక్తివీ (2)
పరంజ్యోతిమిమ్ముగూడి పరాబ్రహ్మమందు పుట్టీ
నిష్టగాను మనసుకుదిరి అష్ట హారతి తెచ్చినాను! అంబనీకిదిగో హారతీ....
అంబ నిన్నాశ్రయించితీ అష్టమండపమున వన్నె కూర్చి (2)
కావవే శుభ్రవస్త్రమిపుడు గట్టి నిబ్బరముగ మనసు కుదిరి
మీకిద్దరికీ హారతీ ముద్దుగాను తెచ్చినాను ! అంబనీకిదిగో హారతీ
జ్ఞాన ప్రభో జగదాంబ నీకిదిగో హారతీ.

## శ్రీవిద్యాలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం

శ్రీముగ్ధా లోకముకురా చ శ్రీవల్లీ సరస్వతీ
ప్రగతిగా అవిరామా చ సూక్ష్మానల్పాపాతు మే సదా॥ 1
త్రిపురా భైరవీ విద్యా హంసా వాణీశ్వరీ శివా
వాగ్దేవీ చ మహారాత్రీ కాళరాత్రి స్త్రిలోచనా॥ 2
ప్రత్యంగిరా ధరావేలా లోకమాతా హరిప్రియా
పార్వతీ పరమాదేవీ బ్రహ్మవిద్యా ప్రదాయినీ॥ 3
సంఖ్యాజాతిః క్రియాశక్తిః ప్రకృతిర్మోహినీ మహీ
యజ్ఞ విద్యా మహావిద్యా గుహ్య విద్యా విభావరీ॥ 4
జయాచ విజయాచైవ జయంతి చా పరాజితా
కుబ్జికా కుళికా శాస్త్రైః వీణా పుస్తక ధారిణీ॥ 5
సర్వతీర్థ స్థితా శుద్ధా సర్వ పర్వత వాసినీ
వేద శాస్త్ర క్రమాదేవీ షడంగాది పదక్రమా॥ 6
ఏకాక్షర పరాతారా భవబంధ వినాశినీ
భారతీ కమలా భాషా పద్మా పద్మావతీ కృతిః॥ 7
త్రయీశిఖా విశేషజ్ఞీ వేదాంత జ్ఞానరూపిణీ
త్రైలోక్య మోహినీ విద్యా సర్వభృత్ క్షరాక్షరా॥ 8
గద్యపద్యాత్మికా వాణీ సర్వాలంకార సంయుతా
సాధుబంధ పదన్యాసా సర్వౌకః ఘటికావళిః॥ 9
ఆకారాది క్షకారాంతా సర్వ విద్యాధిదేవతా
మంత్రవ్యాఖ్యాన నిపుణా జ్యోతిశ్శాస్త్రైక లోచనా॥ 10
అణిమాది గుణోపేతా పరాకాష్టా పరాగతి
హంసయుక్తా విమానస్థా హంసారూఢా శశిప్రభా॥ 11
సమాస తద్ధితాకారా విభక్తి వచనాత్మికా
స్వాహాకారా స్వరాకారా శ్రీపత్యర్థాంగ నందినీ॥ 12
మాయావిద్యా మూలభూతా వాసవీ విష్ణు చేతనా
వాదినీ వసురూపాది వసురత్న పరిచ్ఛదా॥ 13
ఛాందసీ చంద్రహృదయా మంత్ర స్వచ్ఛంద భైరవీ
వనమాలా వైజయంతీ దధా నాహరికామినీ॥ 14
నిత్యాతథ్యా రమారామా భారతీ భరతాశ్రితా
నాద బ్రహ్మమయావిద్యా జ్ఞానబ్రహ్మ మయీపరా॥ 15

ఓం తత్ సత్





## విద్యా లక్ష్మీ యంత్రము



### మూల మంత్ర ధ్యాన శ్లోకము

ఓం నమో భగవతీ విద్యాలక్ష్మీ ఓం హం ఐం శ్రీం
హం ఐం శ్రీం మమ హృదయే సకల విద్యారూప
లక్ష్మీం స్థాపయ స్థాపయ, రాజవశ్యం సభావశ్యం
ప్రాప్తయ ప్రాప్తయ ధనకనకాదికం ప్రాపయ ప్రాపయస్వాహా -
108 సార్లు కుంకుమార్చన - జపము - హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ విద్యాలక్ష్మీ అష్టోత్తర శతనామావళి



ఓం శ్రీ ముగ్ధాయై నమః
ఓం లోకముకురాయై నమః
ఓం శ్రీవల్లీ సరస్వత్యై నమః
ఓం ప్రగతిగాయై నమః
ఓం అవిరామాయై నమః
ఓం సూక్ష్మానల్పాయై నమః
ఓం త్రిపురాయై నమః
ఓం భైరవ్యై నమః
ఓం విద్యాయై నమః 10
ఓం హంసాయై నమః
ఓం వాణీశ్వర్యై నమః
ఓం శివాయై నమః
ఓం వాగ్దేవ్యై నమః
ఓం మహారాత్ర్యై నమః
ఓం కాళరాత్ర్యై నమః
ఓం త్రిలోచనాయై నమః
ఓం ప్రత్యంగిరాయై నమః
ఓం ధరాయై నమః
ఓం వేలాయై నమః 20
ఓం లోకమాతాయై నమః
ఓం హరిప్రియాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం పరమాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం బ్రహ్మవిద్యా ప్రదాయిన్యై నమః
ఓం సంఖ్యాజాత్యై నమః
ఓం క్రియాశక్త్యై నమః
ఓం ప్రకృత్యై నమః
ఓం మోహిన్యై నమః 30
ఓం మహ్యై నమః
ఓం యజ్ఞ విద్యాయై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం గుహ్యవిద్యాయై నమః
ఓం విభావర్యై నమః
ఓం జయాయై నమః
ఓం విజయాయై నమః
ఓం జయంత్యై నమః
ఓం అపరాజితాయై నమః
ఓం కుబ్జికాయై నమః 40
ఓం కుళికాయై నమః
ఓం శాన్త్యై నమః
ఓం వీణాపుస్తకధారిణ్యై నమః
ఓం సర్వతీర్థస్థితాయై నమః
ఓం శుద్ధాయై నమః
ఓం సర్వపర్వతవాసిన్యై నమః
ఓం వేదశాస్త్ర క్రమాయై నమః
ఓం షడంగాదిపదక్రమాయై నమః
ఓం ఏకాక్షర పరాయై నమః
ఓం తారాయై నమః 50
ఓం భవబంధవినాశిన్యై నమః
ఓం భారత్యై నమః
ఓం కమలాయై నమః
ఓం భాషాయై నమః
ఓం పద్మాయై నమః
ఓం పద్మావత్యై నమః
ఓం కృత్యై నమః
ఓం త్రయీశిఖావిశేషజ్ఞాయై నమః
ఓం వేదాంత జ్ఞాన రూపిణ్యై నమః
ఓం త్రైలోక్య మోహిన్యై నమః 60
ఓం విద్యాయై నమః
ఓం సర్వధృత్యై నమః
ఓం క్షరాయై నమః
ఓం అక్షరాయై నమః
ఓం గద్యపద్మాత్మికాయై నమః
ఓం వాణ్యై నమః
ఓం సర్వాలంకార సంయుతాయై నమః
ఓం సాధుబంధుపదన్యాసాయై నమః
ఓం సర్వౌకషాయై నమః
ఓం ఘుటికావళ్యై నమః 70
ఓం అకారాదిక్షకారాంతాయై నమః
ఓం సర్వవిద్యాధి దేవతాయై నమః
ఓం మంత్రవ్యాఖ్యాన నిపుణాయై నమః
ఓం జ్యోతిశ్శాస్త్రైకలోచనాయై నమః
ఓం అణిమాదిగుణోపేతాయై నమః
ఓం పరాకాష్ఠాయై నమః
ఓం పరాగత్యై నమః
ఓం హంసయుక్త విమానస్థాయై నమః
ఓం హంసారూఢాయై నమః
ఓం శశిప్రభాయై నమః 80
ఓం సమాసతద్ధితాకారాయై నమః
ఓం విభక్తి వచనాత్మికాయై నమః
ఓం స్వాహాకారాయై నమః
ఓం స్వరాకారాయై నమః
ఓం శ్రీప్రత్యర్థాంగనందిన్యై నమః
ఓం మాయాయై నమః
ఓం అవిద్యాయై నమః
ఓం మూలభూతాయై నమః
ఓం వాసవ్యై నమః
ఓం విష్ణుచేతనాయై నమః 90
ఓం వాదిన్యై నమః
ఓం వసురూపాయై నమః
ఓం వసురత్న పరిచ్ఛదాయై నమః
ఓం ఛాందస్యై నమః
ఓం చంద్రహృదయాయై నమః
ఓం మంత్రస్వచ్ఛంద భైరవ్యై నమః
ఓం వనమాలా వైజయంతీ దధానాయై నమః
ఓం హరికామన్యై నమః
ఓం నిత్యాయై నమః
ఓం తథ్యాయై నమః 100
ఓం రమాయై నమః
ఓం రామాయై నమః
ఓం భారత్యై నమః
ఓం భరతాశ్రితాయై నమః
ఓం నాద బ్రహ్మమయై నమః
ఓం విద్యాయై నమః
ఓం జ్ఞానబ్రహ్మమయై నమః
ఓం పరాయై నమః 108

# శ్రీస్తుతిః

ఇది శ్రీవేదాంత దేశికులవారు రచించిన లక్ష్మీదేవి స్తుతి. ఈ శ్రీ స్తుతి పఠించిన వారికి అమ్మవారి పరిపూర్ణ కటాక్షం లభించి ఆయురారోగ్య ఐశ్వర్యాలు కలుగుతాయి.

**మానాతీత ప్రథితవిభవాం మఙ్గళం మఙ్గళానాం**
వక్షః పీఠం మధు విజయినో భూషయన్తీం స్వకాన్త్యా
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థనీనాం ప్రజానాం
శ్రేయో మూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే॥ ॥1॥
ఆవిర్భావః కలశజలధా వధ్వరే వాపి యస్యాః
స్థానం యస్యాః సరసిజవనం విష్ణు వక్షఃస్థలం వా
భూమాయస్యా భువనమఖిలం దేవి దివ్యం పదం వా
స్తోక ప్రజ్ఞై రనవధిగుణా స్తూయాసే సా కథం త్వమ్॥ ॥2॥
స్తోతవ్యత్వం దిశతిభవతీ దేహిభిః స్తూయామానా
త్వామేవ త్వామనితర గతిః స్తోతుమాశంసమానః।
సిద్ధారమ్భః సకల భువన శ్లాఘనీయో భవేయం
సేవాపేక్షా తవ చరణయోః శ్రేయసే కస్య న స్యాత్॥ ॥3॥
యత్సంకల్పాద్భవతి కమలే యత్ర దేహిన్యమీషాం
జన్మస్థేమ ప్రళయరచనా జఙ్గమాజఙ్గమానామ్।
తత్ కల్యాణం కిమపి యమినా మేకలక్ష్యం సమాధౌ
పూర్ణం తేజః స్ఫురతి భవతీ పాద లాక్షా రసాఙ్కమ్॥ ॥4॥
నిష్ప్రత్యూహ ప్రణయఘటితం దేవి నిత్యానపాయం
విష్ణుస్త్వం చేత్యనవధిగుణం ద్వన్ద్వమన్యోన్య లక్ష్యమ్।
శేషశ్చిత్తం విమల మనసాం మౌళయశ్చ శ్రుతీనాం
సమ్పద్యన్తే విహరణ విధౌ యస్య శయ్యా విశేషాః॥ ॥5॥
ఉద్దేశ్యత్వం జనని భజతోరుజ్ఝితోపాధి గన్ధం
ప్రత్యగ్రూపే హవిషి యువయోరేక శేషిత్వ యోగాత్ ।
పద్మే పత్యుస్తవ చ నిగమైర్ని త్యమన్విష్యమాణో
నావచ్ఛేదం భజతి మహిమా నర్తయ మానసం నః॥ ॥6॥
పశ్యన్తీషు శ్రుతిషు పరితః సూరిబృన్దేన సార్ధం
మధ్యే కృత్య త్రిగుణ ఫలకం నిర్మిత స్థాన భేదమ్।
విశ్వాధీశ ప్రణయిని సదా విభ్రమ ద్యూత వృత్తౌ
బ్రహ్మేశాద్యా దధతి యువయోరక్ష శార ప్రచారమ్ ॥ ॥7॥
అస్యేశానా త్వమసి జగతః సంశ్రయన్తీ ముకున్దం
లక్ష్మీఃపద్మా జలధి తనయా విష్ణుపత్నీ న్దిరేతి ।
యన్నా మాని శ్రుతి పరిపణాన్యేవమావర్తయన్తో
నావర్తన్తే దురిత పవన ప్రేరితే జన్మచక్రే॥ ॥8॥
త్వామేవాహుః కతిచిదపరే త్వత్ప్రియం లోకనాథం
కిం తైరన్తః కలహ మలినైః కిఞ్చిదుత్తీర్య మగ్నైః ।
త్వత్సంప్రీత్యై విహరతి హరౌ సంముఖీనాం శ్రుతీనాం
భావారూఢౌ భగవతి యువాం దమ్పతీ దైవతం నః॥ ॥9॥
ఆపన్నార్తి ప్రశమన విధౌ బద్ధ దీక్షస్య విష్ణోః
ఆచఖ్యుస్త్వాం ప్రియ సహచరీం ఐకమత్యోప పన్నామ్ ।
ప్రాదుర్భావైరపి సమ తనుః ప్రాధ్వమన్వీయసే త్వం
దూరోత్క్షిప్తైరివ మధురతా దుగ్ధరాశేస్తరఙ్గైః॥ ॥10॥
ధత్తే శోభాం హరి మరకతే తావకీ మూర్తిరాద్యా
తన్వీ తుఙ్గ స్తన భర నతా తప్త జామ్బూనదాభా।
యస్యాం గచ్ఛన్త్యుదయ విలయైర్ని త్యమానన్దసిన్ధౌ
ఇచ్ఛా వేగోల్లసిత లహరీ విభ్రమం వ్యక్తయన్తే॥ ॥11॥
ఆసంసారం వితతమఖిలం వాఙ్మయం యద్విభూతిః
యద్భ్రూభఙ్గాత్ కుసుమ ధనుషః కిఙ్కరో మేరు ధన్వా।
యస్యాం నిత్యం నయన శతకైరేక లక్ష్యో మహేన్ద్రః
పద్మే తాసాం పరిణతిరసౌ భావ లేశైస్త్వదీయైః॥ ॥12॥
అగ్రే భర్తు స్సరసిజ మయే భద్ర పీఠే నిషణ్ణామ్
అమ్భో రాశేరధిగత సుధా సంప్లవాదుత్థితాం త్వామ్ ।
పుష్పాసార స్థగిత భువనైః పుష్కలావర్తకాద్యైః
క్లుప్తారమ్భాః కనక కలశైరభ్యషిఞ్చన్ గజేన్ద్రాః॥ ॥13॥
ఆలోక్యత్వా మమృత సహజే విష్ణు వక్షఃస్థలస్థాం
శాపాక్రాన్తాః శరణమగమన్ సావరోధాః సురేన్ద్రాః।
లబ్ధ్వా భూయః స్త్రిభువనమిదం లక్షితం త్వత్కటాక్షైః
సర్వాకార స్థిర సముదయాం సంపదం నిర్విశన్తి॥ ॥14॥
ఆర్తత్రాణ వ్రతిభి రమృతాసార నీలామ్బువాహైః
అమ్భోజానాముషసి మిషతా మన్తరఙ్గైరపాఙ్గైః।
యస్యాం యస్యాం దిశివిహరతే దేవి దృష్టిస్త్వదీయా
తస్యాం తస్యామహమహమికాం తన్వతే సంపదోఘాః॥ ॥15॥
యోగారమ్భ త్వరిత మనసో యుష్మదైకాన్త్య యుక్తం
ధర్మం ప్రాప్తుం ప్రథమమిహ యే ధారయన్తే ధనాయామ్ ।
తేషాం భూమేర్ధనపతి గృహా దమ్బరాదమ్బుధేర్వా
ధారా నిర్యాన్త్యధికమధికం వాఞ్ఛితానాం వసూనామ్॥ ॥16॥
శ్రేయస్కామాః కమలనిలయే చిత్రమామ్నాయ వాచాం
చూడాపీడం తవ పద యుగం చేతసా ధారయన్తః ।

ఛత్రచ్ఛాయా సుభగ శిరసశ్చామర స్మేర పార్శ్వాః
శ్లాఘాశబ్ద శ్రవణ ముదితాః స్రగ్విణః సఞ్చరన్తి॥ ॥17॥
ఊరీకర్తుం కుశలమఖిలం జేతుమాదీన రాతీన్
దూరీకర్తుం దురిత నివహం త్యక్తుమాద్యామవిద్యామ్ ।
అమ్బ స్తమ్బావధిక జనన గ్రామ సీమాన్త రేఖామ్
ఆలమ్బన్తే విమల మనసో విష్ణుకాన్తే దయాం తే ॥ ॥18॥
జాతాకాంక్షా జనని యువయోరేక సేవాధికారే
మాయాలీఢం విభవమఖిలం మన్యమానాస్తృణాయ।
ప్రీత్యై విష్ణోస్తవ చ కృతినః ప్రీతిమన్తో భజన్తే
వేలాభఙ్గ ప్రశమన ఫలం వైదికం ధర్మసేతుమ్॥ ॥19॥
సేవేదేవి త్రిదశ మహిళా మౌళి మాలార్చితం తే
సిద్ధి క్షే&రతం శమిత విపదాం సంపదాం పాద పద్మమ్।
యస్మిన్నీ షన్న మిత శిరసో యాపయిత్వా శరీరం
వర్తిష్యన్తే వితమసి పదే వాసుదేవస్య ధన్యాః॥ ॥20॥
సానుప్రాస ప్రకటిత దయైః సాన్ద్ర వాత్సల్య దిగ్ధైః
అమ్బ స్నిగ్ధైరమృత లహరీ లబ్ధ సబ్రహ్మచర్యైః ।
ధర్మే తాపత్రయ విరచితే గాఢ తప్తం క్షణం మామ్
ఆకిఞ్చన్య గ్లపితమనఘైరార్ద్రయేథాః కటాక్షైః॥ ॥21॥
సంపద్యన్తే భవ భయ తమీ భానవస్త్వత్ప్రసాదాత్
భవస్సర్వే భగవతి హరౌ భక్తిముద్వేలయన్తః ।
యాచే కిం త్వామహమిహ యతః శీతలోదార శీలా
భూయో భూయో దిశసి మహతాం మఙ్గళానాం ప్రబన్ధాన్॥ ॥22॥
మాతాదేవి త్వమసి భగవాన్ వాసుదేవః పితామే
జాతస్సోఽహం జనని యువయోరేకలక్ష్యం దయాయాః।
దత్తో యుష్మత్పరిజనతయా దేశికైరప్య తస్త్వం
కిం తే భూయః ప్రియమతికిలస్మేరవక్త్రా విభాసి॥ ॥23॥
కల్యాణానామవికల నిధిః కాఽపి కారుణ్యసీమా
నిత్యామోదా నిగమ వచసాం మౌళి మన్దార మాలా।
సమ్పద్దివ్యా మధు విజయినః సన్నిధత్తాం సదా మే
సైషా దేవీ సకల భువన ప్రార్థనా కామధేనుః॥ ॥24॥
ఉపచిత గురు భక్తేరుత్థితం వేఙ్కటేశాత్
కలి కలుష నివృత్త్యై కల్ప్యమానం ప్రజానామ్ ।
సరసిజ నిలయాయాః స్తోత్రమేతత్ పఠన్తః
సకల కుశల సీమాః సార్వభౌమా భవన్తి॥ ॥25॥
కవితార్కి కసింహాయ కల్యాణగుణశాలినే
శ్రీమతే వేఙ్కటేశాయ వేదాన్తగురవే నమః ॥



# 11. శ్రీ ధనలక్ష్మీదేవి వైభవము

## సకలైశ్వర్యప్రదాయిని శ్రీధనలక్ష్మీదేవి ప్రశంస

శ్లో ॥ ధిమిధిమి ధింధిమి దింధిమి దింధిమి దుంధుభి నాద సుపూర్ణమయే
ఘుమ ఘుమ ఘుంఘుమ ఘుంఘుమ ఘుంఘుమ
శంఖనినాదసువాద్యనుతే
వేదపురాణేతిహాస సుపూజిత వైదిక మార్గ ప్రదర్శయుతే
జయజయహే మధుసూదన కామిని ధనలక్ష్మి రూపేణపాలయమాం॥

శ్రీమహాలక్ష్మిదేవి దాల్చిన అష్టలక్ష్మి అవతారాలలో అతిముఖ్యమైనది శ్రీ ధనలక్ష్మిదేవి. సాధారణంగా లక్ష్మిదేవి అనగానే మనందరికీ ధనలక్ష్మిదేవే గుర్తుకు వస్తుంది. “ధనం” అనే పదం లోకవ్యవహారాలలో ఐశ్వర్యానికీ సంపదకీ మారుపేరుగా స్థిరపడి పోయింది. శ్రీ ధనలక్ష్మి దేవి అనుగ్రహంవుంటే యశస్సు, శాంతి, వైరాగ్యం, మోక్షం ఆదిగాగల అనేక సంపదలు మనవశం అవుతాయి. సౌభాగ్యలక్ష్మిగాను, ఐశ్వర్యలక్ష్మిగాను, కనక మహాలక్ష్మిగాను పిలవబడే ఆ తల్లి అనుగ్రహం కోసం ఎన్నోరకాల పూజలు, నోములు, వ్రతాలు చేస్తూ వుంటారు భక్తజనం. ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి ఆదిగా గల ఏడుగురు లక్ష్మి స్వరూపాల అనంతరం శ్రీ ధనలక్ష్మిదేవిని పేర్కొనటంలో ఎంతో విశేషం వుంది.

## ధనం - అంటే ఏమిటి?

ధనం అనగా డబ్బు మాత్రమే కాదు. ధనం అనేక రకాలుగా వుంటుంది. శ్రీ ధనలక్ష్మిదేవి కృప వుంటే అష్టైశ్వర్యాలు లభించుటయేకాక యశోధనం, విద్యాధనం, తపోధనం వంటి అనేక రకాల ధనాలు కూడా మనకి అందుబాటులోకి వస్తాయి. శ్రీధనలక్ష్మిదేవి అనుగ్రహం వుంటే అన్నిరకాల ధనాలూ శక్తులు మనకి అందుబాటులోకి వస్తాయి. ప్రాణశక్తి, ఆరోగ్యం, బలం, ధైర్యం, శుభం, విజయం, వివేకం వంటి శక్తులన్నింటినీ సంపాదించుకుని, వాటిని సద్విని యోగం చేయగల సామర్థ్యం వచ్చిన తరువాత, మాత్రమే ధనలక్ష్మిదేవి అనుగ్రహం లభిస్తుంది. గతజన్మలో చేసుకున్న పుణ్యప్రభావము, ఈ జన్మలో చేసుకున్న ధర్మాచరణ ఫలితముకలిసి మానవునికి ధనలక్ష్మిదేవి అనుగ్రహానికి అర్హతని సంపాదించి పెడతాయి అనిశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ధనలక్ష్మిదేవి కటాక్షం వున్నవాడు ఈ లోకంలో మరిన్ని ధర్మకార్యాలుచేసే అవకాశం కలుగుతుంది. ఆ పుణ్యకార్యాల ఫలితంగా పరలోకంలో సౌఖ్యాలను అనుభవించే అర్హత కలుగుతుంది. అందువల్లనే ‘ఆ ధనలక్ష్మిదేవి కరుణ లేక పోతే మనకి ఆ లోకంలోనూ స్థానం లేదు. పై లోకంలోనూ స్థానంలేదు’ అని చెప్పడం జరిగింది. “ధనమూలమిదం జగత్” అనేది సామెత. ధనం లేకపోతే ఈ లోకంలో ఏమీ సాధించలేమనే విషయం లోకంలో అందరికీ తెలిసినదేకదా! ధనానికి అధిపతి కుబేరుడని అని అంటారు కాని కుబేరుడు కేవలం ధనలక్ష్మిదేవి ఆదేశానుసారం ధనాన్ని కాపాడే బాధ్యత మాత్రమే వహిస్తూ వుంటాడు.

ఆ తల్లి ఎవరికి ఎంత యివ్వమని ఆదేశిస్తే, వారికి అంత ధనాన్ని యిచ్చే బాధ్యతని మాత్రమే కుబేరుడు నిర్వహిస్తాడు. ధర్మంగా న్యాయంగా మనకి రావాల్సిన సంపదకి మించి ఎక్కువ సంపద కావాలని కోరుకోవటం వృధా. ఒక వేళ అన్యాయ మార్గంలో గాని, అధర్మాలు చేసి గాని అత్యధిక ధనాన్ని సంపాదించినా గాని అది మనవద్ద నిలవదు. ఆ ధనం మరో విధంగా మరొకరి ద్వారా ఖర్చయిపోతుంది. సాధారణంగా లోకంలో, ఒక తరంవారు ఎన్నోకష్టాలుపడి ఆస్తి పాస్తులని కూడ బెట్టడం, వారి తరువాతి తరం ఆ ఆస్తినంతా నాశనం చేయటం మనం చూస్తూనే వున్నాం. ఎప్పుడూ కూడా అన్యాయర్జితమైన ధనం నిలవదు. ఎంతో పిసినారితనంలో తను కడుపు నిండా తినక యితరులకు పెట్టక సంపాదించిన ధనం పిల్లలద్వారానో మరో విధం గానూ ఖర్చయిపోతుంది. కాని నిలకడగా వుండదు. మితిమీరిన ఆస్తి సంపాదించడం వల్ల మనశ్శాంతి దూరమవ్వటమే కాని ఏం ఉపయోగం లేదు. డబ్బు ఐశ్వర్యం, సంపదలని మించిన ధనాలు ఎన్నో వున్నాయి. అవే భక్తి ధనం,జ్ఞాన ధనం, వైరాగ్యధనం, యీ ధనాలు మనకి శ్రీధనలక్ష్మీ దేవి అనుగ్రహం వల్లనే చేకూరుతాయి అందువల్లనే ఆ తల్లిని సదా భక్తిజ్ఞాన వైరాగ్యాలు యివ్వమని ప్రార్థించాలి. సదాచారాలను పాటించేవారి వద్ద, తమ వద్ద నున్న ధనాన్ని, సంపదనీ సద్వినియోగం చేస్తూ ఎదుటి వారికి సాయం చేసే వారి వద్ద ధనం మరింతగా వచ్చి చేరుతుంది.

### పద్మవాసిని అయిన లక్ష్మీదేవీ మనకి ఏం తెలియజేస్తోంది?

లక్ష్మీదేవి వికసించిన పద్మంలో కూర్చుని వుంటుందని మనందరికీ తెలుసు. ఆ తల్లికి పద్మాలంటే ఎంతో యిష్టమని కూడా తెలుసు. పద్మాలు సదా ప్రవహించే నీళ్ళలో పెరుగుతాయి. ప్రవహించే నీరు ఉత్పాదకతకి సంకేతం. నీటిలోనే పుట్టి, నీటిలోనే పెరిగి, నీటిలోనే వాడిపోయే పద్మానికి నీరు ఏమాత్రం అంటుకోదు. నీళ్ళలో పుట్టినా పద్మం నీటి ఉపరితలభాగంలోనే వికసిస్తుంది. గాలికి ఎగిరి కొన్ని నీటి బిందువులు పద్మంలో పడినా అవి మంచి ముత్యాలలాగ మెరుస్తు వుంటాయి. కాని అవి పద్మానికి అంటుకోవు. యీ విధంగా ఆ తల్లి పద్మాల ద్వారా మనకి తెలియజేసే వేదాంత రహస్యం ఒకటి వుంది. మనం సదా ఈ సంసార జంఘాటంలో యిరుక్కుని వుంటాం. ఎంతగా సంసార చక్రంలో తిరుగుతూ వున్నా, ఏ మాత్రం ఆ విషయాలు మన మనస్సుకి పట్టకుండా, మనస్సు మాత్రం ఎల్లప్పుడూ దైవాధీనంచేయాలి. తామరాకుపై నీటి బొట్టు అనే సామెత వుండనే వుంది కదా! ఆ రకంగానే ఎంత సంసార బంధాలలో యిరుక్కుపోయినా మనస్సుని మాత్రం ప్రశాంతంగా పరిశుద్ధంగా భగవదర్పితం చేసుకున్న వారికి ఆ జగన్మాత లక్ష్మీదేవి అనుగ్రహం లభిస్తుంది.



## శ్రీధనలక్ష్మీదేవి స్వరూప స్వభావాలు

ధనలక్ష్మీదేవి మణిమయోపేతమైన బంగారు కిరీటం, సర్వాభరణాలు దాల్చి ఎర్రని పట్టుచీర కట్టుకుని తామరపూవులో కూర్చుని భక్తులను అనుగ్రహిస్తూ వుంటుంది. రెండు చేతులలో పద్మాలను ధరించి ఒక చేతితో బంగారు కాసులను భక్తులకు అందజేస్తూ వుంటుంది. వేరొక చేతితో అభయ ప్రదానం చేస్తూ వుంటుంది. ఆమె కట్టుకున్న ఎర్రటి పట్టుచీరకి బంగారపు రంగుగల అంచు వుంటుంది. అది ఆతల్లి భక్తులకు సదా సంపదలని అనుగ్రహిస్తూ వుంటుందని సంకేత పూర్వకంగా తెలియజేస్తుంది. ఒక చేతిలో పూర్ణ కుంభాన్ని, మిగిలిన చేతులతో శంఖు, చక్ర, బాణాదులనీ, లీలా విశేషంగా పుష్పాన్ని పట్టుకున్న ధనలక్ష్మీ దేవి రూప విశేషాలనీ కూడా మనం చూస్తూ వుంటాం.

శ్లో ॥ జగన్మాలా జగచ్చాలా జగద్దేవీ జాగృతీ
సర్వ భూత మనోవాంఛా సర్వప్రాణ మనోన్మనా ॥

శ్లో ॥ అరూపాచ విరూపాచ నిత్యస్థితి హేతవే
బహురూపామహారూపా బ్రహ్మణీ బ్రాహ్మణీ సదా

శ్లో ॥ సర్వకార్య మూలాధారా - సర్వాహంకార నాశినీ
కరణాకారణారూపీ - కనకలక్ష్మీంనమామ్యహం

కనకలక్ష్మీదేవిగా కూడా పిలవబడే ధనలక్ష్మీ మాత సర్వకార్యాలకీ మూలా ధారగాను, అహంకారాన్నీ నాశనం చేసే శక్తి గాను పై శ్లోకం ద్వారా మనకి తెలియవస్తోంది. అహంకారం వున్నవాళ్ళ దగ్గర ధనం వుండదు. కొంత మంది జీవిత ప్రారంభంలో అష్టకష్టాలు పడి చివరికి ఆ మాత అనుగ్రహం వల్ల ధనం సంపాదించి జీవితంలో స్థిరపడతారు. డబ్బు మరింతగా వచ్చి చేరటంతో చుట్టూ అనేక మంది భజనపరులు చుట్టూ చేరటం, అహంకారం తలకెక్కటం జరుగుతుంది. అందువల్ల వినాశం మొదలవుతుంది. ఈ విధంగా అహంకారులకి ఆ తల్లి ఏ విధంగా బుద్ధి చెప్పిందనే విషయం ఈ క్రింద వివరించిన శ్రీ ధనలక్ష్మీ మాహాత్మ్యం కథ ద్వారా తెలుస్తోంది.

## శ్రీధనలక్ష్మీ దేవి మహాత్మ్యం

పూర్వం కాశీనగరంలో ఒక ప్రముఖ వర్తకుడు ఉండేవాడు. అతని పూర్వీకులు చేసుకున్న తపః ఫలంగా, అతని పూర్వజన్మ పుణ్య ప్రభావం వల్ల, అతనికి ధనలక్ష్మీ దేవి కృపకలిగి వ్యాపారంలో బాగా కలిసి వచ్చింది. సమాజంలో గౌరవం పెరిగింది. 'తెప్పలుగా చెరువునిండినకప్పలు పదివేలు చేరుకదరా సుమతీ" అన్నట్లుగా డబ్బున్న వాడి చుట్టూ అనేక మంది భజన పరులు రకరకాల ఉద్దేశాలతో చేరతారు. అదేవిధంగా ఎందరో భజనపరులు అతనిచుట్టూ చేరి వర్తకుడు ఏం చెప్పినా, ఏం

చేసినా అతని మాటలకి తాళం వేస్తూ లోకంలో అతని కంటే గొప్పవాడు సమర్థుడు లేడని కీర్తిస్తూ వుండేవారు. బుద్ధిశాలి అయితే ఈ పొగడ్తలకి లొంగడు కాని అహంకారం తలకెక్కినపుడు అతి సులువుగా మనిషి పొగడ్తలకి లొంగిపోతాడు. అలాగే ఈ వర్తకుడు కూడా ఈ సంపద యావత్తూ తన సామర్థ్యం వల్లనే సంపాదించగలిగానని విర్రవీగుతూ ఆ ధనలక్ష్మీ దేవి కృపనే విస్మరించాడు. అతని నిర్లక్ష్యానికి ఆగ్రహించిన ఆ తల్లి తన ప్రతాపాన్ని చూపాలని నిర్ణయించుకుంది. యిక లాభాలు రావటం మానేసి వ్యాపారం సన్నగిల్లటం మొదలయింది. కాని అతని భార్యా బిడ్డలు మాత్రం వారి ఖర్చులని ఏమాత్రం తగ్గించుకోకపోవడంతో ఖర్చుల కోసం అప్పు చేయటం మొదలు పెట్టాడు. చివరికి ఆస్తి అంతా హరించుకుపోయి అప్పుల వాళ్ళు యిల్లు కూడా వేలం వేశారు. భార్య బిడ్డలతో కలసి అతనిని వదిలి పెట్టి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఇక ఏం చేయాలో తెలియక అడవి దారి బట్టాడు వర్తకుడు.

అతని దురవస్థ చూసి అతని మిత్రుడొకడు జాలిపడి ఏదో విధంగా స్నేహితునికి ఉపకారం చేయాలనే ఉద్దేశ్యంతో ఒక చేతికర్రలో వజ్రాలు పెట్టి వర్తకుడికి యిచ్చి దీని సాయంతో మళ్ళీ వ్యాపారం చేయండి అన్నాడు. దురదృష్టవంతుడైన వర్తకుడు విషయం గ్రహించలేక ఆ చేతి కర్రని అమ్మేసి వచ్చిన సొమ్ముతో ఆకలి తీర్చుకున్నాడు. అలాగే మరో స్నేహితుడు కూడా సాయం చేయాలనే వుద్దేశ్యంతో ఒక గుమ్మడికాయలో కాసులుపోసి వర్తకుడికి యిచ్చాడు. కాని దురదృష్టవంతుడైన ఆ వర్తకుడు దాన్ని కూడా అమ్మేసాడు. మరో మిత్రుడు వర్తకుడు సాయంకాలం యింటికి వచ్చే దారిలో మొహరీలు గుట్టగా పోయిస్తాడు. కాని చీకటిలో యింటికి వస్తున్న వర్తకుడు అంత ధనం ఎదురుగా వున్నా తెలుసుకోలేదు. ఎవరో రాళ్ళు దారికి అడ్డుగా పోసారని తిట్టుకుంటూ వాటిని తొక్కుకుంటూ ఆ చీకటిలో వెళ్ళిపోతాడు. ఆ తల్లి కటాక్షం లేకపోతే ఎవరికి ఎవరి సహాయం కూడా అందదు. చివరికి దిక్కుతోచని ఆ వర్తకుడు ఒక మహామునిని ఆశ్రయించి తన కష్టాలు తీరే మార్గం చెప్పమంటాడు. ఆ ముని దివ్య దృష్టితో జరిగింది తెలుసుకుని నీవు ధనలక్ష్మీ దేవి ఆగ్రహానికి గురి అయ్యావు కాబట్టి యిలా జరిగింది. ఆ తల్లిని శ్రద్ధతో 108 రోజులు అష్టోత్తర శతనామాలతో పూజించు. ఆ తల్లి అనుగ్రహం కలుగుతుందని చెప్పాడు. ముని చెప్పిన విధంగా వర్తకుడు దేవి పూజ చేయటం మొదలు పెట్టాడు. కాలం గడిచే కొద్దీ అమ్మవారికి దయ కలిగింది. మొదటగా విడిచిపెట్టి వెళ్ళిపోయిన భార్య తిరిగి వచ్చింది. తన ఆభరణాలు అమ్మి వ్యాపారం చేయమని యిచ్చింది. వర్తకుడు చిన్నగా మొదలు పెట్టిన వ్యాపారం త్వరలోనే పుంజుకుంది. కొంతమంది స్నేహితులు కూడా సాయం చేసారు. త్వరలోనే వ్యాపారం వృద్ధి చెంది పూర్వ వైభవం పొందగలిగాడు. ఈ కథ ద్వారా ఆ ధనలక్ష్మీదేవి మహత్త్యం ఎంతటిదో మనందరికీ అవగతం అవుతుంది.



ధనలక్ష్మీ దేవి మహిమను తెలిపే మరో కథ వ్రతరత్నాకరంలో వుంది.

**వావిలి లక్ష్మీవారపు నోము కథ :**

ఒక బ్రాహ్మణునకు నలుగురు కొడుకులు, నలుగురు కూతుళ్ళు వుంటారు. ఆఖరి కూతురి సంసారం అందరిలోకీ బీదది కావటంతో, మిగిలిన వారందరూ ఆమెని ఆమె పిల్లల్నీ హీనంగా చూసేవారు. ఒకసారి ఒక బంధువులింట్లో జరిగే పెళ్ళి సందర్భంలో మిగిలిన వారందరూ ఆ ఆఖరి కూతుర్ని, ఆమె పిల్లల్నీ ఆట పట్టించి హేళన చేయటం మొదలు పెట్టారు. అప్పుడు ఆ అమ్మాయిని చూసి మంచి మనస్సు గల ఆమె పెద్ద వదిన జాలిపడింది. తనకి తెలిసిన వావిలి లక్ష్మీవారపు వాయనం తన ఆడబడుచుకు ఇచ్చి, తద్వారా వారి "లేని" తనాన్ని పోగొట్టాలని అనుకుంది. వెంటనే ఒక చేటలో అద్దెడు తవ్వెడు కడిగిన బియ్యం మరో అద్దెడు తవ్వెడు కడగని బియ్యం పోసి ఒక వావిలి కొమ్మని, కొత్త రవికెల గుడ్డను, దక్షిణ తాంబూలాలు పెట్టి, చేటని మరో పాత చేటతో మూసి, గోడ మీద నుండి వాయనం అందిస్తుంది. ఆ అమ్మాయి ఈ విధమైన వావిలి వాయనం లక్ష్మీవారం నాడు తీసుకోవడంతో ధనలక్ష్మీదేవి ఆ కుటుంబంపై కరుణించింది దానితో క్రమంగా వారు సమస్త భోగభాగ్యాలు కలిపి శ్రీమంతులు అవుతారు. మరి కొన్నాళ్ళకి మరో పెళ్ళి సందర్భంలో వీరి సంపద చూసి అంతా వీరిని ఘనంగా సత్కరిస్తారు. కాని వీరికి బుద్ధిరావాలనే వుద్దేశంతో ఆ అమ్మాయి తన నగలన్నీ తీసి పీట మీద పెట్టి ఈ మర్యాదలన్నీ వీటికి చేయండి అని వెళ్ళిపోయింది. అప్పుడు మిగిలిన వారికి బుద్ధివచ్చి, ఏం నోమునోచి, ఈవిధంగా లక్ష్మీ కటాక్షాన్ని పొందావు అని అడుగుతారు. ఆ అమ్మాయి ద్వారా వావిలి లక్ష్మీవారపు నోము, వావిలి వాయనం వివరాలు తెలుసుకుని, అంతా ఆ నోము పట్టి వారు కూడా ధనవంతులయ్యారు. యిలాంటి చిన్న చిన్న కథల ద్వారా నోముల వ్రతాల రూపంలో ఆ తల్లి అనుగ్రహం వుంటే సంపదలు సాధించటం చిటికెలో పని అనీ భోగభాగ్యాలకి విలువ నివ్వకూడదని, శాశ్వతమైన భక్తి విశ్వాసాలతో ఆ లక్ష్మీదేవిని ఆరాధించాలని మన పూర్వీకులు మనకి తెలియజేసారు.

**శ్రీసూక్త సంస్తుతాం ఆకార ప్రకృతి మానితాం కళాత్మికాం**
**భగమాలినీ నిత్యస్వరూపాం సర్వఆశాపరిపూర్ణచక్ర స్వామినీం**
**భక్త్యాకర్షిణీ శక్తి స్వరూపిణీం శ్రీనారాయణ వక్షస్థల కమల**
**వాసినీం సర్వమంగళ దేవతాం శ్రీ సౌభాగ్యలక్ష్మీం ధ్యాయామి**

దీపావళినాడు చేసే ధనలక్ష్మీ పూజ విశేషమైన ఫలితాలను యిస్తుంది. దీపావళినాటి సాయంత్రం శుచిగా లక్ష్మీపూజ చేసి ప్రసాదాన్ని తన కుటుంబంతో పాటు చుట్టుపక్కల వుండే స్నేహితులకి బంధువులకి యివ్వటం భారతదేశం అన్ని ప్రాంతాలలోను వున్న సాంప్రదాయం. గురు, శుక్ర వారాలు, అష్టమీ, నవమీ, దశమీ తిథులు ఆ తల్లి పూజకి అనువైన రోజులు.

శ్రీసూక్తంలో హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజాం అని ఆమాత కీర్తించ బడుతుంది మేలిమి బంగారం మేనిచ్ఛాయగల ఆ ధనలక్ష్మీ మాత చంద్రుని కన్నా చల్లనైన తన కరుణా పూరిత దృక్కులతో సమస్త సంపదలని అనుగ్రహిస్తూ వుంటుంది.

## శ్రీ కనకధార స్తవము – సద్గురు కటాక్షము

ఈ ధన సంపద, భోగభాగ్యాలు అనేవి పూర్వజన్మలో మనం చేసుకున్న పాపపుణ్యాల ఫలితం వల్ల కలుగుతాయి, అందువల్లనే కొంతమంది జీవితాంతం భక్తిశ్రద్ధలతో అర్చించినా వారి దరిద్రంపోదు అనీ అంటూవుంటారు. కనకధారాస్తవానికి సంబంధించిన కథ ఈ విషయంలో ఒక చక్కని మార్గ నిర్దేశాన్ని చేస్తుంది. యిది ఆది శంకరాచార్యుల జీవితకాలంలో జరిగిన కథ. భిక్షాటనకు వెళ్ళిన శంకరుడు ఒక పేద బ్రాహ్మణుని యింటి ముందు నిలచి 'భవతీభిక్షాందేహి' అని అడుగుతాడు. ఆ యింట్లో నివసించే బ్రాహ్మణ దంపతులు ఎంతో నియమ నిష్టాగరిష్టులై సదా భగవధ్యానంలో నిమగ్నమై వుంటారు. ఇంటికి ఎవరైనా అతిథులు వచ్చినపుడు వారికి వున్నా లేకపోయినా అతిధులకి తగిన సత్కారం చేసేవారు. ఇంటిని ఎప్పుడూ కడిగిన ముత్యంలా శుభ్రంగా వుంచుకుని ఎవరు వచ్చినా ప్రేమపూర్వకంగా మాట్లాడేవారు. కాని వారికి ధనలక్ష్మీదేవి అనుగ్రహం లేకపోవడంతో గర్భ దారిద్ర్యంలో మ్రగ్గుతూవుండేవారు. ప్రతిరోజూ ఆ బ్రాహ్మణుడు యాయవార మునకు పోయి దినుసులు తీసుకువస్తే ఆ యిల్లాలు వాటిని వండి అతిధులకి పెట్టి వారు తినగా మిగిలింది ఆ దంపతులు తినేవారు. శంకరులు ఆ యింటికి భిక్షాటనకు వెళ్ళిన నాడు ఆ బ్రాహ్మణుడు మామూలుగా యాయవారానికి వెళ్ళాడు. ఆ బ్రాహ్మణ పత్ని మాత్రం యింటిలో వుంది. శంకరుని పిలుపు విని యిన్ని నాళ్ళకి తమకి శంకరునికి భిక్షవేసే అవకాశం కలిగింది కదా అని ఆ యిల్లాలు ఎంతో సంతోషించింది. దురదృష్టవశాత్తు ఆ దినము వారింటిలో భిక్ష వేయటానికి ఏ వస్తువూ మిగలలేదు. వెతకగా వెతకగా ఒక చిన్న ఉసిరికాయ మాత్రం దొరికింది. దానినే శంకరునికి భిక్షగా వేసింది. క్షణమాత్రంలోనే శంకరులు పరిస్థితి గ్రహించారు. యింత మంచి వారికి ఈ గర్భదారిద్ర్యమెందుకు అని ఆలోచించారు. వెంటనే ఆ సిరులను కురిపించే లక్ష్మీదేవిని కనకధారాస్తవము అనే అద్భుత స్తోత్రంతో కీర్తించారు.

## కనకధారాస్తోత్రమ్

వన్దేవన్దారు మన్దార మిన్దిరానంద కందలంఅమన్దానన్ద సందోహ బన్ధురం సింధురాననమ్
అంగం హరేః పులక భూషణమాశ్రయ న్తీ భృం గాంగ నేవ ముకుళాభరణం తమాలం
అంగీకృతాఖిలవిభూతి రపాంగలీలా మాంగల్యదాస్తు మమ మంగళ దేవతాయాః॥ 1

ముగ్ధా ముహుర్విదధతీ వదనే మురారేః ప్రేమత్రపా ప్రణిహితాని గతాగతాని,
మాలా దృశో ర్మధుకరీవ మహోత్పలేయా సా మే శ్రియం దిశతు సాగరసమ్భవాయాః॥ 2



శ్రీ కనకధారా స్తవము

విశ్వామరేంద్ర పద విభ్రమ దాన దక్ష మానంద హేతు రధికం మురవిద్విషో-పి
ఈషన్నిషీదతు మయి క్షణ మీక్షణార్ధం ఇందీవరోదర సహోదర మిందిరాయాః ॥ 3
ఆమీలితాక్ష మధిగమ్య ముదా ముకుంద మానందకంద మనిమేష, మనంగ తంత్రం
ఆ కేకరస్థిత కనీనిక పద్మనేత్రం భూత్యై భవే న్మమ భుజంగశయాంగనాయాః॥ 4
కాలామ్బుదాళి లలితో రసి కైటభారే ర్ధారాధరే స్ఫురతి యా తటి దంగనేవ
మాత స్సమస్త జగతాం మహనీయమూర్తి ర్భద్రాణి మే దిశతు భార్గవనందనాయాః 5
బాహ్వంతరే మురజితః శ్రితకౌస్తుభే యా హారావళీవ హరినీల మయీ విభాతి
కామప్రదా భగవతో-పి కటాక్షమాలా కల్యాణమావహతు మే కమలాలయాయాః ॥ 6
ప్రాప్తం పదం ప్రథమతః ఖలు యత్ప్రభావాత్ మాంగల్యభాజి మధు మార్థిని మన్మథేన
మయ్యాపతే త్తదిహ మంథర మీక్షణార్ధం మన్దాలసం చ మకరాలయ కన్యకాయాః॥ 7
దద్య ద్దయానుపవనో ద్రవిణాంబుధారా మస్మి న్నకించన విహంగశిశౌ విషణ్ణే
దుష్కర్మ ఘర్మ మపనీయ చిరాయ దూరం నారాయణ ప్రణయినీ నయనామ్బువాహః॥ 8
ఇష్టావిశిష్టమతయో-పి య యాదయార్ద్ర దృష్ట్యా స్త్రివిష్టప పదం సులభం భజన్తే
దృష్టిః ప్రహృష్ట కమలోదర దీప్తి రిష్టాం పుష్టిం కృషీష్ట మమ పుష్కరవిష్టరాయాః॥ 9
గీర్దేవ తేతి గరుడధ్వజ సుందరీతి శాకంభ రీతి శశిశేఖర వల్లభేతి
సృష్టిస్థితి ప్రళయ కేళిషు సంస్థితాయై తస్యైనమ స్త్రిభువనైక గురో స్తరుణ్యై ॥ 10
శ్రుత్యై నమోస్తు శుభకర్మఫల ప్రసూత్యై రత్యైనమోస్తు రమణీయ గుణార్ణవాయై
శక్త్యైనమోస్తు శతపత్ర నికేతనాయై పుష్ట్యై నమోస్తు పురుషోత్తమ వల్లభాయై॥ 11
నమోస్తు నాళీక నిభాననాయై నమోస్తు దుగ్ధోదధి జన్మభూమ్యై
నమోస్తు సోమామృత సోదరాయై నమోస్తు నారాయణ వల్లభాయై ॥ 12
నమోస్తు హేమాంబుజపీఠికాయై నమోస్తు భూమండలనాయికాయై
నమోస్తు దేవాది దయాపరాయై నమోస్తు శార్ఙ్గాయుధ వల్లభాయై ॥ 13
నమోస్తు దేవ్యై భృగునందనాయై నమోస్తు విష్ణో రురసిస్థితాయై
నమోస్తు లక్ష్మ్యై కమలాలయాయై నమోస్తు దామోదర వల్లభాయై ॥ 14
నమోస్తు కాన్త్యై కమలేక్షణాయై నమోస్తు భూత్యై భువన ప్రసూత్యై
నమోస్తు దేవాదిభి రర్చితాయై నమోస్తు నందాత్మజ వల్లభాయై ॥ 15
సంపత్కరాణి సకలేంద్రియ నందనాని సామ్రాజ్య దాననిరతాని సరోరుహాక్షి
త్వద్వందనాని దురితాహరణోద్యతాని మా మేవ మాత రనిశం కలయంతు మాన్యే॥ 16
యత్కటాక్ష సముపాసనా విధిః సేవకస్య సకలార్థ సంపదః
సంతనో తి వచనాంగమానసై స్త్వాం మురారి హృదయేశ్వరీం భజే ॥ 17
సరసిజనయనే! సరోజహస్తే! ధవళతరాంశుక గంధమాల్య శోభే!
భగవతి! హరివల్లభే మనోజ్ఞే! త్రిభువనభూతికరి! ప్రసీద మహ్యమ్ ॥ 18
దిగ్హస్తిభిః కనకకుంభముఖావసృష్ట స్వర్వాహినీ విమలచారు జలప్లుతాంగీం
ప్రాత ర్నమామి జగతాం జననీ మశేష లోకాధినాథ గృహిణీ మమృతాబ్ధిపుత్రీమ్ ॥ 19



కమలే కమలాక్షవల్లభే త్వం కరుణాపూర తరంగితై రపాంగైః
అవలోకయ మా మకించనానాం ప్రథమం పాత్ర మకృత్రిమం దయాయాః ॥ 20
బిల్వాటవీ మధ్య లసత్సరోజే సహస్ర పత్రే సుఖ సన్నివిష్టామ్
అష్టాప దామ్భోరుహ పాణి పద్మాం సువర్ణ వర్ణాం ప్రణమామి లక్ష్మీమ్ ॥ 21
కమలాసన పాణినా లలాటే లిఖితా మక్షరపంక్తి మస్య జంతోః
పరిమార్జయ మాత రంఘ్రిణా తే ధనికద్వార నివాస దుఃఖ దోగ్ధ్రీమ్ ॥ 22
అంభోరుహం జన్మగృహ్యం భవత్యాః వక్షస్థలం భర్తృగృహం మురారేః
కారుణ్యతః కల్పయ పద్మవాసే లీలాగృహం మే హృదయారవిందమ్ ॥ 23
స్తువంతి యే స్తుతిభి రమూభిరన్వహం త్రయీమయీంత్రిభువనమాతరం రమాం
గుణాధికా గురుతర భాగ్యభాజినో భవంతి తే భువి బుధభావితాశయాః ॥ 24

శంకరుని పిలుపు విన్న లక్ష్మీదేవి వెంటనే స్పందించింది. ఆమెకీ తెలుసుకదా ఆదిశంకరాచార్యులు తన సోదరుడైన పరమ శివుని అవతారం అని. అందువల్ల వెంటనే శంకరుని ఎదుట ప్రత్యక్షమయి విషయం ఏమని అడుగుతుంది. ఈ యింటిలో నివసించే బ్రాహ్మణ దంపతులను దయతో అనుగ్రహించవలసింది అని శంకరుడు ఎంతో భక్తితో విన్నవిస్తాడు. అన్నీ విన్న లక్ష్మీదేవి పూర్వజన్మలో ఈ బ్రాహ్మణులు పుణ్యం చేసుకోలేదు. ఏ రకంగా చూసినా వీరు నా కరుణకి అర్హులు కారు. వచ్చే జన్మలో వీరిని తప్పక అనుగ్రహిస్తాను అని శెలవిస్తుంది. కాని శంకరుడు ఎంతో యుక్తి యుక్తంగా ఆ తల్లితో వాదనకి దిగుతాడు. ఓ తల్లీ నీవు నివసించే ప్రదేశాల గురించి నువ్వే చెప్పావు కదా! ఈ దంపతులు నువ్వు చెప్పిన అన్ని రకాల ఆచారాలను పాటించే పరమభక్తులు. అతిధి మర్యాదలు చేసే ఉత్తమ గృహస్థులు. వీరిని కరుణించటం నీకు ఎంతైనా యుక్తం అని చాలా గౌరవంతో భక్తిశ్రద్ధలతో ఆ తల్లిని వేడుకుంటాడు. శంకరుని అద్భుత వాదనని విన్న ఆ జగన్మాత ఎంతో సంతోషించి వెంటనే వారింట బంగారు కాసుల వర్షం కురిపించింది. ఆ విధంగా ఆ బ్రాహ్మణ దంపతులు సద్గురువు అయిన ఆదిశంకరుల అనుగ్రహం ద్వారా ఆ ధనలక్ష్మీమాత కటాక్షాన్ని పొందగలిగి ధన్యులయ్యారు. ఈ కనకధారాస్తవము చాలా శక్తివంతమైనది. ఆర్థిక సమస్యలు ఎదురైనపుడు భక్తి శ్రద్ధలతో కనకధారాస్తవాన్ని పఠించి ఆ తల్లిని ప్రార్థిస్తే మన సమస్యలన్నీ తీరిపోయి ఆ తల్లి అనుగ్రహం పరిపూర్ణంగా కలుగుతుంది. ఈవిధంగా సద్గురు కటాక్షం వుంటే మనం పూర్వజన్మలో చేసుకున్న పాపపుణ్య ప్రభావాలకి అతీతులుగా ఆ జగన్మాత కరుణా కటాక్షాలను పొందగలం అనే విషయం మనకు అర్థమవుతుంది. అందువల్లనే సద్గురువుని ఆశ్రయించటం ఎంతో అవసరం.

ఈ విధంగా శ్రీ ధనలక్ష్మీదేవి ఆగ్రహానుగ్రహ సమర్థురాలని పై కథల ద్వారా తెలుస్తోంది. ఎన్ని రకాలుగా చెప్పుకున్నా ఈ సంసార బంధంలో చిక్కుకుని సుఖ దుఃఖాలు సమానంగా అనుభవిస్తూ సాధ్యమైనంత వరకు కష్టాలు లేకుండా తాము, తమ పిల్లలు సుఖమయ జీవనం గడపాలని కోరుకునే సామాన్య ప్రజానీకానికి ఆ

ధనలక్ష్మీమాత కటాక్షం, తద్వారా లభ్యమయ్యే సంపదల అవసరం గురించి మనం ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అవసరం లేదు. ఆ తల్లి అనుగ్రహం కోసం అందరూ ప్రార్థనలు చేస్తూ వుంటారు. కాని ప్రత్యేక బీజాక్షరాలతోను, నిత్య గాయత్రి జపంతోను ఆతల్లిని అర్చిస్తే విశేష ఫలితాలు కలుగుతాయి.

**శ్రీధనలక్ష్మీదేవి బీజాక్షరాలు "ఓం ఐం హ్రీం శ్రీం"**

రోజుకి 108 సార్లు ఈ బీజాక్షరాలని జపించిన వారికి ఆ తల్లి కటాక్షం పరిపూర్ణంగా కలుగుతుంది.

**శ్రీ ధనలక్ష్మీదేవి నిత్యగాయత్రి ఈ విధంగా వుంటుంది.**

"భగమాలిన్యై విద్మహే సర్వవశంకర్యైధీమహి తన్నో నిత్య ప్రచోదయాత్"

భగమాలిని అనే శబ్దానికి అర్థం షడ్గుణైశ్వరాలకి అధిష్ఠాన దేవత అయిన శ్రీ ధనలక్ష్మీ దేవి అని 1. ఐశ్వర్యము 2. ధర్మము 3. యశస్సు 4. సిరి 5. జ్ఞానము 6. వైరాగ్యము అనే ఈ ఆరూ షడ్గుణైశ్వర్యాలు వీటన్నింటినీ సమగ్రరూపంలో అందించేది శ్రీ ధనలక్ష్మీమాత. ఈ నిత్య గాయిత్రి చాలా శక్తివంతమైనది. భక్తి శ్రద్ధలతో ఈ నిత్య గాయిత్రి జపాన్ని 108 మార్లు చేసిన వారికి కోరిన కోర్కెలు తక్షణం సిద్ధిస్తాయి. శాశ్వతములైన జ్ఞానవైరాగ్య ధర్మ యశస్సంపదలు ప్రాప్తించిన వారు ఎంతో వినయవిధేయతలతో ప్రేమపూర్వకంగా అందరితో వ్యవహరిస్తారు.

ప్రతినిత్యం ఆ జగన్మాతపూజ చేసుకుని ఆ ధనలక్ష్మీదేవిని అష్టోత్తర శతనామాలతో అర్చించే వారికి ఆ ధనలక్ష్మీదేవి కటాక్షం పరిపూర్ణంగా లభిస్తుంది. ఆ తల్లి అనుగ్రహం వల్ల అందరూ సుఖసంతోషాలతో వర్ధిల్లెదరు గాక!

## శ్రీధనలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రం

శ్రీకాంతా శివ సంధాత్రీ శ్రీమత్ క్షీరాబ్ధి కన్యకా
శ్రీపదాశ్రిత మందారా సిద్ధిదా సిద్ధ రూపిణీ॥ 1
ధనధాన్యప్రదే దేవి దారిద్ర్య విధ్వంసినీ
దుఃఖ హారీ పాపహారీ దుస్తరైశ్వర్య దాయినీ॥ 2
పద్మహస్తా పద్మనేత్రీ పద్మజా పద్మవాసినీ
పద్మపాణీ పద్మపాదా పద్మశంఖ నిధి ప్రదా॥ 3
విత్తేశీ విశ్వ పాలినీ విష్ణు వక్షో విహారిణీ
విశ్వేశీ విశ్వరూపాచ వికుంతేశ చిరంటికా॥ 4
ధనరూపా ధాన్యరూపా గోక్షేత్ర స్వరూపిణీ
భూసుర ప్రియం శ్రీలక్ష్మీ సర్వభూత హితంకరీ॥ 5
సృష్టి రూపీ తపోరూపీ మౌనరూపీ మహామతీ
మాధవీభూయ మౌనా మధుసూదన మనోహరీ॥ 6



సర్వసంపత్కరేదేవి సర్వాపన్నివారిణీ
అష్టైశ్వర్య ప్రదే లక్ష్మీ సర్వ దారిద్ర్య నాశినీ॥ 7
స్వర్ణాభా స్వర్ణ రూపాచ స్వర్ణదా స్వర్ణ మాలికా
జగన్మాతర్జగన్నేత్రీ జగద్భృత్ జంభకారిణీ ॥ 8
జగన్మూలా జగచ్ఛాలా జగజ్జీవన హేతవే
బిందురూపీ దయాసింధూ దీనబంధుర్ధన ప్రదా॥ 9
భార్గవీ బ్రహ్మాండేశీ భక్తసులభా భయావహా
శుభాం శుభగినీ శుద్ధాసురాసుర సుపూజితా॥ 10
శుభదా వరదా దేవి శుచి శుభ్ర ప్రియాయాచ
భక్త సులభా భక్త సురభీ భవహా పరమాత్మికా॥ 11
కామదః కమలాం కాంతాం కామాక్షీ క్రోధేన సంభవా
రత్నాకర సుపుత్రీచ కరుణాకర నేత్రాయచ॥ 12
ఈశావాస్యా మహామాయా మహదేవీ మహేశ్వరీ
మహాలక్ష్మీ మహాకాళీ మహాకన్యా సరస్వతీ॥ 13
భోగవైభవ సంధాత్రీ భక్తానుగ్రహకారిణీ
సిద్ధలక్ష్మీ క్రియాలక్ష్మీ మోక్షలక్ష్మీ ప్రసాదినీ॥ 14
అరూపాబహు రూపాచ విరూపా విశ్వరూపిణీ
పంచభూతాత్మికావాణీ పంచ బ్రహ్మాత్మికా పరా॥ 15
దేవమాతా సురేశానాం వేదగర్భాంబికా ధృతిః
సహస్రాదిత్యసంకాశా చంద్రికా చంద్ర రూపిణీ॥ 16
దారిద్ర ధ్వంసినీ దేవి హృదయగ్రంధి విభేదినీ
ధనలక్ష్మీ నమో నమః రక్షమాం రక్షమాం సదా॥ 17

## సౌభాగ్యమ్ముల బంగరు తల్లీ! సౌభాగ్య లక్ష్మీదేవికి నీరాజనాలు

నుదుట కుంకుమ రవి బింబముగ
కన్నుల నిండుగ కాటుక వెలుగ
కాంచనహారము గళమున మెరయగ
పీతాంబరముల శోభలు నిండగ ॥సౌ॥
నిండుగ కరముల బంగరు గాజులు ముద్దులొలుక
పాదమ్ముల మువ్వలు గలగలయని సవ్వడి చేయగ
సౌభాగ్య సతుల సేవలచేయగ॥సౌ॥
నిత్యసుమంగళి, నిత్య కళ్యాణి, భక్తజనులకూ
కల్పవల్లి, కమలాసనవై కరుణనిండుగా
కనకవృష్టి కురిపించే తల్లి ॥సౌ॥

## ఆంధ్రదేశంలోని ప్రముఖ అష్టలక్ష్మీ ఆలయాలు

హైదరాబాదు – దిల్‌షుక్‌నగర్‌లోని అష్టలక్ష్మీ ఆలయం
సికింద్రాబాదు – వాసవీ కాలనీలోని అష్టలక్ష్మీ ఆలయం.
చిత్తూరుజిల్లాలోని వేపంజేరిలో అష్టలక్ష్మీ ఆలయం
గుంటూరు పట్టణంలోని అష్టలక్ష్మీ అమ్మవార్ల ఆలయం
విజయవాడ శ్రీకనకదుర్గమ్మతల్లి ఆలయంలోని అష్టలక్ష్మీమూర్తులు
రాజమండ్రిలోని అష్టలక్ష్మీ ఆలయం
తూర్పుగోదావరిజిల్లా ద్వారపూడిలోని అష్టలక్ష్మీఅమ్మవార్లు
హైదరాబాద్ రామకృష్ణాపురంలోని అష్టలక్ష్మీ దేవాలయం

ఇవి ప్రముఖమైనవి. ఇవిగాక దేశంలోని వివిధ ఆలయాలలో ఆదిలక్ష్మీదేవి, అనంతలక్ష్మీదేవి, రాజ్యలక్ష్మీదేవి ఆదిగాగల అనేకరూపాలలో ఆ తల్లి సేవింప బడుతోంది.



పొరుగురాష్ట్రమైన తమిళనాడు రాజధాని చెన్నై నగరంలో అడయారు సమీపంలో సముద్రం ఒడ్డున బీసెంట్‌నగర్ అనేచోట ప్రసిద్ధమైన అష్టలక్ష్మీ దేవాలయం నిర్మించబడింది. కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ చంద్రశేఖ రేంద్ర సరస్వతీ స్వామివార్ల ఆదేశానుసారం వారి పర్యవేక్షణలో ఈ ఆలయనిర్మాణం, సంప్రోక్షణం జరిగింది. మధ్యలో లక్ష్మీనారాయణుల విగ్రహాలు వారి చుట్టూ వివిధ అంతస్థులలో అష్టలక్ష్మీమూర్తులు ఎంతో మనోహరంగా ప్రతిష్టించబడ్డాయి.

ఇవిగాక భగవాన్ రమణ మహర్షి నివశించిన పుణ్యభూమి అరుణాచలం, తిరువణ్ణామలై క్షేత్రంలోని అరుణచలేశ్వరస్వామి ముఖమండపములోని అష్టలక్ష్మీ మూర్తులు ఎంతో ప్రసిద్ధి కెక్కినవి. దేశంలోని అతిపెద్ద శివాలయం కుంభకోణంలోని శ్రీ కుంభేశ్వరస్వామి ఆలయం. ఆ ఆలయప్రాంగణంలోని అష్టలక్ష్మీ మూర్తులు ఎంతో పురాతన మైనవని విశేషమైనవనీ అంటారు.

శ్రీధనలక్ష్మీదేవి ప్రతిరూపంగా పిలువబడే శ్రీకనకమహాలక్ష్మీ అమ్మవారు విశాఖపట్టణంలో కొలువుండి భక్తులను చల్లగా బ్రోచి కాపాడుతూవున్నది. కొల్హాపురిలోని మహాలక్ష్మీదేవి అష్టాదశ పీఠాలలోను ప్రముఖమైనది. మిగిలిన పీఠాలలో పార్వతీదేవి, దుర్గ, కాళి రూపాలలో పూజింపబడే ఆ జగన్మాత కొల్హాపురిలో శ్రీమహాలక్ష్మీరూపాన్ని ధరించి భక్తుల పూజలు అందుకుంటోంది. ఆ తల్లిని శ్రీ గజలక్ష్మీదేవి అవతారంగా చెప్పటం ఆనవాయితీ.

ఇలా అనేకచోట్ల అనేక రూపాలలో ఆ తల్లి వెలసివుంది దేశంలోని వివిధ ప్రదేశాలలోని భక్తులను చల్లగా బ్రోచి కాపాడుతూ వుంటుంది. ఆ జగన్మాత లక్ష్మీదేవి.





## ధన లక్ష్మీ యంత్రము

### మూల మంత్ర ధ్యాన శ్లోకములు

ఓం నమో భగవతీ ధనలక్ష్మీ ఓం సౌంః శ్రీం
ఐం ఐం శ్రీం సౌః మమ గృహే సర్వకార్యాణి
సాధయ సాధయ, మమ కుటుంబే ధనం విద్యాంభోగం చ
జాతయ జాతయ నిత్యసంతోషం కురు కురు స్వాహా –
**108** సార్లు కుంకుమార్చన – జపము – హోమము చేసేది



1. యంత్రమును రాగిరేకు మీదగాని, వెండిరేకు మీద గాని, బంగారు రేకు మీద గాని ఉన్న యక్షరములు తప్పులు లేకుండా లికించాలి.
2. 5×5 అంగుళముల చతురస్రంగా యుండాలి.
3. వ్యాపార పూజా మందిరములందు, గృహపూజా మందిరములందు దేవాలయము లందు శుభ్రతగా నుంచాలి.
4. ప్రతి శుక్రవారం యంత్రమును నిమ్మకాయతోగాని, చింతపులుసుతో గాని శుభ్రపరిచి, పసుపు, కుంకుమ అలంకరణములు చేసి సాంబ్రాని పొగవేసి, కొబ్బరికాయ కొట్టి నివేదన జరపాలి.
5. మూల మంత్రమును 108 సార్లు చదువుచూ యంత్రము మీద కుంకుమ ఉంచాలి. ఆ కుంకుమను సదా బొట్టుగా పెట్టుకొనుట మంచిది.
6. లక్ష్మీ అష్టోత్తర శతనామములతో నైననూ కుంకుమార్చన చేయవచ్చును.
7. ప్రతి పూర్ణిమయందు రాగి పుల్లలతో, తులసీమున్నగు పుల్లలతో మూలమంత్రమును పఠించుచూ ఆవు నేతితో హోమమును చేయాలి. ఆ రోజున 5 గురు బ్రాహ్మణ సంతర్పణములు చేస్తే మంచిది. ప్రసాదములు వారిష్ట ప్రకారము చేయవచ్చును.



## శ్రీ ధనలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

ఓం శ్రీకాంతాయై నమః
ఓం శివసంధాత్రై నమః
ఓం శ్రీమత్ క్షీరాబ్ధికన్యకాయై నమః
ఓం శ్రీ పద్మాయై నమః
ఓం శ్రితమందారాయై నమః
ఓం సిద్ధిదాయై నమః
ఓం సిద్ధరూపిణ్యై నమః
ఓం ధనధాన్య ప్రదాయిన్యై నమః
ఓం దారిద్ర్యవిధ్వంసిన్యై నమః
ఓం దుఃఖహరాయై నమః
ఓం పాపహారిణ్యై నమః 10
ఓం దుస్తరైశ్వర్యదాయిన్యై నమః
ఓం పద్మహస్తాయై నమః
ఓం పద్మ నేత్రాయై నమః
ఓం పద్మజాయై నమః
ఓం పద్మవాసిన్యై నమః
ఓం పద్మపాణిన్యై నమః
ఓం పద్మపాదాయై నమః
ఓం పద్మశంఖ నిధిప్రదాయిన్యై నమః
ఓం విత్తేశ్యై నమః
ఓం విశ్వపాలిన్యై నమః 20
ఓం విష్ణువక్షోవిహారిణ్యై నమః
ఓం విశ్వేశ్యై నమః
ఓం విశ్వరూపిణ్యై నమః
ఓం వికుంఠేశచిరంటికాయై నమః
ఓం ధనరూపాయై నమః
ఓం ధాన్యరూపాయై నమః
ఓం గోక్షేత్ర స్వరూపిణ్యై నమః
ఓం భూసుర ప్రియాయై నమః
ఓం శ్రీలక్ష్మ్యై నమః
ఓం సర్వభూతహితంకర్త్యై నమః 30
ఓం సృష్టి రూపిణ్యై నమః
ఓం తపోరూపిణ్యై నమః
ఓం మౌన రూపిణ్యై నమః
ఓం మహామత్యై నమః
ఓం మాధవీయై నమః
ఓం భూయాయై నమః
ఓం మౌనాయై నమః
ఓం మధుసూదన మనోహారిణ్యై నమః
ఓం సర్వసంపత్కర్త్యై నమః
ఓం సర్వాపన్నివారిణ్యై నమః 40
ఓం అష్టైశ్వర్య ప్రదాయిన్యై నమః
ఓం సర్వదారిద్ర్యవినాశిన్యై నమః
ఓం స్వర్ణాభాయై నమః
ఓం స్వర్ణరూపిణ్యై నమః
ఓం స్వర్ణ దాయిన్యై నమః
ఓం స్వర్ణమాలికాయై నమః
ఓం జగన్మాతాయై నమః
ఓం జగన్నేత్రాయై నమః
ఓం జగద్భృత్యై నమః
ఓం జంభకారిణ్యై నమః 50
ఓం జగన్మాలాయై నమః
ఓం జగచ్ఛాలాయై నమః
ఓం జగజ్జీవన హేతవ్యై నమః
ఓం బిందురూపిణ్యై నమః
ఓం దయాసింధవేనమః
ఓం దీనబాంధవ్యై నమః
ఓం ధనప్రదాయిన్యై నమః
ఓం భార్గవ్యై నమః
ఓం బ్రహ్మాండేశ్యై నమః
ఓం భక్తసులభాయై నమః 60
ఓం భయాపహారణ్యై నమః
ఓం శుభాంశుభగిన్యై నమః
ఓం శుద్ధాయై నమః
ఓం సురసుర పూజితాయై నమః
ఓం శుభదాయై నమః
ఓం వరదాయై నమః
ఓం శుచిశుభ్ర ప్రియాయై నమః
ఓం భక్తసులభాయై నమః
ఓం భక్తసురభిణ్యై నమః
ఓం పరమాత్మికాయై నమః 70
ఓం కమలాయై నమః
ఓం కాంతాయై నమః
ఓం కామాక్ష్యై నమః
ఓం క్రోధ సంభవాయై నమః
ఓం రత్నాకర సుపుత్రికాయై నమః
ఓం కరుణాకర నేత్రాయై నమః
ఓం ఈశావాస్యాయై నమః
ఓం మహామాయాయై నమః
ఓం మహాదేవ్యై నమః
ఓం మహేశ్వరీయై నమః 80
ఓం మహాలక్ష్మీయై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం మహాకన్యాయై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం భోగవైభవసంధాత్యై నమః
ఓం భక్తానుగ్రహకారిణ్యై నమః
ఓం సిద్ధిలక్ష్మీయై నమః
ఓం క్రియాలక్ష్మీయై నమః
ఓం మోక్షలక్ష్మీయై నమః
ఓం ప్రసాదిన్యై నమః 90
ఓం అరూపాయై నమః
ఓం బహురూపాయై నమః
ఓం విరూపాయై నమః
ఓం విశ్వరూపిణ్యై నమః
ఓం పంచభూతాత్మికాయై నమః
ఓం వాణ్యై నమః
ఓం పంచబ్రహ్మాత్మికాయై నమః
ఓం పరాయై నమః
ఓం దేవమాతాయై నమః
ఓం సురేశానాయై నమః 100
ఓం వేదగర్భాయై నమః
ఓం అంబికాయై నమః
ఓం దృత్యై నమః
ఓం సహస్రాదిత్య సంకాశా నమః
ఓం చంద్రికాయై నమః
ఓం చంద్రరూపిణ్యై నమః
ఓం దారిద్ర్యధ్వంసిన్యై నమః
ఓం హృదయగ్రంధి భేదిన్యై నమః

## 12.శ్రీ అష్టలక్ష్మీ పూజావిధానము

ఏ పూజ చేసుకోవాలన్నా ముందుగా మనకి ఆ పూజకి కావలసిన సామాగ్రి ఏమిటి? ఆపూజ ఎప్పుడు చేసుకోవాలి, ఎక్కడ చేసుకోవాలి, ఆ పూజ చేసుకునే మంటపం ఏ రకంగా తయారు చేసుకోవాలి, ఏవిధమైన నియమాలు పాటించాలి, పూజ చేసుకునే విధానం ఏమిటి? అనే విషయాలు తెలియాలి.

### అష్టలక్ష్మీ పూజకి కావలసిన సామగ్రి

1.పసుపు,2.కుంకుమ, 3. పువ్వులమాల, 4.విడిపువ్వులు, 5.కూర్చోడానికి చిన్నచాప లేదా పీటలు, 5.ప్రధానకలశానికి, మిగిలిన కలశాలకి పాత్రలు, 6.అష్టలక్ష్మీ పటం,7.ఆచమనం చేయడానికి పంచపాత్ర లేదా గ్లాసు, ఉద్ధరిణి, 8.కలశారాదనకి వేరే గ్లాసు లేదా చెంబు, 9. దీపపు కుందెలు, 10.వత్తులు, 11.అగరవత్తులు, 12.హారతికర్పూరం, 13.పత్తితోచేసుకున్న వస్త్రాలు, యజ్ఞోపవీతములు, 14.ఆవు నెయ్యి,15.మంచిగంథం, 16.పంచామృతము (ఆవు పాలు, నెయ్యి, పెరుగు,బెల్లం, తేనె) 17.అక్షతలు (నీరు తగలకుండా బియ్యంలో పసుపుకొంచెం వేసి కలుపుకోవాలి. 18.కలశాలమీద పెట్టుకోవడానికి రవికలగుడ్డ, 19.తమల పాకులు, 20.వక్కలు, 21.నైవేద్యానికి కొబ్బరికాయలు, అరటిపళ్ళు, పాలు, పటిక బెల్లం, వడపప్పు, పానకం 22.మంటపంకోసం చిన్నతువ్వాలు, 23.కలశంలోనికి మామిడాకులు, 24.పద్మంవేసేనిమిత్తం బియ్యంపిండి, 25.గంట, పూజకి కావలసిన సామాగ్రి అంతా సమకూర్చుకున్నాక యింటికి ఉత్తర, తూర్పు దిక్కుల మధ్య వుండే ఈశాన్య ప్రదేశంలో పూజ చేసుకోవాలి. పూజ చేసుకునే గదికి ఈశాన్యమూల కూడా పూజ చేసుకోవచ్చు. ఎక్కడ పూజ చేసుకోవాలను కుంటున్నామో అక్కడ శుభ్రంగా కడిగి, బియ్యంపిండితో అష్టదళపద్మం వేసుకుని దానిపై పూజా మండపాన్ని తయారుచేసుకోవాలి.

### లక్ష్మీదేవి - అదృష్టం

Luck = అదృష్టాన్ని; She = ఆ తల్లి; Me = నాకు కలుగుజేయుగాక పై మూడింటినీ కలిపిచదివితే లక్ష్మి అవుతుందని మనందరికీ తెలుసు. ఏపనైనా అవ్వకపోతే అబ్బే నాకు లక్ లేదు. అందువల్లనే ఆ పని అవ్వలేదు అనటం ఈకాలంలో ఒక ఫ్యాషన్ అయిపోయింది. ప్రతీదీ అదృష్టం మీద తోసేసి మన బాధ్యతలనుంచి మనం పారిపోవటం గాక ఇది మరేమీ కాదు. అసలు ఈ విధమైన అదృష్టాలన్నింటికీ అధిష్టానదేవత లక్ష్మీదేవి. ఆ తల్లి అనుగ్రహం వున్నవారికి అన్ని అదృష్టాలు అడగకుండానే వస్తాయి. అందువల్ల అచంచల భక్తి విశ్వాసాలతో ఆ తల్లిని కొలిచేవారికి తలచిన కార్యాలన్నీ నెరవేరుతాయి. పైన చెప్పినట్లుగా అదృష్టాన్ని నాకు కలగజేయి అంటే ఏ అదృష్టం? అశాశ్వతమైన భోగభాగ్యాలు కోరుకోకూడదు. ఆ తల్లి మంచి భక్తి, జ్ఞాన, వైరాగ్య సంపదలని ఆశిస్తే వాటి ద్వారా శాశ్వతమైన మోక్షం లభిస్తుంది.



### శ్రీ అష్టలక్ష్మీ పూజామంటపం తయారుచేసుకునే విధానం

ఒక కడిగిన పీటపై బియ్యంపిండితో పద్మాలను వేసి ఆ తరువాత దానిపైన ఒక తెల్లని కొత్తతువ్వాలు పరచుకోవాలి. తువ్వాలు మీద ఒకటింపావుకిలో బియ్యాన్ని పోసి సరిచేయాలి. తువ్వాలు మీద బియ్యం మధ్యలో ప్రధాన కలశం వుంచాలి. ఇది ఆదిలక్ష్మీదేవి కోసం. వెండి, రాగి లేక ఇత్తడి చెంబుని ప్రధాన కలశంగా వాడుకోవచ్చు. కలశంలో సగం వరకు నీరు పోసి ఆనీటిలో కొంచెం పన్నీరు, పచ్చకర్పూరం, యాలకులు, ఒకరూపాయినాణెం వేయాలి. చెంబుపైన అయిదు మామిడి ఆకులువుంచి వీటి మధ్య కొబ్బరికాయ పిలకపైకి వచ్చేలా పెట్టాలి. త్రికోణాకారంలో మడిచిన రవికల గుడ్డని కొబ్బరికాయ మీద వుంచి పువ్వులు పెట్టాలి. కలశానికి నాలుగువైపులా గంథం, పసుపురాసి బొట్టుపెట్టాలి. ఈ ప్రధాన కలశం వెనుక భాగంలో అష్టలక్ష్మి మూర్తులపటం పెట్టుకోవాలి. మిగిలిన అష్టలక్ష్మి మూర్తుల అర్చనా ప్రదేశాలుప్రధాన కలశం చుట్టూవుంటాయి. ఆయా ప్రదేశాలలో చిన్న చిన్న కలశాలను గాని ఒక తమలపాకు, వక్క, రూపాయినాణెంకాని పెట్టుకో వచ్చు. రవికలగుడ్డ మాత్రం విధిగా పెట్టాలి. ప్రధాన కలశం అంటే ఆదిలక్ష్మీదేవికి ఆగ్నేయంలో ధాన్యలక్ష్మి వుంటుంది. అక్కడ ఒక తమలపాకు వక్క, రూపాయినాణెం, రవికలగుడ్డ వుంచాలి. ప్రధాన కలశానికి దక్షిణ దిక్కున ధైర్యలక్ష్మి వుంటుంది. అక్కడకూడా తమల పాకు వక్క, రూపాయి నాణెం రవికలగుడ్డ ఉంచాలి. గజలక్ష్మీదేవి ప్రధాన కలశానికి నైఋతి దిశలో వుంటుంది. అక్కడ గజలక్ష్మీదేవి నిమిత్తం తమల పాకువక్క, రూపాయినాణెం, రవికెలగుడ్డ వుంచాలి. ఆదిలక్ష్మీదేవికి పడమర దిక్కున సంతానలక్ష్మి నివాసం వుంటుంది. అందువల్ల పడమర దిశలో ఆకువక్క, రూపాయి నాణెం, రవికలగుడ్డ వుంచాలి. సకల విజయాలని ప్రసాదించే విజయలక్ష్మి ఆదిలక్ష్మీ దేవికి వాయువ్యదిక్కున వుంటుంది. ఆ తల్లినిఉద్దేశించి వాయువ్య దిక్కున తమలపాకు, వక్క, రూపాయినాణెం, రవికలగుడ్డ వుంచాలి. సకల విద్యాస్వరూపిణి విద్యాలక్ష్మి ఆదిలక్ష్మి మాతకి ఉత్తర దిక్కున నివాసం ఉంటుంది. తమలపాకు వక్క, రూపాయి నాణెం, రవికెలగుడ్డ అక్కడ వుంచాలి. ఇక సకలైశ్వర్యదాయిని ధనలక్ష్మి మాత ఆదిలక్ష్మి దేవకి ఈశాన్యంలో ఉంటుంది. ఆ మాత నిమిత్తం ఒక తమలపాకువక్క, రూపాయి నాణెం, రవికెలగుడ్డ మండపానికి ఈశాన్యంలో ఉంచాలి. ఈ విధంగా అష్టలక్ష్మి మంటపాన్ని తయారు చేసుకోవాలి. అష్టలక్ష్మీపూజ చేసేముందు కొన్ని ముఖ్యమైన విషయాలు జ్ఞాపకం పెట్టుకోవాలి.

1. ఆది లక్ష్మీదేవిని తెల్లటి రంగు రవికలగుడ్డ తెల్లటి పువ్వులతో పూజించాలి.
2. ధాన్యలక్షి దేవిని ఆకుపచ్చ రవికలగుడ్డ వుంచి పచ్చని పూలతో పూజించాలి.
3. ధైర్యలక్ష్మి దేవిని ఎరుపురంగు రవికలగుడ్డ ఎర్రని పూలతో పూజించాలి.
4. గజలక్ష్మీదేవిని నీలవర్ణం రవికలగుడ్డ నీలం రంగుపూలుతో పూజించాలి.

5. సంతానలక్ష్మిదేవిని పచ్చని రవికలగుడ్డ, పచ్చని పూలతో పూజించాలి.

6. విజయలక్ష్మి దేవిని ఎరుపురంగు రవికలగుడ్డ ఎఱ్ఱని పూలతో పూజించాలి.

7. విద్యాలక్ష్మిదేవిని తెల్లటి రవికలగుడ్డ తెల్లని పూలతో పూజించాలి.

8. ధనలక్ష్మి దేవిని నీలిరంగు రవికలగుడ్డ వుంచి నీలిరంగు పూలతో పూజించాలి.

పూజఅనంతరం ఎనిమిది మంది ముత్తయిదువులకు దక్షిణ తాంబూలాలతో పూజచేసిన రవికలగుడ్డలని కూడా ఇవ్వాలి.

అష్టలక్ష్మి పూజచేసే సమయంలో సంతానలక్ష్మి అనుగ్రహం కోసం యిచ్చే దక్షిణ తాంబూలాలలో పళ్లు ఇవ్వకూడదు.

అష్టలక్ష్మి మూర్తులకి ఒక్కొక్కరికీ విడివిడిగా పూజ చేసుకోవచ్చు. లేదా అష్టలక్ష్మి మూర్తులందరికీ కలిపి పూజచేసుకోవచ్చు.

## పూజ ఏరోజు చేసుకోవాలి

అష్టలక్ష్మి మూర్తులందరికీ కలసి ఆరాధించే పూజ చేసుకోవటానికి మంచివి అయిన



వారాలు : గురు, శుక్రవారాలు

మాసాలు- శ్రావణ, మార్గశిరమాసములు

తిథులు - దశమి, పూర్ణిమ

తార - విశేషమైన తార ఫల్గుణతార

ఒక్కొక్క అష్టలక్ష్మి దేవి మూర్తులను విడివిడిగా అర్చించాలంటే

ఆ పూజ చేసుకోవడానికి మంచి వారాలు

ఆదిలక్ష్మిదేవి - ఆదివారం;

ధాన్యలక్ష్మీదేవి -సోమవారం, శుక్రవారం;

ధైర్యలక్ష్మీదేవి - మంగళవారం;

గజలక్ష్మీదేవి - సోమ, శుక్రవారాలు;

సంతానలక్ష్మీదేవి - మంగళవారం;

విద్యాలక్ష్మీదేవి - బుధ, గురు, శుక్రవారాలు;

ధనలక్ష్మీదేవిని ఏరోజైనా పూజించవచ్చును.

నిత్యం పూజచేసేవారు పటిక బెల్లం నైవేద్యం పెట్టినాచాలు కాని, విశేషపూజలు చేసే సందర్భంలో వడపప్పు, పానకం తప్పని సరిగా ఉండాలి. దక్షిణ తాంబూలాలతో వాయనాలుకూడా ముత్తయిదువులకు యివ్వాలి.



## శ్రీ అష్టలక్ష్మీప్రార్థన

**ఆదిలక్ష్మి :**

శ్రీదేవి గరుడారూఢే సృష్టి స్థిత్యంతకారిణీ
భక్తాభీష్ట ప్రదేదేవి ఆదిలక్ష్మి నమోస్తుతే॥

**ధాన్యలక్ష్మి :**

క్షీరోదార్ణవ సంభూతే సర్వసస్య స్వరూపిణీ
ధాన్యలక్ష్మి నమస్తేస్తు. లోకానాం అన్నదాయినీ॥

**ధైర్యలక్ష్మి :**

నారాయణ ప్రియే దేవి ధీరూపిణి సురార్చితే
ధైర్యలక్ష్మి నమస్తేస్తు సర్వమంత్ర స్వరూపిణి॥

**గజలక్ష్మి :**

అగజాంతం మహైశ్వర్యం భక్తేభ్యః స్వం ప్రయచ్ఛసి
గజలక్ష్మి నమస్తేస్తు హరబ్రహ్మాది వందితే॥

**సంతాన లక్ష్మి :**

సంతాన లక్ష్మి భవదీయ దయాంతరంగ జన్యం జగత్సకలజీవగణం సమగ్రమ్
ప్రజ్ఞాన్వితా సుకృతినో మమదేహిదేవిపుత్రాన్అభీష్టఫలదాయినితేప్రణామః॥

**విజయలక్ష్మి :**

వందే విజయలక్ష్మీం త్వాం సర్వకార్యార్థ సిద్ధయే
నృపవేశ్మగతానందే లోకశోకవినాశిని॥

**విద్యాలక్ష్మి :**

విద్యాలక్ష్మి నమస్తేస్తు సర్వ విద్యా స్వరూపిణీ
త్రికాల జ్ఞాన సంపన్నే బుద్ధిజాడ్యాపహారిణీ॥

**ధనలక్ష్మి :**

చంద్రానుజే లోకమాతః అష్టైశ్వర్య ప్రదాయిని
ధనలక్ష్మి నమస్తేస్తు లోకానాం భాగ్యవర్ధిని
అష్టలక్ష్మీస్తుతిమిమాం భక్తియుక్తాః పఠంతియే
తాప్రాప్నువంతి సద్భోగాన్ జ్ఞాన విజ్ఞానచేతసః॥

## పూజా విధానము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥
పూజ మొదలు పెట్టే ముందు దీపారాధన చేయాలి

శ్లో॥ ఆత్మానం అరణిం కృత్వా, ప్రణవంచ ఉత్తరారణి
ధ్యాన నిర్మథనాభ్యాసాత్। దీపం ప్రజ్వాలయామ్యాహమ్॥
అంటూ దీపం వెలిగించి దీపపు కుందులను అమ్మవారి ముందు వుంచాలి.
క్రింది శ్లోకమును చెప్పుచూ గంట మ్రోగించాలి.

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం
కురుఘంటారవం కృత్వా దేవతాహ్వాన లాంఛనమ్॥

### భూతోచ్చాటన

శ్లో॥ అపసర్పంతు తే భూతా। యే భూతా భూమిసంస్థితా
యే భూతా విఘ్నకర్తారః। తే గచ్ఛం తు శివాజ్ఞయా।
అంటూ కుడిచేతిలో నీళ్ళు తీసుకుని అన్ని వైపుల చల్లవలెను.



### భూశుద్ధిః

శ్లో ॥ పృధ్వి త్వయా ధృతా లోకాదేవిత్వం విష్ణునా ధృతా।
త్వంచ ధారయ మాందేవి పవిత్రం కురుచాసనమ్॥

### దేహశుద్ధ్యర్థం

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా
యస్మరేత్ పుండరీకాక్షం। న బాహ్యాభ్యంతరశ్శుచి పుండరీకాక్ష (3)

అంటూ నీటిని తనపై చల్లుకోవాలి. నిశ్చల మనస్సుతో దేవిపై దృష్టిని నిలిపి ఆచమనము చేయాలి. ఈ నీరు పూజకు పనికిరాదు. అందువల్ల మరియొక్క గ్లాసుతో నీరు వుంచుకోవాలి.

### ఆచమనం

ఓం కేశవాయస్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయస్వాహా
అని మూడుసార్లు నీరు స్వీకరించాలి.

ఓం గోవిందాయ నమః అంటూ నాలుగోసారి నీటిని అర్ఘ్యపాత్రలోనికి వదల వలెను. చేతులు జోడించి నమస్కరిస్తూ!

ఓం విష్ణవే నమః। మధుసూదనాయ నమః। త్రివిక్రమాయనమః। వామనాయ నమః। శ్రీధరాయనమః। హృషీకేశాయనమః। పద్మనాభాయ నమః। దామోదరాయ నమః। సంకర్షణాయ నమః। వాసుదేవాయ నమః। ప్రద్యుమ్నాయ నమః। అనిరుద్ధాయ



నమః। పురుషోత్తమాయ నమః। అధోక్షజాయ నమః। నారసింహాయ నమః। అచ్యుతాయ నమః। జనార్దనాయ నమః। ఉపేంద్రాయ నమః। హరయే నమః। శ్రీకృష్ణాయ నమః।

ఉత్తిష్ఠంతు భూతపిశాచాః। ఏతేభూమి భారకాః ఏతేషాం అవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

ఈ క్రింది మంత్రము చెప్పి ప్రాణాయామము చేయాలి.

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం। ఓమ్ తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్॥ ఓమాపో జ్యోతీ రసో మృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్॥

### సంకల్పము

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ అష్టలక్ష్మీ దేవతా ప్రీత్యర్థం శ్రీ లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం (ఏ అష్టలక్ష్మీ మూర్తిని గురించి పూజచేస్తుంటే ఆ మాత పేరు చెప్పుకోవాలి.)

శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణు రాజ్ఞయా,
ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే,
శ్వేతవరాహ కల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే,
ప్రథమపాదే, జంబూ ద్వీపే, భరతవర్షే, భరతఖండే,
అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన
....... సంవత్సరే.........ఆయనే......... ఋతౌ ......... మాసే .......పక్షే .......... తిధౌ ..........వాసరే శుభనక్షత్రే, శుభయోగే, శుభ కరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్................ గోత్రః ................ శర్మనామధేయః .... శ్రీమతిః ............ గోత్రస్య ............ ధర్మపత్నీ సమేతస్య మమోపాత్తదురితక్షయ ద్వారా శ్రీ అష్టలక్ష్మీ దేవతా ప్రీత్యర్థం అస్మాకం సహ కుటుంబానాం క్షేమ, స్థైర్య, ధైర్య, విజయ, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, సమస్త శుభఫలావాప్త్యర్థం, మమ (పూజ చేసే దేవత పేరు) లక్ష్మీదేవతా ముద్దిశ్య శ్రీసూక్త విధానేన యావచ్ఛక్తి ధ్యానా మావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే."

అని సంకల్పము చెప్పి పువ్వులు, అక్షింతలూ కుడిచేతితో తీసుకుని దేవునిపై వేసి నమస్కరించాలి. ఉదకమును ముట్టుకొనవలెను.

### కలశారాధన

ఆచమనమునకు వినియోగించిన గ్లాసు కాక మరొక గ్లాసు లేక చెంబు తీసుకుని మూడు చోట్ల గంధము అద్ది, కుంకుమ పెట్టి, గ్లాసులో నీరుపోసి, పుష్పము, అక్షితలు వేసి, పైన కుడి అరచేతిని మూత వలె బోర్లించి ఉంచి ఈ క్రింది మంత్రము చెప్పవలెను.

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః
మూలేతత్ర స్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాస్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేధోథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః
ఆపోవా ఇదగ్ం సర్వం। విశ్వాభూతా న్యాపః।
ప్రాణావాఆపః। పశవ ఆపోఽన్న మాపోఽమృత
మాపః స్సమ్రాడాపో। విరాడాపః । స్వరాడాపో
శ్చందాగ్ం ష్యాపో జ్యోతీగ్ం ష్యాపోర యజూగ్ం
ష్యాపః స్సత్య మాప। స్సర్వాదేవతా ఆపో
భూర్భువ స్సువరోమాపః ఓమ్

గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి నర్మదాసింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥

కలశోదకేన పూజాద్రవ్యాణి, దేవం, ఆత్మాని సంప్రోక్ష్య.

కలశంలో నీటిని పూజాద్రవ్యాలపై దేవునిపై, తనపై, చుట్టు ప్రక్కల చల్లుకోవాలి.

పసుపుతో చేసిన గణపతిని కుంకుమతో అలకంకరించి తమలపాకులో పెట్టి సర్వ విఘ్నశాంతికై పూజ చేయాలి.

**గణపతి పూజ**

శ్లో ॥ ఓమ్ గణానాంత్వా గణపతిగ్ం హవామహే
కలింకవీనా ముపమశ్రవస్తమమ్ । జ్యేష్ఠరాజం
బ్రహ్మణాం। బ్రహ్మణస్పతః।
ఆనశ్శృణ్వ న్నూతి భిశ్శీరసాదనమ్॥

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం, చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥
అని చెప్పి గణపతిపై పువ్వులు పెట్టాలి.

**ప్రాణప్రతిష్ఠ**

ఓమ్ ఆసునీతే పునరస్మాసు చక్షుః ప్రాణమిహనో దేహిభోగం జ్యోతిశ్చే మసూర్య ముచ్చరంత మనమతే మృడయానస్స్వస్తి। అమృతంవై ప్రాణా అమృత మాపః। ప్రాణాన్యేన యధాస్థాన ముపాహ్వయతే। శ్రీ మహాగణాధిపతయే నమః ప్రాణ ప్రతిష్ఠాపన ముహూర్తస్సు ముహూర్తోఽస్తు।

శ్రీ మహాగణాధిపతి దేవతా మావాహయామి, స్థాపయామి పూజాయామి. స్థిరోభవ,వరదోభవ, సుముఖోభవ, సుప్రసన్నో భవ, స్థిరాసనం కురు.

అంటూ గణపతివైపు పువ్వులు వేయాలి.





శ్రీ మహాగణాధిపతియే నమః ధ్యాయామి
శ్రీ మహాగణాధిపతియే నమః ఆవాహయామి
శ్రీ మహాగణాధిపతియే నమః ఆసనం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః పాదయోః పాద్యం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః హస్తయో అర్ఘ్యం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః స్నానం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః స్నానానంతరం వస్త్రం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః యజ్ఞోపవీతం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః గంధం సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః అక్షతాన్ సమర్పయామి
శ్రీ మహాగణాధిపతియే నమః ఆభరణాని సమర్పయామి.

క్రింది నామములు చెప్పుతూ గణపతికి పువ్వులతో పూజించాలి.

ఓం సుముఖాయ నమః ఓం ఏకదంతాయ నమః
ఓం కపిలాయ నమః ఓం గజకర్ణికాయ నమః
ఓం వికటాయ నమః ఓం విఘ్నరాజాయ నమః
ఓం గణాధిపాయ నమః ఓం ధూమకేతవే నమః
ఓం గణాధ్యక్షాయ నమః ఓం ఫాలచంద్రాయ నమః
ఓం గజాననాయ నమః ఓం వక్రతుండాయ నమః
ఓం శూర్పకర్ణాయ నమః ఓం హేరమ్బాయ నమః
ఓం స్కందపూర్వజాయ నమః
ఓం మహాగణాధిపతయే నమః షోడశనామ పూజాం సమర్పయామి

శ్రీ మహాగణాధిపతియే నమః ధూప మాఘ్రపయామి (అగరవత్తులు వెలిగించి చూపాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి (దీపం చూపించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమంః నైవేద్యం సమర్పయామి

బెల్లం ముక్క మీద నీళ్ళు చల్లుతూ క్రింది మంత్రం చెప్పాలి.

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం। భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్.

సత్యంత్వర్తేన పరిషించామి.

ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా అంటూ గణపతికి చూపించి, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి అంటూ పుష్పముతో నీటిని చల్లవలెను.

శ్రీ మహాగణాధిపతియే నమః తాంబూలం సమర్పయామి

(తాంబూలం వుంచాలి)

శ్రీమహాగణాధిపతియే నమః కర్పూర నీరాజనం సమర్పయామి

(కర్పూరం వెలిగించి గంట వాయిస్తూ నీరాజనం ఇవ్వాలి)

నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి (నీరు విడవాలి)

వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ,

నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా।

శ్రీ మహాగణాధిపతయే నమః మంత్రపుష్పం సమర్పయామి

(పువ్వులు వేయాలి)

శ్రీ మహాగణాధిపతియే నమః ఆత్మ ప్రదక్షణ నమస్కారాన్ సమర్పయామి.

(లేచి మూడుమార్లు ప్రదక్షిణ చేసి గణపతిపై అక్షతలు వేయాలి)

శ్రీ మహాగణపతయే నమః సర్వోపచారాన్ సమర్పయామి.

మంత్ర హీనం, క్రియా హీనం, భక్తి హీనం, గణాధిపయత్పూజితంమయా దేవ పరిపూర్ణం తదస్తుతే ॥ అనయా ధ్యానమావాహనాది షోడశోపచార పూజయాచ భగవాన్సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతిః సుప్రీతస్సు ప్రసన్నా వరదోభవతు. ఉత్తరే శుభకర్మణ్య విఘ్నమస్తు.

అక్షతలు నీరు తీసుకుని విడువవలెను. శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామి. పూజ చేసిన పువ్వులను తీసుకుని కళ్ళకు అద్దుకుని ఆడవారు తలలో, మగవారు చెవిలో పెట్టుకోవాలి.

## శ్రీ అష్టలక్ష్మీ పూజ

ప్రాణప్రతిష్ఠా

ఓం హ్రాం హ్రీం క్రోం యం రం లం వం శం షం శం క్షం

శ్రీమహాలక్ష్మీ ప్రాణ ఇహ ప్రాణః। ఓం హ్రాం హ్రీం క్రోం

శ్రీమహాలక్ష్మి సర్వేంద్రియ మనోవాఙ్మనశ్చక్షు

శ్రోత్ర జిహ్వ ఘ్రాణ ఇహై వాగత్య, సుఖంచిరతిష్టంతు స్వాహా।

ఓం అసునీతే పునస్మార్య ముచ్చరంత

మనుమతీ మృడయాన స్వస్తి। అమృతంవై ప్రాణా

అమృతమాపః ప్రాణానేన యధాస్థాన ముపహ్వయతే

సాంగాం సాయుధం సవాహనం, సశక్తిం, పతీపుత్ర

పరివార సమేతం శ్రీమహాలక్ష్మీం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి

పువ్వులు అక్షితలు కలశంపైన వేయాలి" ఇలాగే మిగతా లక్ష్ముల స్థానాల వద్ద కూడా వేయాలి).



**ధ్యానం :**

లక్ష్మీంక్షీర సముద్ర రాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం

దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం

శ్రీమన్మంద కటాక్షలబ్ద విభవద్బ్రహ్మేంద్ర గంగాధరాంత్వాం

త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియాం॥

(ఒకేసారి అష్టలక్ష్మీదేవేరులందరి పూజ చేసుకుంటే అష్టలక్ష్మీ దేవతాయైనమః అని చెప్పుకోవాలి. లేదా ఏ లక్ష్మీరూపాన్ని పూజిస్తున్నామో ఆ లక్ష్మీదేవి పేరు చెప్పుకోవాలి.)

### ఆవాహనం (పిలుపు)

1. హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥

శ్లో॥ సహస్రదళ పద్మాస్థాం స్వస్థాంచ సుమనోహరాం ।
శాంతాం చ శ్రీహరేః కాంతాం తాంభజే జగతాం ప్రసూః॥
అష్టలక్ష్మీ దేవతాయై నమః ఆవాహనం సమర్పయామి।
ఆసనం (కూర్చోబెట్టుట)

మ॥ తాం మ ఆవహజాతవేదో లక్ష్మీ మనపగా మినీం।
యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహం॥

శ్లో॥ అమూల్యరత్న సారంచ నిర్మితం విశ్వకర్మణా।
ఆసనం చ ప్రసన్నంచ మహాలక్ష్మీ ప్రతిగృహ్యతాం॥
శ్రీ అష్టలక్ష్మి దేవతాయై నమః దివ్య సువర్ణ సింహాసనం సమర్పయామి
పాద్యం - (దేవికి కాళ్ళు కడుగుట)

మ॥ అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీం ।
శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మాదేవీ ర్జుషతాం॥

శ్లో॥ శుద్ధం గంగోదకమిదం సర్వవందిత మీప్సితం।
పాపేధ్మవహ్నిరూపం గృహ్యతాం కమలాలయే॥

శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః పాదయోః పాద్యం సమర్పయామి।

అని అంటూ పంచపాత్రలోని నీరు పుష్పంతో దేవి పాదాలపై చల్లాలి.

అర్ఘ్యం (చేతులు కడుగుట)

మ॥ కాం సోస్మితాం హిరణ్య ప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం
తర్పయంతీం। పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియం॥

శ్లో॥ పుష్ప చందన దూర్వాది సంయుతం జాహ్నవీజలం।
శంఖ గర్భ స్థితం శుద్ధం గృహ్యతాం పద్మవాసినీం॥

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

అంటూ పంచపాత్రలోని నీటిని అమ్మవారిపై పుష్పంతో కొద్దిగా చల్లాలి.

ఆచమనీయం (దేవికి మంచినీరు ఇవ్వటం)

మ॥ చంద్రాం ప్రభాసాం యశసాజ్వలం తీం
శ్రియం లోకే దేవజుష్టా ముదారాం।
తాం పద్మినీమీగ్ం శరణమహం ప్రపద్యే
లక్ష్మీ ర్మే నశ్య తాం త్వాం వృణే॥

శ్లో॥ పుణ్యతీర్థాధికం చైవ విశుద్ధం శుద్ధిదం సదా।
గృహ్యతాం కృష్ణకాంతే చ రమ్య మాచమనీయకం॥
శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.
అంటూ పంచపాత్రలోని నీరు పుష్పంతో దేవిపై చల్లాలి.

శుద్ధోదక స్నానం (దేవికి స్నానం - అభిషేకం)

(పాలు, పెరుగు, నెయ్యి, పంచదార, తేనె, వీటికి కొద్దిగా ఒక చిన్న గ్లాసులో కలుపుకొని వుంచాలి. వీటినే పంచామృతాలు అంటారు.)

అష్టలక్ష్మీ దేవతాయై నమః పంచామృత స్నానం సమర్పయామి
పంచామృతస్నానానంతరం శుద్ధోదకం సమర్పయామి

మ॥ ఆదిత్య వర్ణేతపసోధిజాతో వనస్పతి స్తవ వృక్షోథబిల్వః
తస్యఫలాని తపసానుదంతు మాయాంతరాయాశ్చబాహ్యాఅలక్ష్మీ

శ్లో॥ సుగంధి విష్ణు తైలంచ సుగంధా మలకీజలం।
దేహ సౌందర్య బీజం చ గృహ్యతాం శ్రీహరిప్రియే॥
శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః శుద్ధోదకేన స్నపయామి.
ఏ లక్ష్మికి అయితే పూజచేస్తున్నామో ఆ దేవి పేరు చెప్పి పంచపాత్రలోని నీటిని పుష్పంతో దేవిపై చల్లాలి.

వస్త్రం (బట్టలు - చీర రవికె)

మ. ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ
ప్రాదుర్భూతోఽ_స్మి రాష్ట్రేస్మిన్ కీర్తి మృద్ధిందదాతుమే॥

శ్లో ॥ సౌందర్య ముఖ్యాలంకారం సదా శోభా వివర్ధనం।
కార్పాసజం చక్రిమజం వసనం దేవి గృహ్యతాం॥

శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః వస్త్రయుగ్మం సమర్పయామి చెప్పి వస్త్రం వేయాలి. కొద్దిగా పత్తిని పసుపుతో తడిపితే అది శుభ్ర వస్త్రం అవుతుంది. లేదా కలశంపై పెట్టిన జాకెట్టు ముక్కను అయినా ముట్టుకోవచ్చు. లేదా మంటపం ప్రక్కన చీరఅయినా పెట్టవచ్చు. అలాపెట్టిన చీరని ఆ తల్లిని తలచుకుని పూజానంతరం ముత్తయిదువకి వాయనంతో పాటు యివ్వాలి.

వృజన చామరం (విసనకఱ్ఱతో వీచటం)



మ. క్షుత్పిపాసామలాం జ్యేష్ఠాం మలక్ష్మీం నాశాయామ్యహమ్।
అభూతి మసమృద్ధించ సర్వాన్నిర్ణుదమే గృహాత్॥

శ్లో॥ శీతవాయు ప్రదేచైవ దేహే చ సుఖదేవరే।
కమలే గృహ్యతాం చేమే వ్యజనం శ్వేత చామరే॥
శ్రీ అష్టలక్ష్మీ దేవతాయైనమః వ్యజన చామరాభ్యాం వీజయామి,
ఒక పుష్పంతో విసిరినట్టుగా చేసి ఆ పుష్పం దేవిపై వేయాలి.

చందనం (గంధం)

మ. గంధ ద్వారాం దురాధర్షాం నిత్య పుష్టాంకరీషిణీం।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియం॥

శ్లో॥ మలయాచల సంభూతం వృక్షసారం మనోహరం।
సుగంధ యుక్తం సుఖదం చందనం దేవి గృహ్యతాం॥
శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః గంధాం ధారయామి।
దేవిపై కొద్దిగా పుష్పంతో గంధం వేయాలి.

ఆభరణాలు (నగలు)

మ. మనసఃకామమాకూతిం వాచస్పత్య మశీమహి।
పశూనాగ్ం రూపమన్నస్య మయిశ్రీశయతాం యశః॥

శ్లో॥ రత్నస్వర్ణవికారంచ దేహాలంకార వర్ధనం।
శోభనం శ్రీకరం చైవ భూషణం ప్రతి గృహ్యతాం॥
శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః సర్వాభరణాని సమర్పయామి.
పుష్పం, అక్షతలు దేవిపై వేయాలి.

**పుష్పాలు**

మ. కర్దయేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ
శ్రియంవాసయ మేకులే మాతరం పద్మమాలినీం॥

శ్లో॥ నానాకుసుమనిర్మాణం బహుశోభప్రదం వరం।
సర్వభూత ప్రియం శుద్ధం మాల్యం దేవి ప్రకృతిగృహ్యతాం॥
శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః పుష్పం సమర్పయామి.
పువ్వులు తీసుకొని దేవిపై వేయాలి.

శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలియాన్ తండులాన్ శుభాన్।
హరిద్రాకుంకుమో పేతాన్ గృహ్యతామబ్ధి పుత్రికా ॥
శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః అక్షతాన్ సమర్పయామి.
అక్షతలు వేయవలెను.

### అమ్మవారి అధాంగ పూజా

ఓం చంచలాయై నమః - పాదౌ పూజయామి
ఓం చపలాయై నమః - జానునీ పూజయామి
ఓం పీతాంబరధరాయై నమః - ఊరూం పూజయామి
ఓం కమలవాసిన్యై నమః - కటిం పూజయామి
ఓం పద్మాలయాయై నమః - నాభిం పూజయామి
ఓం మదనమాత్రే నమః - స్తనౌ పూజయామి
ఓం లలితాయై నమః - భుజాన్ పూజయామి
ఓం కంబుకంఠ్యై నమః - కంఠం పూజయామి
ఓం స్వర్ణకంకణాయై నమః - హస్తౌ పూజయామి
ఓం సుముఖాయై నమః - ముఖం పూజయామి
ఓం శ్రియై నమః - ఓష్ఠం పూజయామి
ఓం సునాసికాయై నమః - నాసికాం పూజయామి
ఓం సునేత్రాయై నమః - నేత్రే పూజయామి
ఓం రమాయై నమః - కర్ణౌ పూజయామి
ఓం కుమార్యై నమః - శిరః పూజయామి
ఓం శ్రీమహాలక్ష్మీ దేవ్యై నమః - సర్వాణ్యంగాని పూజయామి

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః సర్వాంగ పూజాం సమర్పయామి। పూజాయామి అన్నప్పుడల్లా ఒక్కొక్క పుష్పం దేవిపై వేయాలి. తరువాత శక్త్యానుసారం అష్టోత్తర శతనామాలు లేదా సహస్రనామావళితో గాని పూజ చేయాలి.

అష్టోత్తర శత నామార్చనం కరిష్యే

(వరుసగా ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, గజలక్ష్మి, సంతాన లక్ష్మి, విజయలక్ష్మి, విద్యాలక్ష్మి, ధనలక్ష్మి అమ్మవార్ల అష్టోత్తర శతనామావళి ముందే యివ్వటం జరిగింది. ఆయా దేవతా మూర్తుల నామావళి చదువుకోవాలి.) శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః అష్టోత్తర శతనామావళి సమర్పయామి ఏ లక్ష్మీదేవిని అయితే పూజ చేస్తున్నామో ఆ తల్లి యొక్క అష్టోత్తర శతనామావళి చదవాలి. అష్టలక్ష్ములను పూజించే మాటైతే ఆయా స్థానాలలోనికి ఆయా లక్ష్ములను ఆయా అష్టోత్తరశతనామావళి చదివి ఆయా రంగు పువ్వులతో పూజ చేయాలి.

### ధూపం (అగరవత్తులు)

మ. అపస్స్రజం తు స్నిగ్ధాని చిక్లీతవసమే గృహే।
నిచదేవీం మాతరం శ్రియం వాసయ మేకులే।



శ్లో ॥ వృక్షనిర్యాస ధూపంచ గంధద్రవ్యాది సంయుతం।
శ్రీకృష్ణ కాంతే ధూపం చ పవిత్రం ప్రతిగృహ్యతాం ॥
శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః అగరు ధూప మాఘ్రాపయామి.
అగరు ధూపం చూపాలి.

### దీపం

మ. ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం సువర్ణాం హేమమాలినీం।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాత వేదో మమావహ॥

శ్లో॥ జగచ్చక్షు స్వరూపం చ ప్రాణిరక్షణకారణి
ప్రదీపం శుద్ధరూపం చ గృహ్యతాం పరమేశ్వరీ॥
శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః దీపం దర్శయామి. ధూప, దీపానంతరం ఆచమనీయం సమర్పయామి అంటూ పుష్పంతో నీళ్ళు చల్లాలి.

### నైవేద్యం

మ. ఆర్ద్రాం యః కరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీం।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ।

శ్లో ॥ నసోపహరరూపంచ నానారస సమన్వితం ।
నానాస్వాదుకరం చైవ నైవేద్యం నివేదయామి॥

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః నైవేద్యం నివేదయామి. నైవేద్యం సమర్పించాలి. కొబ్బరికాయ, అరటిపళ్ళు, వడపప్పు, పానకం, చక్కెర పొంగలి మొదలైన పదార్థాలను మంటపానికి కుడిపక్కగా పెట్టుకుని వాటిపై తులసీదళాలు వుంచి నీళ్ళు చల్లుతూ క్రింది మంత్రం చెప్పి అయిదుసార్లు దేవికి చూపించాలి.

ఓం భూర్భువస్సువః తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేని పరిషించామి.

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః నైవేద్యంసమర్పయామి. అమృతమస్తు అమృతమస్తు, అమృతోపస్తరణ మసి ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానా యస్వాహా, ఓంఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి, అంటూ మూడు మార్లు పంచపాత్రలోని నీరు ఉద్ధరిణితో ప్రక్కన వున్న పళ్ళెములో వేయాలి.

### తాంబూలం

మ. తాం మాఆవహజాతవేదో లక్ష్మీ మనపగామినీమ్।
యస్యాం హిరణ్యం ప్రభుతిం గావోఽ ద్యాశ్యోశ్వాన్ విందేయం పురుషానహమ్

శ్లో॥ తాంబూలం చ వరం రమ్యల కర్పూరాది సువాసితమ్।
జిహ్వా జాడ్య చ్ఛేదకరం తాంబూలం దేవి ప్రతిగృహ్యతామ్

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః తాంబూలం సమర్పయామి. మూడు తమల పాకులు, వక్క, దక్షిణ, దేవికి ప్రక్కన పెట్టాలి.

### కర్పూర నీరాజనం

మ. యశ్శుచిః ప్రియతో భూత్వా జుహు యాదాధ్యమన్వహం
శ్రియః పంచదశర్చంచ శ్రీకామః సతతం జపేత్

శ్లో॥ కర్పూర దీప తేజస్త్వం అజ్ఞాన తిమరాపహం
దేవి ప్రీతికరం చైవ మమ సౌఖ్యం వివర్ధయ॥

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః కర్పూర మంగళనీరాజనం దర్శయామి

కర్పూరం వెలిగించి, మూడుసార్లు దేవికి చూపించాలి. తిరిగి పంచపాత్రలోని నీటిని ఉద్ధరిణీతో తీసుకుని ప్రక్కపళ్ళెంలో పోస్తు కర్పూర నీరాజనానంతరం అష్టలక్ష్మీదేవతాయై నమః ఆచమనీయం సమర్పయామి అని చెప్పాలి.

(లేచి నిలబడి చేతిలో పుష్పాలు వుంచుకుని మంత్రపుష్పం చెప్పాలి)

### మంత్ర పుష్పం

ఓం మహాలక్ష్మైచ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి తన్నీ లక్ష్మీః ప్రచోదయాత్
సద్భావ పుష్పాణ్యాదాయ సహజప్రేమరూపిణీ ।
లోకమాత్రే దదామ్యద్య ప్రీత్యా సంగృహ్యతాం సదా॥
సర్వమంత్ర ప్రదే దేవీ సర్వయంత్రాంతరాత్మికే
మంత్రపుష్పం గృహనీదం సర్వమంత్రణి మంత్రిణీ॥
శుద్ధ లక్ష్మీః మోక్ష లక్ష్మీ జయలక్ష్మి సరస్వతీ
శ్రీలక్ష్మీః వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా॥

శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః మంత్రపుష్పం సమర్పయామి। పుష్పాలు దేవిపై వేయాలి.

### ఆత్మ ప్రదక్షిణ

యాని కాని చ పాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణస్యంతి ప్రదక్షిణ పదే పదే॥
పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాప సంభవ
త్రాహిమాం కృపయాదేవి శరణాగత వత్సలా॥
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ.



తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష మహేశ్వరీ ॥

శ్రీ అష్టలక్ష్మీదేవతాయై నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. పుష్పాలు, అక్షతలు తీసుకుని మూడుసార్లు కుడివైపుగా ప్రదక్షిణం తిరిగి పుష్పాలు దేవిపై వేయాలి.

శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః ఛత్రం ఆచ్ఛాదయామి, చామరం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, ఆందోళికామరోహయామి, సమస్త రాజోపచార శక్త్యోపచార, భక్త్యోపచార, మంత్రోపచార, దేవోపచార, సర్వోపచారాన్ పూజాం సమర్పయామి అంటూ పుష్పాలు వేయాలి.

యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతం
మంత్రహీనం క్రియాహీనం భక్తహీనం మహేశ్వరీ
యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే

అనయా ధ్యానా మావాహనాది షోడశోపచార పూజయాచ భగవతీ శ్రీ అష్టలక్ష్మీ దేవతా సుప్రీతా సుప్రసన్నో వరదో భవతు॥

అంటూ చేతిలోనికి అక్షతలు తీసుకుని పంచపాత్రలోని నీరు చేతిలో పోసుకుని పళ్ళెంలో వదలవలెను.

ఏతత్ఫలం శ్రీ అష్టలక్ష్మీ దేవతార్పణ మస్తు.

శ్రీదేవి యొక్క పూజా పుష్పాలను, అక్షతలను తీసుకుని కళ్ళకు అద్దుకుని శ్రీదేవీ ప్రసాదం శిరసా గృహ్ణామి అని చెప్పి పూజ చేసిన వారు తీసుకుని మిగిలిన వారికి కూడా యివ్వాలి. వచ్చిన వారందరికి పుష్పాలు, ప్రసాదం ఇవ్వాలి.

### ఉద్వాసన

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాని ప్రథమాన్యాసన్
తేహనాకం మహిమానస్సచంతే యత్ర పూర్వేసాధ్యాస్సంతిదేవాః

శ్రీ అష్టలక్ష్మీ దేవతాయై నమః యథాస్థానం ప్రవేశయామి అంటూ మండపమును, కలశాన్ని కొద్దిగా కదపాలి.

### క్షమా ప్రార్థన

అపరాధ సహస్రాణి క్రియంతేఽహర్నిశంమయా।
దాసోయమితో మాం మత్వా క్షమస్య పరమేశ్వరీ॥
రక్ష రక్ష మహేశ్వరీ
సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధకే
శరణ్యే త్ర్యయంబికే గౌరీ నారాయణీ నమోస్తుతే

## వాయనం

మండపములో వుంచిన 8 రవికెల గుడ్డలని ఎనిమిది  మంది ముత్తయిదువలకు లక్ష్మీస్వరూపులుగా భావిస్తూ ఇవ్వాలి. రవికెలగుడ్డ, తాంబూలం, రెండు పళ్ళు, దక్షిణ, పుష్పాలు ఇవి అన్నీ ఇవ్వాలి.

మండపముపైన పోసిన బియ్యాన్ని, తువ్వాల్ని, మరునాడు గుడిలో బ్రాహ్మణునికి దక్షిణతో సహా ఇవ్వాలి.

కలశంలోని నీటిని తాము తీర్థంగా స్వీకరించి, అందరికి తీర్థంగా ఇచ్చి, యిల్లు అంతా చల్లుకొని మిగతా నీటిని చెట్లలో పోయాలి.

ఈ విధంగా అష్టలక్ష్మీ పూజ చేసుకున్న వారికి ఆ తల్లి కటాక్షం పరిపూర్ణముగా లభించి తప్పక ఆ తల్లి వారి మనోవాంఛలను తీరుస్తుంది. భక్తి, శ్రద్ధ, నమ్మకం వున్న చోట ఫలితం వెంటనే కనిపిస్తుంది.

**సర్వం శ్రీ అష్టలక్ష్మీఅర్పణమస్తు**



## శ్రీలక్ష్మీ షోడశోపచార పూజ పాట

శ్రీలక్ష్మీ నీకూ  సేవా చేసీ పూజింతునమ్మా
దోషమెంచాకా కృపా చేసి గైకొనూమమ్మా ॥శ్రీలక్ష్మీ॥
పుత్తడీ బొమ్మా అలా చిత్తారూగన్నా కొమ్మా

ధ్యానం : చిత్తమూనా ధ్యానమూ చేతునిను మాయమ్మా ॥శ్రీలక్ష్మీ॥
పిలచువారీ కోయనీ పలికెడూ దేవీ నీవూ

ఆవాహనం: చెలి మనసారా నినూ పిలచెదా విచ్చేయవమ్మా ॥శ్రీలక్ష్మీ॥

ఆసనం : బంగరూ రతనాములా సింగపూగద్దేయిదీ
మంగళావాతీ కృపా మదిని కూర్చుండావమ్మా ॥శ్రీలక్ష్మీ॥

అర్ఘ్యం : మాననీయా మూలగూ మణికలాశా మూలనూ

పాద్యం : అణకువాగా నీత్తూ గనూ అర్ఘ్యపాద్యామూలనూ ॥శ్రీలక్ష్మీ॥

ఆచమనం : పావనోదకామిదీ దేవి ఆచామానమూ గావింపుమమ్మా

స్నానం : దివ్య సుగంధాయుతా దీప్సితా జాహ్నవీతో యమునా
స్నానామూ గావింపుమమ్మా

వస్త్రం : పట్టు పీతాంబ్రాముల్ చుట్టు జల్తారూలవీ
కట్టి కన్నూలా విందూ పెట్టుమూ మా తల్లీ ॥శ్రీలక్ష్మీ॥



కుంకుమ : విదియ చందూరునకూ నుదుటి నాపెట్టీనీదూ
నుదుట కుంకూమా ముదము దిద్దేదానమ్మా ॥శ్రీలక్ష్మీ॥

ఆభరణాలు : అమలాదేదీప్యాములా యజ్ఞ సూత్రాములనూ
కమనీయ హారాములా గళమునా వేసెదనూ ॥శ్రీలక్ష్మీ॥

గంధం : అగరు జువ్వాజీనెలా అత్తరూ పన్నీరులా
ఘుగఘుగా వాసించెటీ పునుగు గంధామూపూతూ ॥శ్రీలక్ష్మీ॥

పుష్పం : సరజిజా సౌగంధికాచంపకా మందారకా
కురుదవనామల్లీకా దీవరకుసుమాములు గొనీ ॥శ్రీలక్ష్మీ॥

ధూపం : అగరు సాంబ్రాణూలనూ సొగసగూనలా వాసా
ఘుగలోసగే దానిదే జగములా తల్లీ నీకూ ॥శ్రీలక్ష్మీ॥

దీపం : హవ్యంగ లీనాముల్ అచ్చకర్పూరాముతో
బాయినీదీపాములూ బిరపేదానీదరినీ ॥శ్రీలక్ష్మీ॥

నైవేద్యం : పంచభక్ష్యాముల నూకావించితీ నైవేద్యమూ
గాంచకా ప్రీతీనారాగించి రక్షించావమ్మా ॥శ్రీలక్ష్మీ॥

తాంబూలం : పచ్చకర్పూరాములా పండుటాకులాతోనూ
పచ్చిపోకలాదిగా నిచ్చి తీ విడీయమూ ॥శ్రీలక్ష్మీ॥

సలితానాంతా దయా జలధినీది
నా కీయామనీ ప్రార్థించు చుంటి నిదేబ్రోచి రక్షించవమ్మా॥శ్రీలక్ష్మీ॥
మానకానీదూపద ధ్యాన సుధాపానమూ చేయా
ననూ బరపుమూ మ్రొక్కెదనూ ॥శ్రీలక్ష్మీ॥

షోడశోపాచారాపూజ చేసి వేడేదానీదాయనూ
నేడు సత్యాంబికామమూ దయ చూడవమ్మా ॥శ్రీలక్ష్మీ॥



